# పాదుకాపట్టాభిషేకము

గ్రంథకర్త:
బ్రహ్మశ్రీ కీర్తిశేషులైన
పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు



ప్రకాశకులు:
కురుకూరి సుబ్బారావు సన్,
సరస్వతీ బుక్ డిపో,
విజయవాడ-1,
1954




 [వెల 1-12-0

# పాదుకా పట్టాభిషేకము

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారిచే

రచింపఁబడినది.



ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు సన్,

(స్వరాజ్య వేంకటసత్యనారాయణరావు)

ప్రొప్రయిటరు:

సరస్వతీ బుక్ డిపో, విజయవాడ.

పదవ కూర్పు 1000 ప్రతులు

బాలప్రభా ప్రెస్, బాపీనగర్, గుణదల.

1955



వెల 1—12—0

# ఇందలి పాత్రములు



**పురుషులు**

దశరథుడు — కోసలదేశాధిపతి

రాముడు
భరతుడు
లక్ష్మణుడు
శత్రుఘ్నుడు } దశరథపుత్రులు

వసిష్ఠుడు
జాబాలి } మునులు

సుమంత్రుడు — రాజమంత్రి

[illegible]
[illegible] } ద్వారరక్షకులు

విజయశర్మ
సోమనాథుడు
[illegible]
[illegible]
శివకుడు } బ్రాహ్మణులు

**స్త్రీలు**

కౌసల్య
సుమిత్ర
కైకేయి } రాజభార్యలు

సీత — రాముని పత్ని

మంథర — కైకేయి పరిచారిక

&C. &C.








ప్రొప్రయిటరు: సరస్వతి బుక్ డిపో, విజయవాడ

పా—ఓహో! నర్మదాపురుషోత్తమ, సారంగధర, ప్రచండ చాణక్య, రాధాకృష్ణ నాటకంబులింతకుఁ బూర్వము శృంగార, కరుణ, శాంత భక్తిరసప్రధానంబుగ వ్రాయఁబడియున్నవి నటించిన యుత్త మేనా! మనఁ గృతిపతియగువాఁడె కాని నిక నాయకప్రసంగ మెక్కడ—అ లేమ గాని యీనాటక మెయ్యదియో తెల్పుఁడు

సూ—శ్రీమద్రామాయణ పరిపూర్ణాంశసంభూతుండును, నిసర్గ సుధామధురనామప్రథితుండును, జగత్పావనుండును నగు శ్రీరామ చంద్రు చారిత్రము, నాటకనామము పట్టభంగరాఘవమను పాదుకా పట్టాభిషేకము. పారిపార్శ్వకా! ఈకవి ధన్యుండు సుమా!

తే. గీ. పసిఁడికిని గమ్మదనమావి పట్టినట్లు
లందగానికి సుగుణంబు లబ్బినట్లు
నాయకుం డయ్యె నీతని నాటకమున
కార్తరక్షకుఁడు దశరథాత్మజుండు.

పారి—మనుష్యమాత్రుఁడైన యొక రాచపట్టిఁ బట్టికొని బట్టువలె నిట్టు పొగడెద వేమి?

సూ—సరిసరి! పారిపార్శ్వకా!

సీ. సత్యపాలనమును శాంతస్వభావంబు
స్వసుఖపరాఙ్ముఖత్వంబు భ్రాతృ
వత్సలతయుఁ బితృభక్తి నిస్తులశక్తి సౌశీల్యశక్తి
శాపవిమోచకశక్తిమహిమ
వృద్ధసన్మానంబు నేకపత్నీవ్రత
త్వం బాగతానాగతవిమరతయుఁ
బరగుణశ్లాఘయు శరణాగతత్రాణ
మనసృశత్త్వాపాలనాఢ్యతయును

తే. గీ. దుష్టనిర్మూలనంబును శిష్టపోష
ణంబు మున్నగాఁగల సుగుణంబు లన్ని
వచ్చి మూర్తిభవించి యీవసుధఁ బుట్టె
నల్ల కౌసల్యాగర్భమం దతఁడు నరుఁడె?

పా—అట్లయిన నుపనిషదుదితపరతత్త్వ మీరాముఁడేనా?

సూ—ఆ! ఆయుపనిషద్గమ్యుఁడే రాముఁడు. ఇది ముమ్మాటికి నిజము.

తే. గీ. సచ్చిదానందతత్త్వంబు సొచ్చి మేను
సనుద్గఁ జెడకుండ మెలఁగంగవచ్చు నంచు
జనులకును దేటపఱుపఁగ జన్మ మొందె
నదియు శ్రీరామచంద్రుఁడై యుపనిషదము.

మఱియును నేను బట్టినటు నతిశయోక్తులాడితి నంటివి. అదియు నసత్యమే సూమా!

తే. గీ. మేము మనబుద్ధితోడ నమేయుఁ బూర్ణ
ముగను వర్ణింపఁగా నెట్లు తగును మనుజుఁ
డందుచే రాఘవునియెడ నతిశయోక్తు
లన్నియునుగూడ హీనోక్తులౌను సఖుఁడ.

కావున నేను బట్టునుట యెంతనిజమో శ్రీరామచంద్రుఁడు మానవుండనుటయు నంతియు నిజము.

పా—ప్రస్తుతాంశమున మిమ్ము దూరముగాఁ దీసికొనిపోయి శ్రమపెట్టినందులకు నన్ను మన్నింపుఁడు.

సూ—అందుచేతనే నీవు సత్యమునకు సమీపముగా రాఁగలిగితి వని సంతోషింపుము.

పా—ఈనాటకము రాధాకృష్ణనాటకమువలె భక్తిరస ప్రధానమేనా?

సూ—రామ గుణమహిమానుకథనపావనంబైన నాటకమౌటచే భక్తిరసప్రధానమా యని వేఱె యడుగనక్కఱ లేదు. కాని భక్తిలో గలసి కరుణరసము గూడ నున్నది. ఆకరుణమునకు మంథరాసహితయగు కైకయే మూలకారణము.

పా—రామజననీసపత్ని యగు కేకయరాజపుత్త్రియు నామె సేవకురాలునా?

సూ—ఔను! గీ. మృదులసురభిళ మల్లికామిళితమాల
నమ్మి యుండలి పాత్రవర్గమ్ము గాని

దానిలో నల్లిపూవులు దవిలె రెండు
వక్రచారిత్ర మందరావనిత, కైక.

ఆయినను వారిం దూఱ నేల?

తే. గీ. మేలిచెమ్మటచేతఁ దెమ్మెరలహాయి
గులకజాలచే వజ్రాలకుఁ గలవిలువ
చూడఁబడునన్లోరఘురాము సుగుణవితతి
ప్రకటితం బయ్యె వీరి వక్రత్వమునను

పా—రాధాకృష్ణనాటకమున భక్తిశృంగారములు గలిసిన ట్లీ నాటకమున భక్తికరుణములు గూడినవికదా! వానికిఁగూడఁ బరస్పర సంబంధ మున్నదా యేమి?

సూ—

తే. గీ. దైవమునుగూర్చి తచ్చరితంబుఁగూర్చి
విమలచిత్తత భక్తుఁ డేవేళఁ దలఁచు
నాతఁడిని మేను గంపింప నతని కన్ను
దోయి బాష్పపూరంబులఁ దొగుచుండు.

కావున భక్తికరుణములకుఁ జేరిక యున్నదో లేదో నీవే యోజింపుము.

పా—ఆహా! యేమి యీరసస్వభావము! ఇప్పుడు నే జేయవలయు సాహాయ్య మెద్దియో శీఘ్రంబె సెలవిందు

సూ—మఱేమున్నది? నీవు పోయి యేతన్నాటక ప్రదర్శనావశ్యకపాత్రపరికరాదుల సిద్ధంబు చేయవలయును.

గీ. దశరథుఁడు వసిష్ఠర్షి మంతనముఁ గొనుచు
నతనినుతు రామచంద్రపట్టాభిషేక
కార్యమును జేయఁ బూనిన కరణిఁగాఁగ
వేగఁ గావింపు పనుల నిర్విఘ్నముగను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

—(:o:)—

# శ్రీ పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## ప్రథమాంకము

ప్రదేశము—అయోధ్య—దశరథుని సభాశాల

(ప్రవేశము...దశరథుఁడు వసిష్ఠుఁడు సుమంత్రుఁడు.)

దశ—మంత్రీ! తలచుకొనినపని శీఘ్రముగఁ గాకుండ నిది యెంత యంతరాయము కలిగించినది?

వసి—మీరు సందేహింపవలదు. అది యనావశ్యకమే కాదని నాయభిప్రాయము

దశ—ఎందు చేతనో యానతిచ్చెదరా?

వసి—అది యిదివఱకే యాచరింపబడుటచేత—

దశ—భగవానుఁడా! అది యెట్లు?

వసి—గీ. వంచ నెంచి రాజులు తల వంచుకొనిరి
యెత్త నెంచి యంజలి తల కెత్తుకొనిరి
యట్టి హరువిల్లు చెఱకును హస్తివలెను
విఱిచె నతఁ డది దిగ్జయవిధము కాదె?

అఖిల రాజన్య మూర్ధన్యసమాజసాంద్ర మగు తత్సభలో శ్రీరామచంద్రునిచే జరిగింపఁబడిన యీమహాకార్యముకంటె దిగ్విజయమేమున్నది? ఆవశ్యకమనియెవ్వరో మీతోఁ జెప్పిన దిగ్విజయమర్యాద యీ రూపకముగఁ దీఱినది. కావున నీవు సంకల్పించుకొనిన శ్రీరామచంద్ర పట్టాభిషేక మవశ్యము జరిగింపవచ్చును.

సుమం—పునర్దిగ్విజయమున కవకాశ మేమున్నది? అందఱును సామంత రాజులే యయినపుడు దిగ్విజయ మెట్లు?

దశ—వసిష్ఠభగవానుఁడా! సుమంత్రుఁడా! మీ యిద్దఱి యభిప్రాయము దిగ్విజయ మిపు డనవసరమనియే కాదా?

వసి } ఆ—
సుమం }

దశ—అట్లయిన దాశరథి పట్టాభిషేకమును వెంటనే చేయుట కభ్యంతర మేమున్నది?

వసి—ముహూర్తనిర్ణయము.

వసి }
సుమం } —హా! హారి!

సీ. బహుయాగనిరతిచే నఖిలబర్హిర్ముఖదేవ
తానీకసంతుష్టి నాచరించి
అమరారిజంతుబాధాహరణంబుచే
నఖిలతాపసతుష్టి నాచరించి
సంతతిచేఁ గర్మసంతతిచేఁ బితృ
దేవతాళిని పరితృప్తిఁ జేసి
గోసువర్ణాంబరక్షోణిప్రదానంబు
చేతను విప్రులఁ బ్రీతిఁ జేసి

గీ॥ ఇష్టభోగాళిచేత సంతుష్టి నొంది
యెన్ని యేఁడులనుండియో యిలను నేలు
చుంటి నిఁక నెన్నివర్షంబు లుర్విబత్వ
మెడనుగట్టుకొని తిరుగవలయు నయ్య!

గీ. అంచెచివర సమీపించు నశ్వము తన
బరువు వేఱొకగుఱ్ఱంబు పైనఁ బెట్టి
నద నగునని ముదము గనునటులు భువిని
సుతునిపైఁ బెట్టి మోదసంగతిని గాంతు

గీ. జగదుపద్రవరీతి మజ్జన్మపత్రి
వైఖరియు స్వప్నవిధమునుబట్టి యేను
దివసములవాఁడ నని తోఁచు దేవ! యిపుడె
పట్టి కీరాజ్యపట్టంబుఁ గట్టరాదె?

వసి—రాజేంద్రా! ఈ దినము బొత్తిగ బాగుగ సున్నదికాదు.

దశ—ఏల?

వసి—ఈదినమునఁ బునర్వసు నక్షత్రమగుటచే, రామభద్రునకు జన్మతార—

దశ—“ప్రథమే ప్రథమం త్యాజ్యమ్” అనినాఁడనియా?

సుమం—(తనలో) ప్రథమకళత్రపుత్రుని రాజ్యమందుంచ దలంచుచుండఁ “ప్రథమే ప్రథమం త్యాజ్యమ్” అను నమంగళవాక్యములు వచ్చెనేమి? హారి హారి!

దశ — నేఁడు పుష్యమీనక్షత్ర మగుటచేత రామునికి సంపత్తారయగును గాదా ?

వసి — నేఁడు తారాబలమే కాదు. ఉదయలగ్నము రామకార్యమునకు సర్వబలాన్వితమై యున్నది.

గీ. తామరసవైరి పుష్యమీతారఁ జేరి
యుండు పరమపవిత్రముహూర్తమందు
బ్రిథితసౌభాగ్య సామ్రాజ్యవైభవ్యరమను
రామచంద్రునితోడఁ జేర్పంగవలయు

సుమం—గీ. భవపవిత్రపునర్వసుప్రాంతమైన
పుష్యమీతార యభిషేకమునను నిల్చి
పూతతను జెందు పూజ్యతాపూజ్యత లిల
సదసదంతికస్థితిఁబట్టి యుదయమగును.

దశ — (తనలో) నిజమే ! రామసాన్నిధ్యమున సౌమిత్రి పవిత్రుఁడగుచున్నాఁడు. మంథరాసేవచేఁ గైకేయి దుస్స్వభావ యగుచున్నది. (ప్రకాశముగా) సుమంత్రా రామచంద్రు నీటులురథముపై నెక్కించి తీసికొనివచ్చెదవా ?

సుమం — దేవర యాజ్ఞానుసారమే.

( నిష్క్రమించును. )

దశ — మునికులతిలకా !

గీ. పుత్రశోకంబుచే మృతిఁబొంద శాప
మున్న దెపుడేమి కానున్నదో యెఱుంగ
దలబరువుఁ జేర్చి రాముని, దండకాఖ్య
వననివాసము నిశ్చయపఱచుకొంటి.

వసి — (తనలో) హరి హరీ ! "రాముని దండకాఖ్యవననివాసము నిశ్చయపఱచుకొంటి"నని యీ రాజేంద్రుడు చెప్పుచున్నాఁడు.

గీ. ముందువచ్చు మహోత్పాతమునకుఁ దగిన
పలుకిపుడె ప్రాయికంబుగా బయలు వెడలు
వహ్ని సర్వతోత్రైణోపదవ్రమున
కుఁ దఱచుగ ముందు భూపంక మొదవునటులు

(ప్రకాశముగ)

గీ. అదుగో ! మాతలితోడ బలారివలెను
పక్షిరా డగ్రజునితోడి భానువలె సు

మంత్రుతో రథ మెక్కి రామప్రభుండు
చిన్మయానందమూర్తి వేంచేయుచుండె.

దశ—శెబాస్! గురూత్తమా! రామప్రభుఁడే! నిశ్చయముగా రామప్రభుఁడే! రామునకుఁ బ్రభుత్వ మిచ్చుటకు మీరు సంకల్పించుకొనినతరువాత నాఁగునా?

(నేపథ్యమున) ఆఁగు. ఆఁగు. సుమంత్రా! ఆఁగు ఇచ్చటనే రథముడిగ్గి పాదచారినై తండ్రిగారిని దర్శింతును.

దశ—గీ. రామమందర గంభీరరమ్యారవము
రుద్రవీణారవముఁబోలె రుచ్యమగును
సుతుల పలుకులు వృద్ధులౌ పితలచెవుల
కమృతబిందు నిష్యందంబు లగునుగాదె?

వసి—(నవ్వుచు) రాజేంద్రా! ఏమంటివి? వృద్ధులౌ పితలకేనా? వార్ధకమున సంతానమహోత్సవము గలుగుటచే నీ కట్టు లున్నది కాని—

దశ—మునిచంద్రమా అందఱి కాత్మజు లమృతోపమానులే కాని యస్తమయ మదిగో యిదిగో యని యనుకొనుచున్న నా కంతకంటె నెక్కువ కాదా? వస్తువు విలువ నావశ్యకతయే యభివృద్ధి జేయును గదా!

గీ. రోగయుతునికే యారోగ్యరుచి యధికము
వడదగులునానికే శీతవారి యనువు
బద్ధునకె స్వైరతావాంఛ ప్రబలము మఱి
యొడలు వంగినవానికే యూఁతకోల

రా! నాతండ్రి! రా!

(రామ సుమంత్రులు ప్రవేశింతురు)

రామ—గురూత్తమా! నమస్కారము.

వసి—వత్సా! కల్యాణమస్తు

రామ—తండ్రీ! నమస్కారము.

దశ—(కౌగిలించుకొని) నాయనా! చిరాయురస్తు. ఈ పీఠమందుఁ గూరుచుండుము. సుమంత్రా! నీవు విపణ్యాది స్థలములకుఁబోయి, మన మింతకుముందు తలఁచిన యంశమును వెల్లడించి యందునుగూర్చి జనులయభిప్రాయ మెటులున్నదో యెఱిగిరమ్ము.

సు—చిత్తము. (నిష్క్రమించును.)

వసి—గీ. వనధివలనను ఘనఘనాఘనము బోలె
కర్మమువలన జ్ఞానంబు కరణి లోక

తలిని పథ్యముఁ జేయ నీతండు జనన
మొందె నీవలన; జనమాన్యుండ వీవు.

రామ—(నవ్వుచు) సుగుణోత్తమా! శిష్యునియెడల నమితవాత్సల్యము కదా ?
దశ—వత్సా! నిన్నుఁ బిలిచినయంత నేమియో యెఱుఁగుదువా ?
రామ—ఆజ్ఞాపింపఁ గోరెదను.

దశ—గీ. ముద్దుబిడ్డల మొగమునకు మొగమువాచి
వినఁదగినపుణ్యకథ లెల్ల వినుచు మఱియు
నది యనక కుంట యనక మున్గంగఁదగిన
నీటిపట్టుల నెల్ల మునింగి మునిఁగి

గీ. ఎక్కఁగారాని గుట్టల నెక్కి యెక్కి
కనబడినదైవములకును మ్రొక్కి, కడకు యజ్ఞ
దైవదత్తవరప్రసాదమున, లేక
లేక, నిన్గాంచితిని బుండరీక నేత్ర !

ఇదిగాక—

గీ. సుతచతుష్టయమున భాగ్యయుతుఁడ నైన
నేను భుజచతుష్టయవినిర్జితుఁడ నైన
యామహావిష్ణు బోలితి నంచు నీదు
మహానుభావుండు కృపతోడ నానతిచ్చు.

గీ. కొడుకు లెంద ఱున్నను బెద్దకొడుకు తన ము
ఖాగ్రమున నున్నపుడె తండ్రి యులకు మిగుల;
ముండులను బెద్దముల్లు పండ్రెండు చేరి
నపుడె గంటఁ గొట్టెడుగడియార పాటులు

రామ—ఎప్పుడును జెప్పని యీవింతమాటలు నేఁ డేల ? నాన్నగారూ ! నావలన నేమైన నేరము కలిగెనా ?

దశ—(నవ్వుచు) నేరము కాదు. కాని, ఉపేక్ష.
రామ—అదియేదియో యానతిచ్చినయెడల దిద్దుకొందును.
దశ—(నవ్వుచు) చెప్పుచుంటిని గాదా వినుము.

గీ. లెక్క లేనన్ని యేండ్లు నే నొక్కరీతి
శ్రమ మనక చేతనైనట్లు రాజ్యభార

మును వహించితి, నీ దేహ మినుము ? వజ్ర
మా ? యింకెన్నాళ్ళు మోయఁగ నగును తండ్రి ?
చూచితివా ?

గీ. ఒడలి జవసత్వము లుడిగె; ముదుత లివిగొ;
కన్నకొడుకవు, ముందుగాఁ గన్నవాఁడ
విట్టి నాక్లేశమును జూచి యిప్పుడైన
భుజము మార్చుకొనఁగ రాదె ముద్దుతండ్రి !

రామ — నాన్నగారూ ! ఇదేనా నా యుపేక్ష ?

దశ — కాదా ?

గీ. వేదవేదాంగము ల్చదివితివి, సత్యా
రతుఁడ, వతిరథుఁడవు మంత్రయుతుఁడ వంత
రరిదమనుఁడవు, వృద్ధవాక్యప్రసిద్ధ
గౌరవుఁడవు, మంగళగుణాకరుఁడ వంచు,

గీ. నీ గురుఁడె పల్కు నాతండ్రి ! నీవు రాజ్య
కలితుఁడై యుండఁ గన్నారఁ గాంచు భాగ్య
మొందఁ గోరెతెఁ దనభార ముంచఁదగిన
యాత్మజునికన్నను బ్రియపదార్థ మేది ?

నాయనా ! నీ వెంతమాత్రమును నా కోరికకిప్పుడు మఱు జెప్పగూడదు.

రామ — (చేతులు జోడించుకొని) తండ్రీ ! దేవరయానతిని శిరమునధరింతును.

దశ — రామచంద్రా ! అటు చూడు – నీకును, నాకును, దేవరయగు నా మహానుభావుని యానతియే యిది.

వసి — ఒక్క నా యభిప్రాయమే కాదు. శ్రీరామచంద్రా ! నీ పట్టాభిషేక మహోత్సవదర్శనమునకై దేవతలుకూడ వేగిరపడుచున్నారు. రేపు ప్రాతఃకాలమునఁ బుష్యమీ నక్షత్రమున నైక్ష్వాక సింహాసనము నీ వధిష్ఠింతువు గాక !

దశ — తథాస్తు !

రామ — నేను మాఱుపలికితినని మీరు కోపపడక నాయజ్ఞతను మన్నింపవేఁడెదను. అంత నిరవకాశముగ ముహూర్తమును నిర్ణయించితిరేమి ?

దశ — అయిన నేమి ?

రామ — మేనమామయింటికిఁ బోయిన చిరంజీవి భరతుఁడు చిరంజీవి శత్రుఘ్నునితో రావలదా ?

దశ — (నవ్వుచు) నాయనా ! భరతుని కొఱకుఁ బట్టాభిషేక మాఁగవలసినదా?

గీ. మనసునకుఁ బ్రీతి యెవనిపై ఘనతర మొ, య
తని కెపుడు కీడు శంకించు మనసె; మగని
యెడల నెంతో ప్రేమం బుండి యెప్పు డతనిఁ
దిట్టు గయ్యాళి యూ భార్యతీరుఁ గాగ.

మహానుభావా! ఆలోచించుచున్నారేమి? పట్టాభిషేక కార్యము నెఱవేఱునుగదా?

వసి – పురుషప్రయత్నముచేత.

దశ – పురుషప్రయత్నముగాక యిందున స్త్రీప్రయత్న మేమున్నది? (లేచి) మహానుభావా! నమస్కారము ఇప్పటినుండియు నేనుగూడ నెంతయో శ్రమ మొందినఁ గాని యీపట్టమహోత్సవము జరుగనేరదు.

వసి – ఈదినమున నాకును దెఱపిలేని పనియున్నది. నేనును బోవలెను.

దశ – గురూత్తమా! నమస్కారము.

వసి – కళ్యాణమస్తు.

(ఇద్దరు నిష్క్రమింతురు)

ప్రథమాంకము సమాప్తము.



శ్రీ పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## ద్వితీయాంకము

ప్రదేశము—అయోధ్యలోని వీధి.

(విజయశర్మ యను బ్రాహ్మణుఁడు ప్రవేశించును)

విజ – ఆహా! ఆహా! అయోధ్య భూలోకవైకుంఠమువలె నున్నది. భగవానుఁడైన శ్రీరామచంద్రమూర్తి పట్టాభిషేకము జూచు మహాభాగ్యము జనులకు రేపు లభింపనైయున్నది. ఆహా! ఏమి యీ యలంకారసంభ్రమము.

సీ. అంబుయంత్రముల రథ్యాళినిఁ దడపెడు
వారు గోడల వెల్లఁ బ్రాయువారు
ముంగిళ్ళ మురిపెంపుముగ్గు లుంచెడివారు
కదళికాస్తంభము ల్గట్టువారు
పెద్దనిచ్చెన లెక్కి వీధితోరణములఁ
గంబాల జెండాలఁ గట్టువారు
నివ్వాళిపళ్లెము ల్నెఱయఁ దోమెడువారు
కేళికూళులఁ బరీక్షించువారు

గీ. నందఱును దమగృహములయందె పెండ్లి
యగునటులు చాల నుత్సాహ మందువారు [illegible]
భళిర! రామునివంటి శుంభద్గుణుఁడు
కలుగఁ డింతకుముం దింకఁ గలుగబోఁడు.

సీ. బేగిరావులు, నరబ్బీగుఱ్ఱములబండ్లు
వేనవేలుగఁ గోటలోని కేగు
ఘణఘణోద్ధతఘంటికాబద్ధకరిఘటల్
బరువులతోడ లోపలికి నేగు
కాలుబలంబు గుఱ్ఱాలబలంబులు
నెదుట నీటుగ టలాయించుచుండు

[illegible]

దేవళంబుల నుండు దివ్యమూర్తులు దివ్య
వాహనారూఢులై వచ్చుచుండ్రు
గీ. పుట్టనుండెడి చీమలఁబోలె జనులు
[illegible] నికి నేగుచుఁ బ్రక్క కొందగు
[illegible] గనుచుఁ దమవారిఁ బిల్చుటకుఁ జేత
సన్నఁ జేయుచుఁ జప్పటల్ జఱచుచుండ్రు.

(చప్పట్లు జఱచుచు) మిత్రమా! మిత్రమా! ఇటురా! (బిగ్గఱగ) సోమ నాథుఁడా! ఇటు. (సోమనాథుఁడు ప్రవేశించును)

సోమ — ఆహా! ఇప్పుడే యింతసందడిగ నున్నది. తే పెటు లుండునో!

విజ — నీ వెచ్చటనుండి వచ్చుచున్నావు?

సోమ — విజయశర్మా! సానివీధినుండి.

విజ — నేను శ్రోత్రియుఁడను గాన నచ్చటి విశేషములఁ జూడలేదు. చెప్పెదవా?

సోమ — ఏమని చెప్పుదు? కాంతలు బురుషులు చెంబులలోని గచ్చకాయల వలె గలగల తిరుగుచున్నారు. రేపటి యుత్సవమున కిప్పటినుండియు సంభారములను సంపాదించు కొనుటయందు సంభ్రమపడుచున్నారు.

సీ. లంగాలలో బొందులం గీలుకొల్పి జా
డించి దండెముల జోడించువారు
చిలుకకొయ్యలఁ దగిల్చిన యుపాంగము లెండఁ
బెట్టి కుళ్ళను జీకొట్టువారు
కఱకఱ మనఁ బందికొట్టుచేఁ గుంకుళ్ళ
పులుసున సొమ్ములఁ దోలఁచువారు
తిరుగటిగుఱుజు మద్దెలమోపి హస్తంబు
చేఁ గొట్టి శ్రుతుల హెచ్చించువారు
గీ. నెరవునగల కింటింటికి దిరుగువారు
తంబురాల జీవాళిఁ గంబలాంత [illegible]
రోమనిచయంబు పేనువారు నయి పురుష [illegible]
లతివ లతిమోదమునఁ ద్రొక్కులాడుచుండ్రి.

సోమ—సీ. మోమునఁ బసపును బూసి వెడలపుగాఁ
బట్టెనామముఁ దీర్చి ప్రసవమాలి
కలు దుంపకొమ్ముల గడియించి ఘంటలు
పెద్దమువ్వలు గలపేను లోడల
జందెంపు వెట్టుగా సమలంకరించి స్త సిత
స్తిత వృషభంబులచెంతఁ గొండె
సిగలును వెండిమురుగులు తప్పెటలును
తబుకు తాళంబులఁ దనరి భళిర
గీ. "రాఘవుఁడె రాజు కావలెరా యటంచు"
పాడ నగునంచు మోదించు వరుస నెద్దు
లు, తలలూప, గొల్లన నవ్వి కుతల మదరఁ
దాండవింతురు గొల్ల లాదారులందు.

విజ — ఆహా! రామచంద్రునిపై జనుల కెంత ప్రేమ! ఎంతభక్తి

సోమ — అందులకు రెండు కారణము లున్నవి.

విజ — ఏవవి ?

సోమ — రామచంద్రుఁడు సర్వసద్గుణసంపన్నుఁడు ఇది ప్రథమ కారణము

విజ — రెండవది ?

సోమ — (చెవివద్దకు వచ్చి) దశరథుఁడు దుర్మార్గుడు. ఇతనిరాజ్యము గోస్తనీనదీప్రవాహమువలె నెంత దీర్ఘమో యంత వక్రమైనది. ఇతని పాలనమన్న జనులకు విసుగుగా నున్నది. మొదలే వెలితిపాట. అందుపైఁ దెల్లవారినదాఁక నొక్కఁడె పాటయగుచో వినువారి కెటులుండునో జనుల కాతీరున నున్నది. జనులు పట్టాభిషేకమునకు మొగము వాచియున్నారు. మనతండ్రులు చూడలేదు. మన పితామహులు చూడలేదు. మన ప్రపితామహులు చూడలేదు. మన వంశములోని యాదిపురుషులు చూచిరేమో యీ దశరథుని పట్టాభిషేకము. మన పూర్వులకంటె నదృష్టవంతుల మగు మనము శ్రీరామచంద్రుని పట్టాభిషేకమును జూచెదము.

విజ — ముహూర్త మవ్యవధిగా నుంచబడినది. కాని యింతకంటె నుత్సవ మెన్నోమడుఁగు లధికముగ నుండును జూమా

సోమ — కృపణుఁడు ధనమునకుఁ బ్రాణమునకు లంకె దేశ దేశములనుండి బ్రాహ్మణులు రాజన్యులు వచ్చినయెడల వారివిషయమై విశేషవ్యయమగునని యెవ్వరు రాకుండునట్లు లింత నిరవకాశముగ నేర్పఱుపఁ జేసినాఁడు. అదిగాక ముహూర్త మాత్ర మేమంత బాగుగనున్నది? లగ్నమును కని చూచుచున్నాఁడు.

విజ — అట్టి బలహీనమైన ముహూర్తమును వసిష్ఠుడేల నిర్ణయించెను ?

సోమ - ఆతఁ డేమిచేయఁగలఁడు? భూపతుల ముహూర్తములు దుష్టసతుల కోరికలవలెఁ దలఁచుకొనినప్పుడే సమకూడవలసినవి కావా?

విజ - సామాన్యకార్యముల ముహూర్తములు తొందరగ నిర్ణయించిన బాధ యుండదు కాని యిట్టి మహాకార్యముల ముహూర్తము లపర్యాలోచనముగ స్థిరపరచిన నాపత్తుకాదా? (లెంపలు వైచుకొని) అపచారము వచ్చినది.

గీ. లగ్నమునకు రాఘవుని బలంబు గాని
రామునికి లగ్నబలముతో నేమి యగును ?
సుమవితతికి వసంతునిశోభ గాని
సుమనిధానమునకు సుమశోభ యేల ?

(నేపథ్యమున) దిగు దిగు ఉండలబద్దయేది లే! లే!

సోమ - అదేమి? అదేమి? అల్లరి యగుచున్న దేమి?

విజ - (అటులిటులుచూచి) అదిగో కైకేయి మేడపై కొండ్రముచ్చు. జనులు దానిని బెదరఁగొట్టుచున్నారు.

సోమ - (నవ్వుచు) కాదు కైకేయిదాసి-నల్లని కురూపయగుట చేతను గూని దగుటచేత నల్లరిమూకయైన జను లట్లు పరిహసించుచున్నారు. మిత్రమా సంధ్యా సమయమైనది చూడు.

గీ. నను గమించు తేజశ్శాలి తనకులంబు
వన్నెకెక్క రాజౌనని సన్మహితుఁడు
దేహముప్పొంగ రాగసందీప్తుఁ డగుచు
మోదమున మున్గునట్లు లంబుధిని గ్రుంకె.

మన మిఁకఁ మనయిండ్లకుఁ బోదము రమ్ము.

విజ - మన రామచంద్రుఁడును, జానకియు నీరాత్రి యుపవసింతురగట! అట్టిచో మన మేల భుజింపవలయును? మనముకూడ భోజనములు మాని జాగరము సేయుదము.

సోమ - అభ్యంతర మేమి ?

విజ - బాగుగఁ బరిశీలింపుము. కొండముచ్చే గాని కైకేయీ పరిచారిక కాదు సుమా ?

సోమ - మంచివాఁడవు, ఇక్కడనుండి చూడుము సందేహ మేమి? కొండ్రముచ్చింత వికృతరూపముగలదిగ నుండునా ?

గీ. ఆదికూర్మముపై మందరాద్రి నిలిచె
మున్ను; కాలము వ్యత్యయంబుగఁ జెలంగ,

నిపుడు మందరోపరి గూర్మపృష్ఠ మెక్కె
ననఁగ, నదె వక్రబుద్ధిలాంఛలము గూను.

కావున నిశ్చయముగ మందరయే.

విజ - మిత్రమా దాని పేరు మందర కాదు మంథర.

సోమ - ఏదియో యొకటి; కాలవ్యత్యయ మైనపుడు వర్ణవ్యత్యయ మాశ్చర్య మేమి? చూడు దాని మొగ మిట్లు మాడియున్నట్లున్నదో? ఈయుత్సవములు దనకు రుచించినవి కావి కాఁబోలు

(నవ్వుచు) రామపట్టాభిషేకమే దాని కభిమతము కాదు కాఁబోలు? ఏదో కైకేయితోఁ దలపోసికొనుటకు వచ్చినట్లున్నది. మనము మరియొకవీధికిఁ బోయి వేడుకఁ జూచెదము రమ్ము. (ఇద్దరు నిష్క్రమించుచున్నారు).

ఇది విష్కంభము

ప్రదేశము:— కైకేయి యంతఃపురము మేడ

(ప్రవేశము:— మంథర)

మంథ - ఏమి! ఈ యుఱుకు లేమి? ఈపరుగు లేమి? ఈగుఱ్ఱపుబండ్ల కిరకిర లేమి? ఆ ఏనుఁగుల ఘణఘణ లేమి? ఆజెండాల తడతడ లేమి? ఈ బూడిదబుస్సన్నల పనస లేమి? ఆగొల్లకరాల గోలయేమి? ఈ పంగ నామాలపందల తందనాలేమి ఈ తోరణము లేమి? ఈ వీరణము లేమి? ఆ! ఆ! ఈ తప్పెట లేమి? ఈ గంతు లేమి? ఈ చిందు లేమి? (మఱియొక వైపునకు దిరిగి) ఆ! ఆ! ఏమి యీ వింత; ఏమి యీ మహోపద్రవము. ఱాయి ద్రవించుచున్నది. అయఃపిండమునుండి యమృత మొలుకుచున్నది. ఆ! గొంతుఁ గోసికొందునన్నను క్రొత్త కాసొకనిచేతఁ బెట్టని క్రోతి పిడికిటి కౌసల్యకుఁ గొండంతయీవి యొక్కమాఱె కలిగినది! ఇది లోకోత్పాతమే! అబ్బ! ఏమి దక్షిణలు! ఏమి దానములు! ఈజందెములపంద లీ మహాభాగ్యములకై యెటులు మూఁగుచున్నారో! దానశీల యని సిగ్గులేక దిక్కుమాలిన కవు లెట్లు స్తోత్రములఁ జేయుచున్నారో! (చప్పటులు జఱచుచు) ఓసి కావేరీ! కావేరీ! ఈ గందరగోళములో నెవరికి వినఁబడును! ఓరీ మీగొంతుకలు కొయ్య! నోరు మూసి కొనుఁడు. ఓసీ కావేరీ! కావేరి!

(నేపథ్యమున) ఎందులకు?

మం— మీయమ్మ నేడు బ్రాహ్మణసంతర్పణము జేయుచున్న దేల?

(నేపథ్యమున) ఎందులకో యెఱుఁగవా?

మం— ఎఱిగియుండిన నడుగుదునా? జ్యేష్ఠదేవిగారి పరిచారికలగు మీకే సంగతియైన మొదట తెలియు గాని యూరు పేరులేని యధోదేవులను గనిపెట్టుకొనియున్న మాకుఁ దెలియునా?

(నేపథ్యమున) (నవ్వుచు) అధోదేవు లని క్రొత్తమాట చెప్పుచున్నావేమి?

మం—నా క్రొత్తిమాటకేమి కాని, మీ దేవిగారి క్రొత్తచేష్ట కేమి కారణమో చెప్పుమా?

(నేపథ్యమున) సుగుణరతుఁడు.

మం—ఊఁ.

(నేపథ్యమున) శాంతవచోయుతుఁడు

మం—అబ్బ! త్వరగా నేమవరాదా? ఇక మీ కంతే.

(నేపథ్యమున) అగు రామచంద్రుని.

మం—అబ్బ! చెప్పరాదా?

(నేపథ్యమున) పట్టాభిషేకము.

మం—ఆ! నిజముగానె? ఎప్పుడు?

(నేపథ్యమున) ఎప్పుడోనా? తెల్లవారుసరికి.

మం—ఇప్పుడీతని పట్టాభిషేకమున కంత తొందరయేమి? మహారాజు బాగుగ నున్నాడా?

(నేపథ్యమున) అటు లడిగెదవేల?

మం—ఏమియులేదు. ఆతఁడు మా దేవిగారి యింటికీ యుదయమునుండి యిప్పటివరకు రాలేదులే.

(నేపథ్యమున) లేక ముందుకూడా నటులే జరుగు నేమోలే.

మం—తెగసాగక పో.

(నేపథ్యమున) సాఁగదీసినసరే - చంపినసరే గూనుమాత్రము వదలదు.

మం—(తనలో) సుగుణరతుఁడు శాంతవచోయుతుఁడు నగు రామభద్రుని పట్టాభిషేక మనుటకంటె, సుగుణరతుడు శాంతవచోయుతుఁడునగు భరతునిపట్టాభిషేక మనుట శ్రవణానందకరముగ నుండునుగాదా! రామభద్రుఁడు రేపు పట్టభద్రు డగునా? అది మొదలు తుద యెఱుఁగని దశరథుని యాజ్ఞయా? అందులకు మూలఁ గూరుచుండి ముక్కుమూసికొని మూర్ఖుఁడైన ముసలిముని యామోదమా? అందుపైఁ గలలోనైన జిల్లిగవ్వ విడుచుటెఱుఁగని కౌశల్యాదేవి భూసురసమారాధనమా? అది గాక యీ మూర్ఖజనులు చెడ్డ్రాగి యొడలు తెలిక తెయితక్కలా? ఏమి వింతగ నున్నది! చూచెదనుగాక! కైకేయీ! కైకేయీ! మేడపైలేదు. వేడుకఁజూడ దిగినదికాఁబోలును! ఆ! ఏమిది! ఏమిది! కొంపలుగాలినట్లీవెలుతురేమి? రామపట్టాభిషేకమునకై స్త్రీలు దీపములు ముట్టించుచున్నారా! ఆమహోత్సవమునకే నేనుఁగూడ నొకవింత యగ్ని నిక్కడ ముట్టించెదను. వీరు ముట్టించిన యగ్ని తెల్లవాఱుసరి కాఱునుగాని నే నంటించుచిచ్చు రేయింబగళ్ళ విచ్ఛిన్నముగ సంవత్సరములకొలఁది నుండును. వీరి

వహ్ని వత్తులను, జనులనే కాల్చునుగాని నావహ్ని ప్రథమున, పురజనులను, భూపాలుని—సర్వాంగకముగ దహింపఁజేయును. కైకేయీ! కైకేయీ! పట్టి మొద్దు. క్రిందికిఁబోయి చూచెదను.

(క్రిందికి దిగుట నభినయించి)

కైకేయీ! కైకేయీ! ఇదిగో! ఇక్కడ హాయిగా నిద్రించుచున్నది. సఖీ-సఖీ (లేపుచున్నది).

కైక—(లేచి కనులు మూసికొని) మందరా!

మం—కైకేయీ! ఊరంత ఆందోళనపడుచుండ నీవు స్తిమితముగ నిద్రించు చుంటివా! ఊరంద రుపవసించి జాగరములు సేయుచుండ నీ వప్పుడే భోజనముచేసి ప్రక్కఁజేరితివా? గ్రామములోని యశేషజనుల నేత్రములయందే దీపాలవెలుఁగు ప్రకాశించుచుండ, నీ నేత్రముల కంధకారమా? నీ కన్ను లిట్టి మహోత్సవము నేల చూడఁదలఁచుకొనలేదు? నీ చెవులిట్టి మంగళస్వనముల నేల వినదలఁచుకొనలేదు?

కైక—ఏమహోత్సవము! నేను వినలేదు. చూడలేదు. సుమా!

మం—అలాగా! నీవు చూడలేక కనులు మూసికొంటి వనుకొంటిని. నీవు వినలేక యీపూల దాగితి వనుకొంటిని. నీవు మనసున నాలోచింపలేక నైనుఁజి నిద్రించితి వనుకొంటిని.

కైక—అలాగుకాదు. నే నేమియుఁ గనలేదు. వినలేదు.

మంథ—కన్ను లున్నందుల కిప్పుడైన వానిని కృతార్థములఁ జేసికొనరాదా? శ్రవణము లున్నందుల కిప్పుడైన వానిని బావనములుగఁ జేసికొనరాదా? ఇటురా! దేహ మశాశ్వతము. ఇంతవేడుక నీవు తిరిగి చూతువో! లేదో ఇటురా! ఈ మాపు తడకయొద్ద నిలిచిచూతుము. (అట్లుచేయుచున్నారు.)

కైక—ఆహా! ఎంతవేడుక జరుగుచున్నది? ఈసర్వజనానందమునకుఁ గారణ మేమైయుండునో?

మంథ—కైకేయీ! నాతో నీకుఁ బరిహాస మేల? ఎఱుఁగనట్లే నటించు చుంటివి? ఎంతెగడుసుదానవు!

కైక—నిజముగా నే నెఱుఁగను. నన్ను విశ్వసింపఁదగును.

మంథ—చాలు! ఈమాటలకేమి! మహారాజుగారి మూఁడవభార్యవు; ముద్దుల యిల్లాలవు; మురిపెముల గనివి. నీకే తెలియపోవు టెట్లు? అటు చూడు భరతుని సుగుణపుంజమువలె నా దీపగణ మెటుల ప్రకాశించుచున్నదో? భరతుని ప్రతాప రేఖలు దివి నాక్రమించు వైఖరిఁ బేకజువ్వ లెట్లుప్పరమున కెగురుచున్నవో? భరతుని యశశ్చంద్రికవలె—

కైక—భరతుని పేరెత్తుచున్నావు; మేనమామయింటినుండి వాఁడు వచ్చు చున్నాఁడా యేమి? అందులకు జను లీ వేడుకను చేయుచున్నారా?

మంథ — ఏటో చెప్పవలెనా? నీకెఱుఁగవా? నీకనుభవములేదా? ఇప్పటి వఱకు ముప్పుతిప్పలఁ బెట్టుచున్నదే! ఎవరని నన్నడిగెద వేల?

కైక — కౌసల్యయేనా?

మంథ — కాదా ఆమెతోఁ జేరి మూడుమాసములనుండి యొక్కఁడే గుస గుసలఁజే! ఇంతకాలమునుండి పట్టాభిషేక ప్రయత్నం జరుగుచుండ నిప్పుడా నీవు దానినిగూర్చి తెలియవలసినది? అదియైన నేను చెప్పఁగఁ దెలియవలసినదా? నాకైన నూరంతయు గగ్గోలైనపిమ్మటఁ దెలియదగినదా? ఇదియేనా నీమగని యనురాగము? ఈమాత్ర సౌభాగ్యమునకే పెనిమిటిని వశముచేసికొంటినని యుబికియుబికి యుప్పొంగుచుంటివా?

కైక — ఆ. ఆ. మూడుమాసములనుండి పట్టాభిషేకమును గుఱించిన రహస్యములు జరుగుచున్నవా?

మంథ — జరుగుచుండుటలేదా? స్వాధీనుఁడైన మగఁడును అనురాగవతియైన భార్యయైనపుడు వారి ప్రయత్నములు రహస్యములై యుండవా? నీతో నెవరు చెప్పెదరు? నీతో నెవరికిఁ గావలయును? అదిగాక నీ ప్రసక్తియేమున్నది? నీవేమి పట్టపుదేవివా? పతిప్రేమాస్పదవా? భాగ్యవతివా? పక్కలోని బానిసతనమునకై పసపుత్రాళ్లు గట్టఁబడినవారిలో నందఱికంటే నీ యాధిక్య మేమి?

కైక — అబ్బ! నీ మాటలు నేను సహింపలేకుంటిని - ఊరకుండుము.

మంథ — అభిమానముచే నఱను నా మాటలు నీవు సహింపఁగలవా? ఇంతగా జేసిన మగనినడత సహింపఁగలవు - కాని -

కైక — అబ్బ! నామగనినడత నేను సహింపలేను. అతనిని రాని! నిన్నేమిటఁ బెట్టి యెట్టు లడిగెదనో! ఈసంగతి నా కింతకుముందు తెలిసియుండిన మొదల నేనూరకొందు ననుకొంటివా? నేనంత యభిమానము లేనిదానవా? నాకంటెఁ జనకిప్పుడు కౌసల్య యధికమయ్యెనా? "నీవే నా బహిఃప్రాణము - నీవే నా సర్వస్వమవు" అని పలికిన చిలుకపలుకు లెక్కడకుఁ బోయెనో నిలువబెట్టి యడుగనా? అంత చేతకాని దాన ననుకొంటివా? అంత నోరుమాలినదాన ననుకొంటివా? రాని! అతనిని రాని!

మంథ — ఇంక నేలవచ్చును! ఇంక రాఁడు. ఈ యుదయమున వచ్చినాఁడా? ఈ మధ్యాహ్నమున వచ్చినాఁడా? సాయాహ్నమున నీతో సంధ్యావందనమున విహరించుటకు యథాప్రకారముగ వచ్చినాఁడా? ఇప్పటికి వచ్చినాఁడా? ఇంకముందు వచ్చునని యేల నమ్మవలయును?

కైక — రాకపోవుటకూడనా? ఆఁ! రాకపోవుటకూడనా? నేను బ్రదికి యుండఁగ - నే నిక్కడ నుండఁగా నంత గుండె నిబ్బరమా?

మంథ — వెఱ్ఱిదానా! ఏమి జరుగనున్నదో యాలుసంతయైన కౌసల్య కదా ని న్నిక్కడ నుండనిచ్చునా?

కైక – ఉండనీయక ?

మంథ – నిన్నుఁ గౌసల్యాదేవి ప్రోత్సాహముచేఁ బుట్టినింటికిఁ బంప నిశ్చ యించుకొనినాఁడు.

కైక – ఛీ ! నన్నేల పంపును ?

మంథ – భరతుని నేల పంపినాఁడు ?

కైక – భరతునిఁ గౌసల్య ప్రోద్బలముచేఁ బంపలేదే !

మంథ – నీకున్న వెఱ్ఱితనమే యిది. ఆతఁ డిచ్చట నుండిన రామపట్టాభిషే కము జరుగదని మేనమామయింటికి మెడఁబట్టి గెంటినాఁడు.

కైక – ఆఁ ఆఁ నిజముగా నామగఁడే గెంటినాఁడా ? నామగఁడే ?

మంథ–మగఁడో! మొద్దులో! మగఁడే కాఁడు–మగనితో నీసవతిగూడ గెంటినది

కైక–ఆఆఁ–ఆఁ. దానిసకూడ తోడైనదా! (ఉస్సురనుచు) దాని ననవలసినదే మున్నది? నానాథుఁడు దోషి – నానాథుఁడే ద్రోహి... నానాథుఁడే విషస్వభా వుఁడు. ఏమీ ! నాతో జెప్పకపోవుటయేల ! నాతో నాలోచింపకపోవుట యేల ? పోనీ ? స్థిరపఱచుకొనిన తరువాతనైనను నాతోఁ జెప్పగూడదా ? రాముని పట్టాభి షేకమునకు నే నభ్యంతరపెట్టుదునా ? నాకు రాముఁడొకటియు, భరతుఁ డొకటి యునా ? సవతికొడుకులను భేద ముండవలసిన యాఁడుదాన నైన నాకే భేదము లేనపుడు తండ్రియైన తనకేల యుండవలయును ? ఈ దొంగతనమేల ? ఈ భయ మేల? ఈ సందేహమేల? నాకొడుకును గెంటనేల? ఈ దౌర్జన్యమేల? మంథరా! ఇఁక నాపతి నాయతఃపురమునకు రాఁ డంటివా? రాకపోఁడు సుమీ !

మంథ – వచ్చుననియే నిశ్చయపఱచుము. తేపు వచ్చిన లాభ మేమున్నది ?

కైక – ఏమి?

మంథ – తెల్లవాఱుసరికి రామపట్టాభిషేక మగునెడల నీ పతికిఁ బ్రభుత్వము నశించును గాదా ! ఒక డింతిపెట్టగఁ దాఁనే తినవలసియుండిన సేవకావృత్తి కాతఁ డు దిగినపుడు నీ కేమి చేయగలఁడు ? నేను నీయింటికివచ్చి నీకెంత మేలు సేయవలెనో తేపటినుండి యాతఁడు వచ్చికూడ నంతకంటె నేమున్నది ?

కైక – ఆయిన నిక నేనేమి చేయవలసియున్నది.

మంథ – రామపట్టాభిషేకము నీ కంగీకృతకార్యము కావున మన మిద్దఱ మొక్కటే పని చేయవలసియున్నది.

కైక – ఏ దది ?

మంద – సేవావృత్తి.

కైక – (కోపముతో) ఏమి? ఏమి?

మంథ – నీ వొకసురటియు నేనొక చామరము బుచ్చుకొని కౌశల్యాదేవికి రాజమాతకింత విసరవలసియున్నది.

కైక - ఛీ! కాఱులు ప్రేలక నోరు గట్టికొనుము.

మంథ - నాపైఁగోపమేల ? రాముడు ప్రభుడైనపుడు కౌసల్యామహాదేవికే సమస్తగౌరవములు జరుగవలసియున్నవి ఇఁక నీకును నాకు నామహారాజ్ఞిపాదసేవ తప్పదు తప్పదు. ముమ్మాటికిఁ దప్పదు. ఆజన్మమహాభాగ్యకలితవై, యింతవఱకు బత్యనురాగ నిధానమవై, మహావైభవమనుభవించిన నీకాపరిచర్య యలవాటు లేకపోవుటచేత నందులోఁగూడ నీకు దిట్లు మొట్లుదప్పవు కాబోలునని నేనేడ్చుచున్నాను.

కైక - ఛీ! ఛీ! పలుమాటలాడెదవా ? పతి నరచేతిలో నిమ్మపండువలె నాడించిన నేను భ్రూభంగము చేతనే దానవసంహారియగు దశరథుని గడగడలాడించిన నేను కాంతుని సంపూర్ణవశంవదునిగఁ జేసికొని సవతుల నందఱిని గీపెట్టించిన నేను పరమాభిమానధననైన నేను నేఁడిప్పుడు కన్నులు తెఱవని బుడుతని సింహాసనముపై సింగారించినంతమాత్రమున, నాయాధిక్యమును వదలి, యభిమానమును బరిత్యజించి, యహంకృతిని జంపుకొని, స్వాతంత్ర్యమును మన్నుజేసికొని యా - పనికిమాలిన దానిని గొలుతునా ? దానితో మాటలాడుదునా ? దానివంక జూడనైన జూతునా ?

మంద - ఇవియన్నియు వెనుకటి ప్రగల్భతలు.

కైక - వెనుకటి ప్రగల్భతలో, యిప్పటి సమర్థతలో, కాని చూచెదము.

మంథ - కనుల నీరుబెట్టుకొని రాముని రామ పట్టాభిషేకమును-

కైక - కన్నీరు నేనువిడువను నా సవతిచేత విడిపింతును.

మంథ - పట్టాభిషేక మాగినప్పుడు కదా !

కైక మంద - ఆగని వేళయైనదా ? రాముడు కాని ! గీముడు కాని ! నామర్యాద పోవునపుడు నేను నోరుమూసుకొందునా ? ఈ బొందిలోనిజీవము లెగిరిపోవుటకైన సంతోషపూర్వకముగ నంగీకరింతును గాని నా సవతి యౌచ్ఛతను నేను సహింతునా ? అందులో నాకనుసన్న మెలఁగిన సవతి - నన్నుజూచి దొంగమొగము పైచికొని చల్లచల్లగ జాఱిన సవతి తనపై నాధునితో నే నెప్పుడేమి చెప్పెదనోయని తల్లడిల్లుచుండు సవతి యిప్పుడు నాపుత్రుని మాతామహగృహమున కంపి తనకొడుకును సింహాసనాధిష్ఠాతను జేయుదలచి నా వెనిమిటిని మూలఁ గూర్చుండబెట్టి, నన్ను బుట్టినింటికి తోసిపెట్టనెంచి కెవ్వుమని, యేకచ్ఛత్రముగ బుత్రుని నెపము బెట్టుకొని క్షోణీతలము నేలదలచిన సిగ్గుమాలినదాని నా కాలిక్రింద రాయుదును గాని ఆఁ! ఆ! కైకేయిని పువ్వుదుప్పింపినట్లు త్రుంపవలెనని యెంచుచున్నది. కాబోలు ! నాకుత్తుకనైన గోసికొందును గాని-

మంథ - పట్టాభిషేకమును మొండికత్తిచే ని నాధుఁడు కోయనే కోసినాడు.

కైక - ఏమీ ! పట్టాభిషేకము మాఁగదా ? అప్పవధిగ నుండుటచే నభ్యంతర పెట్టబడదని సంకోచింపుచుంటివా ? కాని గౌసల్య చేసిన యీరాజ్యాభిషేక తంత్రము నాకింత నిరవకాశముగ నేల చెప్పితివి ?

మంథ – నాకుఁ దెలియకుండ నే నెటులుం జెప్పగలను ?

కైక – నికిప్పుడేనా తెలిసినది ? ఎవరు చెప్పిరి ?

మంథ – కావేరి.

కైక – సవతి దాసియేనా ?

మంథ – ఆఁ !

కైక – ఏమని చెప్పెను ?

మంథ – ఏమున్నది ? చూచితివా నా ప్రజ్ఞ ! దశరథుని చెంతన ముడివైచు కొంటిని భరతుని కష్టకంతులాడు బిడ్డవలె విసరివైచితిని. కైకేయికి ముక్కుతాడు బోసి యాడ్పింతును. ఏమున్నది ? రామచంద్రుని శిరముపై గిరీటము; కైకేయి నెత్తిపై నిళ్ళకుండ" అని కౌశల్య తనతో జెప్పినట్లు కావేరి నాతో జెప్పినది.

కైక – (కోపముతో) ఆ ! నీచురాల ! ఛీ ! పరమతుచ్ఛురాలా, నన్ను నడి వీధిని బెట్టి యేడుచుంటివా ? ఛీ ! పలుంగాకీ నిన్ను కోటములందు గొల్లున గోల బెట్టించనియెడల నేను కేకయాత్మజను గాను జాగ్రత్త !

మంథ – నీవు పూర్ణముగ దలచుకొనినయెడల నది కష్టసాధ్యమగు కార్యము కాదు కాని, నీ చలచిత్తత నిన్నెక్కడ పాడుచేయునో యని నే నాందోళన పడు చుంటిని;

కైక – ఒక్కటియేమాట రాముని పట్టాభిషేకము విఘ్నమైనపనుము.

మంథ – సంతోషమే – కాని, అంతమాత్రముచేత నే నీ కాధిక్య మెటులుం కలుగ గలదు ?

కైక – అందులకేమి చేయమంటివి ?

మంథ – కౌశల్య చేసిన పాపతంత్రములు రెండు – మొదటిది భరతుని రాష్ట్ర పరిత్యాగం జేయుట–రెండవది రాముని రాజుచేయుట–ఇట్టి స్రుటము [illegible] మెటులుండవలయునన్న–రాముని ద్వక్తరాష్ట్రుని జేయుట–భరతుని రాజుగా జేయుట

కైక – (ఆలోచించి) జ్యేష్ఠత్వముచే రాజార్హుడగు రాముఁడుండఁ జిన్నవా డైన భరతుని రాజుగఁ జేయుటకు రా జంగీకరించునా? [illegible] రాజ్యమును భరతుడు స్వీకరించినా స్వీకరించును. ఛీ ఛీ.

మంథ – జ్యేష్ఠతవలననే యురహాతయు యోగ్యతయు గలుగునా? [illegible] మున నమ్మాతముకంటె విమను ముందుద్భవింపలేదా ?

కైక – (పెదవి విఱిచి) కాని, యగ్రజుఁడగు రాముఁడుండ భరతునికి బట్ట ముగట్టు యనూచానవిరోధమని వసిష్ఠాదు [illegible] తోఁచుచున్నది.

మంథ – "అగ్రజుడగు రాముండ్," నను సందేహమేల ? అందుకొరకే ప్రథమమందు రాముని ద్వక్తరాష్ట్రునిచేయవలయునని చెప్పితిని. రాముఁడెటులనను వాసమేగినచో నున్నవారిలో భరతుఁడు జ్యేష్ఠుడు కాఁడా ? వంశాచారవిరుద్ధతియే

మున్నది? ఇక రాజారహమగు రాజ్యమని భరతున కాక్షేపణ మేమియుండును? భరతాభిషేకమునకు వసిష్ఠాదు లంగీకరింపరని తోఁచుచున్నదంటివి. ఇచ్చువాఁడు సర్వస్వతంత్రుఁడైన తండ్రి; పుచ్చుకొనువాఁడు సర్వమంగళ సకాలంకృతుఁడైన జ్యేష్ఠసుతుఁడు, ఇమ్మని చెప్పునది పరమప్రియురాలగు భార్యయైనచో మధ్యమునఁ బౌరోహిత్యపుఁ గాసునకై వచ్చిన వసిష్ఠుని యధికార మేమున్నది? నీచిత్తవృత్తికున్న లోపమే యిది. అనవసరములగు సందేహముల దెచ్చిపెట్టుకొందువు వసిష్ఠుఁ డంగికరింపఁడని చెప్పుటవలన నాకొక యాస గలుగుచున్నది.

కైక—ఏమది?

మంథ—నీభర్త యంగ్గికరించునట్లు నీవు స్థిరపరచుకొంటివని.

కైక—అట్టినిశ్చయ మెక్కడిదిలే. రామపట్టాభిషేకమునకుమాత్ర మంతరాయము కలిగింపవచ్చును.

మంథ—అంతమాత్రమువలన నేమిలాభ మున్నది? అదిగాఁగ దానివలన మిక్కిలి ముప్పున్నది.

కైక—ఏ దది?

మంథ—కౌసల్యాపుత్రునికే పట్టాభిషేకము చేయు రాజసంకల్పమగుటచే నీ సపత్నులకుఁ బ్రజలకు బానిసలుకుఁగూడ నీయందు గౌరవము సంపూర్ణముగ నశించినది. అట్టిచో నొక్క రామపట్టాభిషేకనిరోధకమే చేసి నీవూరకున్నచో నిప్పటిగౌరవహైన్యమునకుఁ గావలసినంతనింద తోఁచుపడును ప్రజలకు నిపై శత్రుత్వము ప్రబలును. రామలక్ష్మణులు నిన్ను రూపుమాపనెంతురు. అదిగాక, బలాకృష్టాంగికారము గావున నీపతిగూడా వారిలోఁ జేరి యీ పిశాచము వదలిన మంచిదియనియే యూహించును అట్టిచో భరతుడు రాజుగజేయబడివుండిన. పౌరజనులు నోరెత్తుదురా? రాజమాత వగుటచేత నీయందరి కెంతగౌరవముండును? నిన్నిప్పుడు కాదని నిరాకరించిన కౌశల్య నీ పాదాక్రాంతయగుట నిశ్చయముకాదా! నీకింత యాకస్మికోపద్రవమును దెచ్చిపెట్టిన యామెను రాచి అంపమున బెట్టుట నీకు బ్రతినిధికాదా? సపత్నిపై పగదీర్చుకొనలేని పతివ్రతు కేల?

కైక—(కోపముతో) ఆఁ! ఆఁ తీర్చుకొనక యూరకుందునా? ఎప్పటికైనను సరే యీ బొందెలోఁ బ్రాణములు నిలిచియుండఁగ దానిని దలచుకొనినంతపని చేయకుందునా?

మంథ—ముఖ్యకాలము దాటిపోయినపిమ్మట సెప్పటికైనా నీవు చేయగలది రోదనమే.

కైక—ఛీ! ఛీ! నీ తల్లిపాలచే నేనును నీవును బెరిగిన చనువుచేత నీపను కఠినవాక్యముల కింతసేపటినుండి సహింపలేక శాంతించుచుంటిని. ఇక జాగ్రత్త.

మంథ—అయభిమానముచేతనే యింతగా నేడ్చుచున్నాను. ఇందుకొరకు నాపై బగ సాధింపదలచితివా? ఏమి సౌలభ్యముగ నున్నది? ఇంతకాలమునిన్ను నెత్తిపై బెట్టుకొని యూరేగి తుదకు నేలను ఢల్లున విసరికొట్టిన నీ నాథునిపై బగ

కైక - నా కింతక్షేమకరమైన యుపాయమును జెప్పినందులకు నిన్నుఁ గొనియాడవలసి యున్నది.

మంథ - చాలుచాలు. ఇప్పటిమాటలే. ఇది పూర్ణముగా ఫలించుసరికి నీవు నాతో మాటలాడుదువో లేదో, పోనిమ్ము. నీవు ముందు క్రోధాగారమును ప్రవేశింపవలయును.

కైక - అవియన్నియు నాకుఁ జెప్పనేల? ఆ పాట్లేవో నేను బడెదనుగాదా?

మంథ - (నవ్వుచు) ముసలిమగనిని మూడువాగులనీరు త్రాగింపఁగల సమర్థత నీకున్నదని యెఱుఁగనా? అటులైన నే నికఁబోయెదను. చూడు - రాముఁడెక్కఁదలఁచిన సింహాసనముపై భరతు నధిష్ఠింపఁజేయుట - అంతకంటె ముఖ్యమైనది - రాము బాణము మారీచు నెగరఁగొట్టినటులు - నీ కోపము - రాముని దండకారణ్యమునకుఁ ద్రోసివైచుటయే కాక - అక్కడనుండు శాఖామృగాదిసత్త్వములతో దక్షిణసముద్రపర్యంతము తఱుముటయే కాక - ఆ సముద్రమునుగూడ దాఁటిపోవునట్లు చేయవలయును.

కైక - తథాస్తు నేను కోపమందిరమునకు బోవుదును.

మంథ - నేను నీభర్త నిప్పుడే యాగదికిఁ బంపెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీ పట్టభంగ రాఘవ మను

# పాదుకా పట్టాభిషేకము

## తృతీయాంకము

ప్రదేశము:—కైకేయి యంతఃపురములోని భాగము

(ప్రవేశము:— దశరథుఁడు.)

దశ—ఏమి? శయనగృహమైన యిప్పటి కింక నేల రాలేదు?

గీ. విద్యలేనిముఖములాగు, విదయమైన
మనసటులు, లజ్జలేని సంభాషంబు
వలెను, శుభగతిలేని యౌవనము బోలె,
చెలువలేని యిచ్చోటు నిర్శ్రీకమయ్యె. కైక లేకుండుటచేత

గీ. అట్టె, పట్టె, జాల దనియు నిట్టెట్టఁ
దగిన రుష, యట్టె యేఁడు, పంతటనె హాస;
ముంట నేరనట్యాభినయముకంటె, సతి వి
చిత్రత యుద్ధాగమాట, రంజించు నన్ను.

గీ. కప్రమమధుకోశమున కీఁగకాటు, స్వర్ణ
కేతకికి ముండ్లపోటు, సంస్ఫీతచంద
న లతకుఁ బుసుగురాటు, పొందంగఁదగిన
బోఁటిసఖ్య-కపకుఁ జూకుమాట్ల వేటు.

గీ. మొదలె మూతిముడుపు గలముదిత, యందు
పైనఁ గొఱకచ్చువలె, గూనిబానిస యొవో
నన్నుగుఁజిచి ముట్టించు; నంతటను బున్న
మనచుఁ బ్రేలును మందు కాఱుతె, నబల.

అంతః పుర పరిచారకులారా! కైకేయిని మీరెక్కడ నెప్పుడు చూచితిరి?

గీ. కలుకు(నోరు)వాయి, వక్రగాత్రవైల్యము లున్న
గూనిదాసి, కొఱుకు రానికొయ్య

దీని జేరి, పంటచేని. గొడవలివా ట్టా లెక్కి యొంచక
గునను నాదుగొంతుగోయు నెపుడొ.

(నేపథమున) ఎప్పుడో నా? ఇప్పుడే.

దశ:- ఆహా ఏమి అమంగళవాక్యము ? (ఆలోచించి) కైకేయి యిక్కడ కెప్పుడు వచ్చినదన నే నొనరించిన ప్రశ్నమున కిది యుత్తరము గాబోలు. ఇక్కడ కామె రాలేదని యనుకొనుచున్నాను వచ్చియే వెళ్లినదజః వచ్చుసరికి నే నిచ్చట లేకుండుటచే నాపై గోపము వచ్చినదని నే నూహింతును. మఱల క్రోధాగారమున నామె ప్రవేశించెనా యేమి ?

గీ. అస్మదీయాన్యవనితా రుడాలయంబు [illegible]
లెల్లపాడయ్యెగాని యీ యింటి స్తంభ
లగ్న దార్ఢ్య మెట్టిదియొ! యీ లలన కాపు
రంబు నెలకు నిరువదినాంబు లిటనె

అయ్యో! కోపభవన మనుమాట తలంపునకు రాగానే గుండెలు చెదరుచున్నవి హా! కైకేయి! నీకు క్రోధమందిరమే కాని నాకు ప్రాణసంకటమందిరము సుమా! అదిగో! యీమందిరమార్గమున బుష్పములు క్రింద జల్లబడియున్నవి. కోపావేశమున నవభారాలంకారములను ప్రసవములను బలాత్కారముగ నూడందెంపికి భూమిపై నామె బడవైచియుండెను. ఓసుమములారా!

గీ. నెలఁత లలితములౌ మిమ్ము నేఁ గొట్టెఁ
జెలికిఁ గోపము నామీఁద, శిక్ష మీఁ
గలిగె, నింద్రియమ్ములో లు ప్రకారణముగ [illegible]
నిటులు పరమసామ్రాజ్యంబును ధిక్కరించె.

గీ. కలికి కలకలలనగవ్వుఁ బలుకనప్పుడే
గుండెలను చేతిలో నుంచుకొందు; నిప్పుడు
కొఱకొఱలు దురుసులును పరగ నెటుల
బ్రతుకునాఁడ; నిశ్చయ మిఁక బ్రతుక లేను.

గీ. దరికి రానీయకున్నను, దన్నినను, మ
ఱింత బుజ్జగింపుల నూఱడించి, దాని
గాఁగిలింపఁగవలెఁ గష్టకలనమైన,
భయగలితఘోటి కాలు చేపట్టినటుల.

గీ. మొద్దులాగున మొదలని ముదితకంటె
నెగసి బుస్సుల పైఁబడుమగువ ప్రియత
ర యగుఁగాదె! కాసారనీరంబుకంటె
నంబుయంత్రోత్థితాంబు పూరంబువలెను.

కాని, తిరిగి యీ గూనిదాసి నా ప్రియురాలితో నేమి తంత్రము పెట్టినదో యని భయంపడుచున్నాను. ఈ వక్రదేహమును కోటలోనికి రానియ్యకుండ నభ్యంతర పెట్టునెడల నన్నియుంతః పురములోనికి రాకుండ గైకేయి వారించును కాన,

గీ. నవరసామోద యైన యీ నాతికొఱకు
గూనుదానిని గూడను గూడకట్టు
కొనగవలసె; నుద్గ్రంథంబు కొఱకు చంకఁ
బెట్టఁబడిన కత్తైన కక్ష్యపీటఁబోలె

గీ. క్ష్మావధూభర్త లఖిలాధికారు లన్న
మాటయేకాని లోలోనిపోటు లన్ని
యెవరి కెఱుఁగంగవచ్చు? నా రేపుడు నగరు
నందుఁ గలదాసులకు దాసు లగుట నిజము.

గీ. లలితలక్షణలీలాకలాపరూప [illegible]
మంజుతను యైన కేకయాత్మజయుఁగూడఁ
గుటిలయా మంథరనుగూడి కుటిలమయ్యె
వంక వెదురునఁ బ్రాకెడు వల్లివోలె.

(కొంచెము నడచుట నభినయించి) అదెగో! అదిగో! హా, ఎంతకష్టము.

సీ. కుడిచేయి తలక్రింద నెడమచేయి యెడమ
బుగ్గపైఁ గదియించి మోము వంచి
ధరణిచే నొకపయోధరమును సవ్యబా
హువున వేఱొకటియు నొత్తబడఁగ
మోకాళ్ళ దరిఁజేర్చి ముడిచి బిగ్గగ నుద
ర ప్రదేశమునఁ జేరంగ నదిమి
వికలితకచభార మొకకొంత ప్రక్కఁదు
స్పటిగ వేఱొక కొంత పచ్చడముగ

గీ. శీతబాధను గుండెలదరీతి బెందు
మానిసినిబోలె నాకాంత లేసిపోని
కోపమునఁ బాముపలె బుసకొట్టు చదిగో!
ప్రక్కపాటున శయనించు నట్టినేల.

గీ. రేపటిమహోత్సవం బేమి? రేయి నిప్పు
డిట్టి ప్రారబ్ధమేమి? హా! యెటులు కలిగె
నిద్ది యెటు కడతేఱునో? యెవ్వఁ డెఱుఁగు
నేమి సేయుదు దైవమా యిప్పు డేను?

గీ. ఏమి సేయుట కేమున్నదింతి కెట్టు
లైనఁ గోపశాంతి సేయంగవలయు
లేకయుండిన జీవము ల్నిలుపఁగలనె
నెలఁత క్రైగన్ను నా యసువులకు నెలవు.

గీ. కోపహరణ వాక్యకోటికిఁ గ్రొత్తగా
వెదకు కొనఁగవలెనె; వేఁబడియులు
వల్లెవేసికొనిన పాఠ మున్నదికదా!
యెప్పఁజెప్పవాఁడ నువిదకడను.

(కైకేయిని సమీపించి) ప్రాణప్రియా! కైకేయీ! ఇదియేమి? ఇదియేమి? నావలన నపరాధమేమైన కలిగెనా? ఎందుల కీకోపము? నీకన్న గోస్థానమైన కౌసల్య నిన్నేమైన దూలనాడెనా? అయ్యో! మాటలాడ వేమి? నీవు పరమాభిమానధనవని యెఱిఁగి యుండియే, నీవు పారతంత్ర్యమూరవని రాముజేసి యుండియే నీయెడ నిత్వరి ముల్లంతేయుపచార మెవ్వరివలన గలుగునో కోయి కన్నుల గనిపెట్టుచు, నిన్ను సముగౌరవపూర్వకముగ నాదరించుచు, నీ నిరంతరానుగ్రహ ప్రాప్తికి వేయిదేవుల నారాధించుచు, నీ ఛాయవలె నిన్ను ననుసరించుచు, నా యభిమానము, నా ప్రాణము, నా సూత్మ నీకొసఁగుచుకొని నిశ్చింతుడనై నేను దినములు గడుపుకొనుచుండఁగా నయ్యయ్యో! తిరిగి యిదియేమి? ఈ కోపమేమి? నా పాపమేమి? ఈ రోష మేమి? నా దోషమేమి? ప్రాణనాయికా? పలుకవా? (కైకేయిపై జేయివైచి నిమురుచు) పరమవిధేయుండనైన నన్నిటులు వేయు వలనేవదని యాజ్ఞాపింపరాదా? నేను నీమాట కెదురాడుదునా? నియ్యకొనుదునా? ఇదిగో ఇటు చూడు! అబ్బ ఇటు చూడు। హరి హరీ! ఎంతకర్మము తటస్థించినది!

కైక – నీకర్మము కాదు నాకర్మము—నా ప్రారబ్ధము—నగు మాటలాడింపకుము.

"ఏమి వాంఛించితివో యడుగరాదా? ఆజ్ఞాపింపరాదా? నీకు వ్యతిరేకముగ బలుకుటకు నేను సమర్థుడనా? పరమవిధేయుడనై నీసేవ నాచరించు వంటివిగదా!"

అంటివి. హా! ఏమి మాటలు! ఏమి నడతలు! ఏమి శిక్యాపాలు! ఏమి నైయ్యములు, ఏమి ప్రణయములు! ఏమి వినయములు! ఏమి స్తోత్రవిధానములు! ఏమి నైచ్యానుసంధానములు, చాలు చాలు! నే నెఱుఁగుదును; అభిమానమును విడిచి ధైర్యపడి "దేహి" యని నోరు తెఱచి చేయిచాఁచి నీపాదములపై నిడ్డిలబడి యడుగక యడుగక యడుగవలసిన దానినైన నిష్కర్షించినయెడల నీవు నాకోర్కె సమకూర్చెదవా? నా దీనత్వమును బాపెదవా? నాముద్దు చెల్లించెదవా? ఎందులకు? ఎందులకు? కొండంత దాటిపోవు బూటకపుమాటలతో నేమి ప్రయోజనము? వలదు—వలదు—నేనడుగనక్కఱలేదు.

దశ — ఆహా! ఏమిమాటలాడుచుంటివి! నీ వడుగుదానిని నేనంగీకరింపక పోవుటకూడనా? అటు లెప్పుడైన జరిగెనా? శరీరమునందు జీవము లుండఁగ నటు లెన్నఁడైన సంభవించునా? ఎంతమాట! నీవర్థింపకుండనే నీచిత్తస్థము లగునభిలాషలను, నీముఖ లక్షణములఁబట్టియు, నీవాక్యములనుబట్టియు; నీపరిచారికలవలన దెలిసికొని యుానే నింత దనుక నెఱవేర్చుచు నీ పరిచర్యను జేయుచుంటిని నీ వెఱుఁగవా? నీ పరిచారిక లెఱుఁగరా? నామనస్సాక్షి యెఱుఁగదా? లోక మెఱుఁగదా? పరిపాలించు భగవంతుఁ డెఱుఁగడా? నేను నీకు సర్వదా వశుఁడనైతి ననుటకు నా దైన్యము ప్రబల నిదర్శనము కదా? లోకోత్తరమైన నీ సౌందర్యము ప్రబలతరమైన నిదర్శనము కాదా? ఓసి వెఱ్ఱిదానా? ముసలిదశరథుని ముక్కుఁ బట్టుకొని యిష్టానుసార మాడించు ముద్దులయిల్లాలవతె యని యాబాలవృద్ధులలో నెవరి నడిగిననైనఁ గైకేయి, కైకేయి, యని నాకేకగ్రీవముగఁ బలుకరా? అట్టి జనవాక్యమందులకుఁ బ్రబలతమనిదర్శనము కాదా? ఇంతయేల? నన్ను నా రాజ్యమును బాలించునది నీవే కదా?

కైక — ఉన్నదీమాటర బండారమే,

దశ:— మాటలబండారమో క్రియలనిదర్శనమో చూచెదవుగాక — అడుగు సర్వసిద్ధముగ నున్నాను.

కైక:— లేదనుటకు.

దశ:— కాదు. ఇక గోరదగినది లేదనిపించుటకు — నీకు నాపైఁ గోపములేదనిపించుటకు—పరమగంభీరమైన నాయనురాగమునకు లోపము లేదనిపించుటకు — వినుచున్నావా?

కైక:— అబ్బ, అబ్బ, శ్రవణానందముగ.

దశ:— మాటలచే శ్రవణానందమే కాదు. చేష్టలచే సంపూర్ణహృదయానందమీయ సిద్ధముగ నున్నాను. ఇప్పుడైన నమ్మెదవా?

కైక:— నీవప్పుడే యేమి చేసితివని నిన్ను నమ్మవలసినది? ఇంక నే నడుగ నే కోర్కెను నీవు నిరాకరింప నేలేదు.

దశ— నిరాకరించుటయే? నా ప్రాణములైనా నసరే కోరుము మారుమాటాడక నీపాదాగ్రములందు సమర్పింతును. కాని, కల్యాణీ నన్నేల విశ్వసింపవు?

కైక:— అవితాంగనాలోలుని నమ్మదగునా?

దశ:— (నవ్వుచు) నాకట్టి సౌఖ్యమును కలిగించిన ఇట్టి జగన్మోహనాకారు నేల విశ్వసింపవలయును?

కైక:- (కోపముతో) మంథరా, ఇటురా. నాకు మఱియొక గదికి దారి జూపుము. నాథునికి నేను విశ్వాసపాత్రిమును గాను. నేనితనికి దుష్టస్వభావను. కౌసల్య సర్వసద్గుణాన్విత—నే నీతనికంటికి దొంగను. ఆ జ్యేష్ఠదారసాని—అపరిమితానురాగమున సర్వదా సర్వదా ప్రాకులాడు నే నితనికి విశ్వాసఘాతమను గాను నోరెత్తి. మొగముపై మొత్తు రాకాసినైన యాకౌసల్య యీ మహానుభావునికి బరమ విశ్వాస విధానము మంథరా, రా వేమి?

దశ:- (కైకేయి చేతులను బట్టుకొని) అబ్బ.

కైక:- నన్నంటకుము. (చేతులు విదల్చుకొనును)

దశ:- అబ్బ, ఇప్పుడు నే నేమంటినని నీకింత యాగ్రహము? అలౌకిక మగు సౌందర్యమును గొనియాడుచు నాచిత్తచాంచల్యమును బరిహసించుకొంటిని గాని నావలన తప్పేమి కలిగెను? ఇంత ముక్కుమీద గోపమైన నే నెటుల బ్రతుకగలను?

కైక:- జిహ్వాగ్రమున నింతయసత్యమున్న నిన్ను నే నేమి వాంఛింపదగును

దశ:- (ఉస్సురని) ఇక నట్టిమాట నాడకు కోపము.

గీ. అబలయెడ ముందునకు నిడ్డయడుగు వెనుక
కిడుట, యార్తులకై చాచబడిన కరము
ముడుచు టర్థుల "కూ" యనియెడు రసనము
తోట "నుహుహూ" ను నెపుడు త్రోవగాదు.

కైక:- పెబాన్ అట్టియనూచానసరణి ననుసరించి యిప్పుడిచ్చెదవా?

దశ:- మనఃపూర్వకముగ—ఆత్మానందకరముగ—

కైక:- అదిమాత్ర మసత్యము.

దశ:- అటు లంటివేల?

కైక:- అనకపోవుటయేల? ఎవ్వరికెనను నెప్పుడైన నేమైన నీవు మనఃపూర్వకముగ నిచ్చితివా?

దశ:- ఆ ఆ నీకు జ్ఞప్తిలేదు కాబోలు ఎవ్వరికో యననేల? నీకే యిచ్చితిని.

కైక— ఎప్పుడు?

దశ:- అనేకపర్యాయములు.

కైక:- దేనిని?

దశ:- కౌగిలిని. నీయాజ్ఞయగు నెడల నిప్పుడుగూడ నిచ్చుటకు సిద్ధముగ నున్నాను. (కౌగలింపబోవును.)

కైక:- ఇది పరిహాసనమయము కాదు. మాయావాక్యములచే నా చిత్తవృత్తి నజ్ఞానయుతబాలికలకు నాటవస్తువులచేవలె బ్రిక్కృతోద్దేశమునుండి మఱలింపబోటు

పడుచున్నావు నే నెఱుగుదును. ఈసారి నేను మోసపెట్టఁబడుదుననుకొంటివా ? నన్నెంతలాఘవముగ నెంచుచుంటివి ?

దశ — నేనిచ్చెదనని యాసపెట్టి మనఃపూర్వకముగ నెవరికీయలేదో చెప్పరాదా.

కైక — చెప్పనేల ? నీ వేల యెఱుఁగవు? ఎవరికని నన్నడుగుచుంటివా ? నా వంటి యూరుపేరులేనివారికైనయెడల నింత ప్రతిష్ట నీ కేల కలిగియుండును? ఎవరికో యెఱుఁగకుంటివేమి ? ఆసనాగ్ర పుత్రపట్టాభిషేకమున నిన్ను రాజ్యభారము విడువ వలసినది కాని పూర్వస్మృతి యేలవిడిచినది ? ఎవరికో చెప్పవలెనా ? జననమైనది మొదలు యాచ్నావృత్తి నెన్నఁడెఱుఁగని మహామహునికి హస్తద్వయమును హృద యాంబుజమును ముకుళింపజేసుకొని దైన్యమున నిన్నర్థించిన మహానుభావునికి ఇప్పటి కైన జ్ఞప్తియగుచున్నదా ?

దశ — (స్మృతి నభినయించి పెదవివిఱిచి) అతనికి మఱియొక లాంఛనమును జెప్పుము.

కైక — అబ్బ, ఎంత విస్మృతి, అంబుజభవసన్నిభుఁడైన తపోధనునకు.

దశ — (సందేహమున) వ-సి-ష్ఠునికా ?

కైక — కాదు వసిష్ఠునివంశమును నిరంకురము జేసినయాతనికి.

దశ — విశ్వామిత్రునికా ?

కైక — ఆ మహాతపశ్శాలియభిసంధిని నెఱవేర్తునని తెగబారెడు వాగ్దానములు చేసి కొండంతయాశపెట్టి, నోరుతెఱచి యడుగనిచ్చి తుదకేమిచేసితివో ? యింతలో మఱచిన లోకము మఱచుననుకొంటివా ?

దశ — ఏమి చేసితిని ? రామచంద్రు నా తపస్వీంద్రునితో బంపలేదా ?

కైక — అబ్బ, ఎంత నిర్దాక్షిణ్యముగ మొదట నిరాకరించితివి ? ఎన్నిమాయలు పన్నితివి ? ఎన్ని బొంకులాడితివి? ఎంతదైన్యపడితివి, అబ్బ అప్పుడేమిగోదనములు, ఏమిశిరస్తాడనములు, ఏమి మూర్ఛాపరవశతలు, ఎంత పూర్వపక్షము, ఎంత రాద్ధాంతము, ఏందఱి మాధ్యస్థ్యము పలికి లేదనుట కెన్నిపాట్లు పడితివి ?

దశ — ఈ యవాంతర గాథకేమి ? సత్యవాగ్రక్షణాసక్తిచే రామభద్రుని విడుచుట కప్పు డంగీకరించితిని గదా ?

కైక — ఎప్పుడు? భైరవాకారుఁడై, క్రోధమూర్తియై, శాపముచే మిమ్మందఱి భస్మము చేసెదనని గాధేయుఁడు గంతులువైవ, నీ కిది నీతికాదని వసిష్ఠుఁడు నిన్ను మందలింప, దశరథుని సతులకు నాలుకలకుగూడ లెక్కలేదని లోకులు పరిహసింప, సత్యవాగ్రక్షణార్థమై కాదు — స్వప్రాణసంరక్షణాసక్తిచేత-స్వగౌరవాపనాభిలాష చేత అంగీకరింపక తప్పకపోవుటచేత...నంగీకరించితివి.

దశ — ఓసి వెఱ్ఱిదానా ? తుద కంగీకరించితిని గాదా? అదియే కావలసినది. మధ్యమున జరుగు గొడవలతో నేమిపని ? కార్యఫలమునుబట్టి కర్తయుద్దేశమును గ్రహింపవలెను. స్థిరమైనఫలము ప్రధానమా ? పరిపరివిధముల బయలుపడు భావము

ప్రధానమా? ప్రశస్తమైన భావ ముండినందులకైనం బర్యవసానము ఫలమేకద, అది సిద్ధించినపుడు భావపరీక్ష యేల? అది లేనపుడు భావప్రాశస్త్యమేమి లాభము?

కైక—అహా, ఎట్టి ధర్మసూక్ష్మనిర్ణయ మొనర్చితివి. కార్యఫలమే ప్రధానము గాని కర్తయుద్దేశ మనావశ్యకమని యుపదేశించితివి. జ్వరితునిలంఘన ముపవాసవ్రత మగునా? పతితో గలహించి జన్నిదముల ద్రెంపుకొనిన భ్రష్టుఁడు యతిపూజ నందఁగలఁడా? ఫలహారములకై దేవాలయములపంచలఁ బడియుండు బాపనయ్యలు భాగవతోత్తములు అగుదురా? ఇంతయేల రేపటినుండి యెవరేలిన నీదినమువఱకు నీవు చిరకాలమునుండి రాజ్యముచేయుచుంటివికదా, ఒకఁడు నరహత్యచేసినటుల నిదర్శనము కలుగఁగనే వానికి మరణదండము విధించుచుంటివా? మృగభ్రాంతిచే నాతఁడు హత్యచేసెనో-పట్టజాలని కోపమునఁనే చేసెనో, సామాన్యమగు శిక్ష నాతఁడుద్దేశింపనది హత్యక్రిందఁ బరిణమించెనో, యిటులు భావపరీక్ష సేయుటలేదా?

దశ—అబ్బబ్బ, ఎందులకీ యనవసరమైన వాగ్వాదము? నేను గాధినందనునకు మనఃపూర్వకత్యాగ మొనర్పలేదు సరియా? తరువాత?

కైక—ఎందుచేత?

దశ—నాకు సంతాపకర మగుకోరిక నాతఁడు కోరుటచేత.

కైక - దుఃఖకర మెటులయ్యెను? శివధనుర్భంగవార్త నీకు గష్టకర మయ్యెనా? మారీచపరాజయము నీకు సంతాపకరమయ్యెనా? కోడుకుతో గోడ లింటికి వచ్చుట నీకు దుస్సహమయ్యెనా? ఎంతవిరుద్ధముగ మాటలాడుచుంటివి?

దశ - (ఉస్సురనుచు) కైకేయీ, అంత కఠినోక్తులేల? రామభద్రవియోగము మొదట సంతాపకరమయ్యెనుగాని పర్యవసానమున బరమసుఖప్రద మయ్యెను.

గీ. అబల! రోదనారబ్ధ కార్యములుకొన్ని
తుదకు ముదమిచ్చు, బాలుర చదువుఁ బోలె,
నతులితోత్సాహరచిత కార్యములుకొన్ని
ప్రాణహరములు వృద్ధవివాహమటులు.

కైక - (తనలో) నిశ్చయమే, అత్యుత్కంఠచే సంకల్పింపబడిన రామపట్టాభిషేకము నీవు మహాదుఃఖప్రద మగునటులు చేయుటయే నా సంకల్పమై యున్నది. (ప్రకాశముగ) రాజేంద్రా, వృద్ధవివాహమువలె; ప్రాణహరమని చెప్పుచుంటివి, హా, ఎంతవాఁడవు, నిన్నటిదనుక నీకు నేను మెడలోని పూలదండనై యిప్పుడు సర్పమైతినా? ఇంతవరకు నీ ప్రాణాధిష్ఠానదేవత నగు నే నిప్పుడు నీకు మరణదేవతనయితినా? నేను నీకేమి చేసితిని? నావలన ఘోరాపరాధ మేమికలిగెను? ఇచ్చెదను కోరుమని నీవు నన్ను నిర్బంధపెట్టుటచేత నిన్ను యాచింపబోయితిని. ఇదేనా నా పాపము? ఇదేనా నా నేరము ఇందుకేనా యీ కోపము. ఈపుల్లవిఱుపుమాటలు, ఈతిట్లు! ఈ వృద్ధవివాహ ప్రశంసలు, ఈ యువతీ ప్రాణహరణసంభావణములు, అహా, ధరణీనాథుల త్యాగమర్యాద లెటులున్నవి? నోరుమూసుకొని కడుపుకట్టుకొని యుండియుంటి

యనక యన్నివిధములైన హానిపతనమునకుఁ దలయొగ్గి సేవచేయుచున్నంతకాలమే సేవకుఁ డిష్టుఁడా? అడుగక యడుగక యర్థించినతోడనే దుష్టుఁడా? తలవంచుకొని కడుపుమాడ్చుకొని చేతులు జోడించుకొని, యూడిగము చేయుచున్నంతకాలమే ప్రియుఁడా? ప్రాణరక్షణావసరము కలిగి "దేహి" యని పెదవులు విప్పినతోడనే పిశాచమా? స్తోత్రపాఠములు చెవినిబడుచున్నంతకాలము—

దశ—అబ్బబ్బ కైకేయీ! (రెండుచేతులం బట్టుకొని) నన్ను క్షమింపుము, నీ వడుగఁదలచిన కోరిక నీకిచ్చుట కిష్టములేక నిన్నేమియు నే ననలేదు. అనలేదు అనలేను. అనవసరవ్యాయోవ్యాసంగ మేల? ప్రస్తుతాంశమునకు రమ్ము.

కైక – రాముని విశ్వామిత్రునితో మనఃపూర్వకముగ నేల విడువలేకపోతివి?

దశ – అది యప్రస్తుతము కాదా?

కైక – కాదు చెప్పుము.

దశ – (తలవంచుకొని యుండును.)

కైక – రాజేంద్రా! మాటలాడకుంటివేమి?

దశ—చిదిమినఁ బాల్గారు చెక్కుటద్దములపై
జిలిబిలి చిఱునవ్వు లొలయువాఁడు
కాళ్ళగజ్జలు గల్లుగల్లు మనంగ నం
దటికను ల్చల్లగాఁ దిరుగువాఁడు
బుడిబుడినుడువులఁ బూర్వభూపాలగా
థల నేను గుడుచుచోఁ బలుకువాఁడు
రాఘవా! ముద్దియరా! యన్న నెగిరి గం
తిడుచు హాయిగఁ గౌఁగిలించువాఁడు

[నట్టిపదునాలుగేఁడులబొట్టె నెట్టు
లసురభీకరవనసీమ కంపువాఁడఁ
ననుచు నేడ్చితి నెప్పుడో యపుడు; మఱల
నిపుడు నీమూలమున నట్టు లేడ్చుచుంటి [illegible]

(కన్నులనీరు గ్రుక్కుకొనును.)

కైక – (తనలో) తథాస్తు! నా సంకల్పము [illegible]. (ప్రకాశముగా) రాజచంద్రా! నా మూలమున నంటి వేమి?

దశ – అంతలనేఁ దిరిగి కోపమా? పూర్వవృత్తాంతము నీవు జ్ఞప్తికిఁ దెచ్చుటచేత నని నా యభిప్రాయము. (తనలో)

గీ. తఱుచు డగునేకపత్నీవ్రతప్రియునకు
దారవిరహముకంటె సుదారమౌన

ధనునకు సిరి పోవుటకంటె ఘనతరంబు
వృద్ధునకుఁ బుత్రవిశ్లేష పీడగాదె.

(ప్రకాశముగా) అడుగఁదలచిన దేదియో యడుగక యింకను సంకోచించుచు టివేల ?

కైక – నేను విశ్వామిత్రుఁడను గానైతినని సంకోచించుచుంటిని.

దశ – ఆ దెఁదులకు.

కైక – కాంక్షించిన యర్థమీయనని నిరాకరించిన శాపమిచ్చెదనని బెదరించుటకు, రాజేంద్రా ! నే నొకమాటఁ జెప్పుచున్నాను. వినుము నేనబలను. నీసతులందఱికంటెను గోలను నాలుగుమాటలైన నేర్చినదానఁగాను. నీవెటులాడించిన నటులాడుదానను, నే వాంఛించిన పదార్థము నీ వొసంగక నిరాకరించినచో నేఁ జేయవలసిన దేమి ? విశ్వామిత్రునివలె నాకుఁ దపసామర్థ్యములేదు. అతనికివలెఁ దీక్ష్ణజిహ్వా లేదు. అంత దీనత్వమునఁ బ్రార్థించుభార్యను నిరాకరించుట నీతిగాదని నిన్ను మునుపటివలె మందలించుట కిచ్చట వసిష్ఠభగవానుఁడేడి ? ఇది యంతఃపురముగాని మహారాజసభగాదు కదా ! నా దైన్యమునకు నీ వాగ్దానమునకు నిదర్శనమేమి ? విశ్వామిత్రునంతవానిని గిజగిజలాడించిన నీకు లోఁకువయైన నే నేమి లెక్క.

దశ – నీకు నాపై నంత నమ్మకములేదు కావున నిది విను.

సీ. ఎవ్వానిఁ దాపసి కీయ నేడ్చితి వని
యింతదూర ముపన్యసించినావో
యెవ్వాని జననమే యిద్ధమత్పృథుసౌఖ్య
నవనాటకమునకు నాంది యయ్యె
నెవ్వానిపై మోహ మిట్టులు న న్నాఁడు
దానికంటెను బేలవానిఁ జేసె
నెవ్వాని మూఁపుపై కెగయనున్నది రేపు
రఘువంశమహనీయ రాజ్యలక్ష్మి

గీ. యెవనిచేతులమీఁదుగా నేను వెడలి
పోవుటకు వేయిదేవుళ్ల మ్రొక్కుచుంటి
నట్టిరఘురాముతో నొట్టుఁ బెట్టుకొందు
సరికదా! కోరు, సందేహసరణి మాని.

కైక – సరే చాలు ! ఓ త్రిశంత్కోటిదేవతలారా ! సూర్యచంద్ర భగవానులారా ! ఓ పంచభూతములారా ! దశదిక్కులారా ! వింటిరా? వింటిరా! నా ప్రాణనాథుని ఘోరప్రమాణము ! మీరిందఱిందులకు సాక్షులు.

దశ — (అదరిపడి) అదేమి అదేమి అంత సాహసముతో మాటలాడుచుంటి నేమి (తనలో) ఆహా దీనినడువడి యీరోజున నేమో వింతగ గనబడుచున్నది. రామభద్రునిపై బ్రమాణము చేసినవెంటనే యీమె యింతయుత్సాహమున బ్రుళ్ళి పడుచున్నది. అతని క్షేమమెరగీడు సంకల్పించుకొనుచున్నదాయేమి? (ప్రకాశముగ) ప్రాణనాయికా! అంత యాగ్రహాలాపమునకుఁ గారణమేమి?

కైక — (తనలో) ఈతఁడు నాసంకల్పదౌష్ట్యమును బసికట్టుచున్నాడు కాబోలు. అయిననేమి? పాములవాడు సర్పమును మంత్రబద్ధమును జేసినటుల నే నితనిఁ ప్రమాణాభిబద్ధుని జేసితిని. ఇక నెక్కడకు దప్పించుకొనిపోగలడు? అయిన కొంచెము లాలింతును. (ప్రకాశముగ నవ్వుచు) రాజేంద్రా! నీకు రాజత్వము నాకు రాణీత్వ మీనిశతో నంతమగునుగదా! రేపు నిన్ను నేను గోరునదిలేదు. నీవిచ్చిన దంతకంటెలేదు. అదిగాక నూతనపట్టాభిషేక సమయమున సర్వరాష్ట్రమందలి యర్థుల వాంఛలు నెఱవేర్చుట యాచారమైయుండగ నింతకాలమునుండి నీపరిచర్యఁ జేయు చున్న నాకోరిక నేల తీర్పగూడదు?

దశ — (తనలో) ఈమె యుద్దేశమునుగూర్చి దుర్భ్రమ మొందితిని. (ప్రకాశ ముగ) కైకేయీ! సంతసించితిని. ఏది కోరిన నది యిచ్చెదను.

కైక — కోరనా?

దశ — అవశ్యము.

కైక — పూర్వమున—

దశ — (నవ్వుచు) నేను నిన్ను వివాహము గానపుడా?

కైక — ఆతిమిధ్వజునితో నీవు యుద్ధసేయుచు, రథముపై మూర్ఛనొంది నవు డారథమును నేను దోలుకొని రణరంగమునకు దూరప్రదేశమున నిలిపి...

దశ — ఆహా! ఏమది! నాకిది స్వప్నవృత్తాంతమువలె నున్నది సుమా

కైక — అట్టివో నన్నియు స్వప్నవృత్తాంతములే. ఐశ్వర్యములే స్వప్న వృత్తాంతములు. అసువులే స్వప్నవృత్తాంతములు. అఖిల ప్రపంచవ్యాపారములే స్వప్నవృత్తాంతములైనచో నసురయుద్ధములో నబల యొనర్చిన యాపద్రక్షణము స్వప్నవృత్తాంతము కాదా.

దశ — (స్మృతి నభినయించి) కోపపడకుము. జ్ఞప్తికి దెచ్చుకొనుచున్నాను. అప్పుడు నీకు రెండువరము లిచ్చితినిగాదా?

కైక — ఇచ్చితివా? ఇచ్చెద నని చెప్పితివా

దశ — అలాగా? రెండువరముల నీయలేదా? (నవ్వుచు) అప్పుడిచ్చిన దీ రెండు వరములేనా? (కౌగిలింపబోవును) చూడు ఆ వరములను ముం దెప్పుడైన గోరెద నని నీ వంటివా?

కైక — ఔను. ఆసమయ మిప్పుడు తటస్థించినది.

దశ — ఎంతవడిగలదానవు? ఇచ్చెద ఇచ్చెదను; గ్రహించు మని బతిమాలి నవుడు బిఱ్ఱబిగిసి వార్ధకమున దద్వృత్తాంతమే మఱచిన నన్ను వానికొఱ కిపుడెంత

బాధించితివి. నిన్నుని నాతో స్పష్టముగ జెప్పిన నే నిపుడీయకుందునా? ఈ మాటబిగింపు లేల? ఈ యుపోద్ఘాతము లేల? ఈ నర్మగర్భసంభాషణము లేల? కైకేయి విధేయుడవైన నిన్నిటు లాడించనేల? (నవ్వుచు) నా వార్ధకముతో నీ పడుచుదనముకూడ హెచ్చుచున్నట్టున్నది. ఆలస్యమేల ప్రాణనాయకా రెండు కోరికలే కద కోరుము.

గీ. బాహ్న్యగజములో యావనాశ్వములో, నార
నాసికాగోగణంబో; చీనాంబరములో
రత్నచిత్రిత కాశ్మీరరాంకవములో
గోలకుండ మానికములో కోరు మబల!

కైక — ప్రాణనాథా ఇవి యన్నియు స్వప్రయోజనమాత్రమైన న్యాలా? నా కోరిక యితరులగూర్చి కాని నన్నుగూర్చి కాదు.

దశ — అలాగా అటులైనను మంచిదే.

గీ. [అబల! నీ యరి యగు సుగుణాభిరాము
నెవని వేగంబు కానం ద్రోయింపవలయు?
భవదనుగ్రహపాత్రుం డౌ భాగ్యనిరతు
నమరవిభునిభు నెవనిం జేయంగవలయు?]

కైక — సెబాస్ సెబాన్ నేను గోరిన వీ రెండే నాకు శత్రుస్థాన మగు కౌసల్యకొడు కగు రామునికి వనవాసము. నా పుత్రుడైన భరతునికి పట్టాభిషేకము.

దశ — (అదరిపడి) అ అ అదేమి అదేమి

కైక — ఏమియో తిరిగి చెప్పవలయునా? నారచీరలుధరించి వానప్రస్థుడై రేపు మొదలు పదునాలుగువత్సరములు రాముడు దండకారణ్యమున దిరుగవలయును. రామపట్టాభిషేకసమానీతసంభారములతో భరతునికి బట్టము గట్టవలయును.

దశ — (గడగడ వడకుచు) కైకేయీ నావంక జూడు నావంక జూడు ఏమి? ఏమి? నీవు పరిహసించుచుంటివా? యథార్థముగనే పలుకుచుంటివా?

కైక — ఎవరివంక జూడనక్కఱ యేమున్నది? దైవమువంక జూచి చెప్పుచున్నాను; సత్యము. సత్యమే వచించితిని. సర్వోత్కృష్టమైన సత్యమునే సంరక్షించుకొనుమని నీ కుద్ఘాటించుచుంటిని.

దశ — ఆఁ!, ఆఁ!, అది యేమి? అదియేమి? ఏమి మాటలాడుచుంటివో యెఱిగి యుండియే మాటలాడుచుంటివా. కైకేయా! కైకేయీ! (వీఁపుపైఁ జఱచును)

కైక — ఎఱిఁగియుండియే మాటలాడుచుంటిని ఇంతకుముందు నీ చేసినవాగ్దానము నెఱిఁగియుండి, బాగుగ నెఱిఁగియుండియే నీవు నడచుకొనవలసినదని యెఱిగించుచుంటి.

దశ — (పెదవివిరిచి తల యడ్డముగనూఁపి) కైకేయీ! తొందరలేదు. రాముని జననమునకుఁ గొంచెము ముందుకూడఁ గౌసల్యకిట్టులే యావేశము కలిగినది. ఇప్పు డాతని పట్టాభిషేకమునకు ముందు నీకు నట్లే యావేశముకలిగినది. మఱేమియులేదు. పెద్దలా! పేరంట్రాండ్రో! మ్రొక్కుకొందును.

కైక – పెద్దవు నీవు; పేరంటాలిని నేను. నిన్ను నేను, నన్ను నీవు నావేశించి చిరకాలమైనది. ఇట్టి ప్రోపుడుమాటలతోఁ గాలక్షేపము సేయదలఁచితివా? వాంఛించిన వరము లీయవలసివచ్చునని, యెంచి నాకుఁ బిశాచ మావహించెనని బొంకుచుంటివా?

దశ – పిశాచము కానియెడల మతిభ్రమమై యుండవలయును. కాకపోయిన యెడల నీవేమి? కౌసల్యయొద్దకంటె నీయొద్దనే యెక్కువ చనవుగఁ బెరిగిన రాము నేమి — అబ్బ! అబ్బ! అంతమాటయే! అనుటమాట యటుంచుము. అనినవారిని గ్రుడ్లు పీకించెదవుగాని బ్రతుక నిత్తువా? అట్టి రామాభిమానముగల నీవు—

కైక – వెనుకటిమాటఁ దడవ నేల? పూర్వవృత్తాంతములు స్వప్నగాథలని యిప్పుడేకదా పలికితివి!

దశ – అలాగే కానిమ్ము! స్వప్నమందైన రామునకుఁ గీడెంచని నీకిప్పు డిది యేటి దుర్బుద్ధి!

కైక – అడుగదగినది యగుటచే నాది దుర్బుద్ధియా? ఇచ్చెదనని యవిలంఘ్య ప్రమాణమును జేసి నేను బలవించుచుంటిననియు, నా కాకస్మికోన్మాద మెత్తినదనియు వెఱ్ఱివెఱ్ఱివంకలను గల్పించుకొని యసత్యమాడఁదలచుట నీది సుబుద్ధియా! ఆహాహా! ఎంత విపరీతముగ నున్నది.

దశ – అడుగఁదగినది యడిగెద నంటివి! రామవనవాస మడుగదగినదే నా? హా! హా! రాముఁడు సర్వగుణాభిరాముఁడు నీ కేమి యపకార మొనర్చినాఁడు? భరతునికంటె రామభద్రునికే నీయందుభక్తి హెచ్చని యనేక పర్యాయములు నీవు వచించితివి కాదా, నిన్నే మాతృాధికఁగ బ్రేమించి నీ సేవఁ జేయుచున్న యావినయ ధురీణుఁడు ఆ యనురాగ సాంద్రుఁడు— ఆ శ్రీరామచంద్రుఁడు నేఁడిట్టి క్రూరశిక్షకుఁ దగిన మహాపాపము నీ యెడ నేమిచేసెను? కైకేయీ కైకేయీ, ఆలోచించుకొనుము తనువులు శాశ్వతములుగావు, మాటలు చర్యలే మన వెంటవచ్చునవి నీకింత కాఠిన్యము లేదు నే నెఱుఁగుదును. ఆ దిక్కుమాలిన గూనిదాసి నీకీ దుర్బోధనము చేసినది కాఁబోలు. కైకేయీ, ఆలోచించుకొనుము.

కైక – మంథర నాకీ దుర్బోధనముఁ జేసిన దనుచున్నావా? ఆఁ! రామ పట్టాభిషేకమునుగురించి యాఱుమాసములనుండి పెద్దదేవితోడనే గుసగుసలాడుమని నీ కెవరు దుర్బోధన మొనర్చినారు? ఈ మహోత్సవమునుగూర్చి నా కింతదనుకఁ దెలియనీయవలదని నీ కెవరు దుర్బోధన మొనర్చినారు? నాకు దెలియనిచ్చిన భరతునికిఁ బట్టాభిషేక మొనరింపుమని నే నేడ్చిపోదునని భయపడి యా నోరెఱుఁగని పసిబిడ్డను పదపదయని మెడబట్టి మేనమామయింటికి గెంటుమని నీకెవరు దుర్బోధన

మొనర్చినారు? అది యటుంచుము. ఈ యుదయమునుండి యిప్పటివఱకు నాయి టిలో నడుగుపెట్టవలదని నీకెవరు దుర్బోధన మొనర్చినారు?

దశ - హరిహరీ ఈయసత్యములై. నీ నేరములను నాయెడలఁ గల్పించి, యీ చండాలురాలు పవిత్రమైన నీహృదయమును సకల్మషముగఁ జేసెను. ఈ యుదయము నకు బూర్వమెన్నఁడైన రామపట్టాభిషేకమునుగురించిన యోజనము చేసియుండిన యెడల నాశ్రీమన్నారాయణమూర్తి పాదములకుఁ దప్పినట్లే...

కైక - అబ్బ అబ్బ నారాయణమూర్తికూడనా? ఆజ్యేష్ఠరాణిగారి పాద ములకుఁ దప్పినట్లే యనుము. ఆపలుఁగాకియే నీకిపుడు పరమదేవత - ఆ రాకాసియే నీకిప్పు డిష్టదైవము ఆ పాపాత్మురాలి పాదములే నీకిపుడు శ్రీపాదములు. అంతమాయ లాడి శిక్షలో మెలఁగిన నీకిక బొంకుల కేమి కొదువ? తంత్రముల కేమికొదువ?

దశ - (ఊసుస్సురనుచు) కైకేయీ సరే నీనిందలను శిర మొగ్గితిని నీవు నాపై వైచిన నేరము లన్నియు సత్యములనియే యెంచుము. అట్టిచోఁ గౌసల్యదుర్మార్గ రాలు. శిక్షార్హురాలు దానివలనఁదగిలిన నేను పాపాత్ముఁడను దండనార్హుఁడను. కావున నిర్దోషుఁడైన రామునకు విధింపబడిన వనవాసము మాయిద్దఱకు విధింపుము. నీయాజ్ఞను శిరమునధరించి యిప్పుడే వెడలిపోదుము. కులగురుఁడగు వసిష్ఠభగవానుఁడే రామపట్టాభిషేక మొనరించును గాక

కైక - రామునిక్కడ సింహాసనముపైఁ బెట్టి నాయెదుట బొమ్మన గుంపటి బెట్టి మీయిద్దరును జెట్టపట్టముల వైచుకొని కులుకుచు వనవిహార మొనర్తురా? ఈ యదృష్టానుభవము చాలదా? ఈనిరంకుశ మమకారవిజృంభణములు చాలవేమి?

దశ - (ఊసుస్సురనుచు) హా హా ఈమాటయుగూడ దప్పియయ్యెనా నేను వానప్రస్థుఁడ నయ్యెదను. కౌసల్యను బుట్టినింటి కంపెదను. ఇందుల కంగీక రించెదవా?

కైక - [అంగీకరింపను. నేను గోరినవరము లిచ్చెదనని ప్రమాణ మొనర్చితివి కాని ప్రతినిధులు నిచ్చెదనని ప్రమాణముచేసితివా? ఏటిమాట లాడెదవు? రాముఁడు వనమునకేగుట తప్పదు. భరతపట్టాభిషేక మంతకంటెఁ దప్పదు. రేపటి రామవన వాసమహోత్సవముచూచి [కౌసల్య కోటయందు గోలుగోలుమని గోలపెట్టుచుండ నేను నేత్రానందకరముగఁ జూడక తప్పదు.]

దశ - ఛీ, ఛీ, పశువా, ఏమి యరచుచున్నావు, అఖిల ప్రపంచాహ్లాదకరుఁ డైన రామచంద్రు నడవులపాలుచేసి యే పులివాతనైనఁ బెట్టి, జ్యేష్ఠపుత్రవిరహమును సుర్రితాడు నా గొంతుకకుఁ జుట్టి చేతవాతఁగాని భరతుని సింహాసనమునైనలంకరించి, వానివంకఁ బెట్టుకొని, వసుధాతలమంతయు నేకాతపత్రముగ నేలఁదలఁచుచుంటివా? అబ్బ, అబ్బ, (గుండెలుకొట్టుకొని) నీ మనసులో నెంత యూహాయున్నది, పో, పో, నేను వరముల నీయను.

కైక - ఇమ్మని నేను నిరోధించినా, నీ స్వభావమును గుర్తెరిఁగియుండియే నే నుదాసీనభావమున నుండఁ గోరుకొమని నన్ను నీవు బలాత్కరించి, రామభద్రు

నెత్తిఁగొట్టి ప్రమాణము చేసి నన్ను దైన్యమునఁ బ్రార్థింపఁజేసి తుద కీయనని పలుకు
టకు సాహసించితివా? అహా! ఏమి వదాన్యత! ఏమి సత్యవాక్యధురీణత!

దశ — ఛీ! ఛీ! తుచ్ఛురాలా! కానక కానక కన్న పెద్దకొడుకును మావంశ
మును నిర్మూలము చేయుటకై యుద్భవించిన రాకాసివగు నీ వాతను జేతులారఁబడ
వైచుకపోవుట వదాన్యతాశూన్యత్వమయ్యెనా? నీ పైపై తళుకులకుఁ గనులు చీకటులు
గ్రమ్మి, సుఖానుభవపూర్ణములగు నీ యాలాపములకుఁ జెవులు పరవశములై నీ
నీ యంతఃక్రౌర్యానిలబహిస్స్వాదు చేష్టలకు మతిమందగించి, ప్రాణలీలామాత్రావశిష్టతను
ధారినై — పరమ శీతమహోగ్రజ్వాలవైన నిన్ను - మృదులమంజులాసిధారవైన నిన్ను - కంఠ
మాలాలంకారరూపగళపాశలతవైన నిన్ను - భామారూపభయంకర మృత్యుదేవత వగు
నిన్ను నా ముద్దుల యిల్లాలివని భ్రమపడి, వెఱ్ఱిపడి, బుద్ధి బుగ్గియయి, స్మృతితప్పి జేసిన
ప్రమాణమును నెఱవేఱుపకపోవుట సత్యవాక్యధురీణతాభావ మయ్యెనా? ఆ! ఏమి!
ఇచ్చటి మహర్షులకంటె ధర్మాధర్మనిర్ణయసమర్థురాలవు నీవే కాఁబోలు నేమి?

కైక — నోరు కలిగినందులకు ఫలము కేకలు వేయుట కాదు. అనినమాటకు
బ్రతివాక్య మాడకుండుటయే! [రాజేంద్ర! రాజర్షిమండలమును మహర్షిసంఘమునిటకు
రావించి, "నా ధర్మపత్ని యగు కైకేయికి, నే సమిత కృతజ్ఞతాసూచకములుగఁ
బూర్వమిచ్చిన రెండువరముల నిప్పుడొసంగెదఁ గోరుమని, ప్రమాణపూర్వకముగ
బలికి పలికినమాటను నెఱవేర్చుకొనలేక పోయితిని" ]అవి చెప్పసరికి "ఇస్సిరో! ఎంత
పనిఁ జేసితివి!" అని వారు నిన్ను దూషింపనియెడల నే నీ రెండుచెవులఁ గోయించు
కొందును.

దశ — ఆ రాజర్షులతోడ నే, యా మహర్షులతోడ నే యీ మహానుభావురాలు,
ఈ కర్ణపర్వాళనిపాతము — ఈ సపుత్రికవంధ్య — కోరినవరము లేవో వివరించినచో
నట్టికోరికల నీయనందులకు వారు నన్ను "ఛీ" యందురో, యడిగినందులకు నీ మొగ
ముపై నుమియుదురో? చెవులను గోయించుకొందునని ప్రతిజ్ఞ చేయుచుంటివా?
మంథరా దుర్బోధనాకర్ణనపాపభూయిష్టము లగు నీ చెవుల కాశిక్ష కావలసినదే.
అంతేకాక — యిట్టిలోకోత్పాతములగు నా వాంఛలను వెల్లడించినందులకు నీనాలుకకు—

కైక — నా నాలుక మూలచ్ఛేదశిక్ష యగుటకు నే నాడితప్పితినా? [రాజేంద్ర,
సంపదయో దెబ్బయో యిచ్చెదనని సప్రమాణముగఁ బలికితివి. నీకు భార్యలు
మున్నూటయేబదిమంది యున్నారు. పుత్రులు నల్గురున్నారు. ఆశ్రితు లనేకకోటు
లున్నారు. కాని నాలుకమాత్ర మొక్కటే. ఆడినమాటకుఁ దిరుగఁగూడదు. వరము
శ్రేష్ఠమైనదేమి? ఇష్టమైనవి కోరినయెడల నిచ్చుటయా, నరిష్టమైనవి నిరాకరించుట
యా? ఇంక బదులుగా సతులను గట్టుకొనుము నీవు కోరినయెడల సంతోషముగ
నంగీకరింతువు కాఁబోలు! కౌసల్య యింటిలో నే కాలము గడుపుమని నేను గోరిన
యెడలఁ గంతులు వైచుచు సమ్మతింతువు కాఁబోలు. సత్యము నీ బుద్ధివలెఁ జంచల
మైన దనుకొంటివా? అది నిశ్చలము, శాశ్వతము, అవికారము. సర్వప్రపంచాధార
ముదియే, అదియే దైవస్వరూపము. నన్నుఁ ద్యజించిన ద్యజింపవచ్చును గాని
దైవముతో నీకుఁ బరిహాసమేల? దైవనిరాకరణమునకే యొడఁబడితివా?]

దశ - ఏమి! విషముష్టిలతనుండి యమృత స్రావమా? చార్వాకముఖమునుండి బ్రహ్మోపదేశమా?

కైక - కాదు. పాలవెల్లిలో పాముద్భవించినది! కల్పవృక్షమునకుఁ జీకటి కొమ్మ మొలిచినది.

దశ — ఏమంటివి? ఏమంటివి?

కైక - మీ వంశమునకు గతి తప్పని సూర్యుఁడు మూలపురుషుఁడు. మీ వంశము లోనివాఁడే నా సత్యహరిశ్చంద్రుఁడు? ఒక్క యసత్యమాడలేక) సర్వరాజ్యమును బరిత్యజించుకొని, భార్యాపుత్రులనమ్ముకొని, తన్ను జండాలునకు విక్రయించుకొని, పుత్రమరణమును లక్ష్యపెట్టక భార్యను దనచేతిమీదఁ ఖండించుటకు సిద్ధపడిన యా మహనీయుఁడైన మహాచక్రవర్తి. యా సత్యమూర్తి, యెక్కిన సింహాసనము పైనే గదా నీవు-సర్వదా చంచలుండవైన నీవు-ఇదిగో యని చేయిచాఁపి యాసచే నవ్వాలి వాఁడు గ్రహింపబోయినచోఁ జేయిముడుచుకొని మోసకాఁడవైన నీవు—నోటి తుంపర లెంతలఘువులో ప్రమాణము లంతలఘువులుగఁ జేసిననీవు అధిష్టించి, పరిపాలించుచుంటివి? దేనిని? అసత్యమును. అసత్యమును అహో! ఈసింహాసనమున కగౌరవము కాదా? ఈవంశమున కప్రతిష్ఠ కాదా! దేహమును గోసియిచ్చిన శిబిచక్రవర్తి మీ పూర్వుఁడు కాఁడా? కన్నులే యూడబెఱికి, యొక బ్రాహ్మణునికి దానమిచ్చిన యలర్కుని సత్యవాక్యపరిపాలన మహాసాహసము నీ రక్తమున బ్రవహింపవలదా? ఇట్టి పూర్వులందఱు తమవంశమునఁ బుట్టిన సత్యభీరువైన నిన్నుఁ గాంచి సిగ్గుపడరా? సత్యపరిపాలనమునకై భార్యనొకనికి దానమిచ్చిన మొన్న మొన్నటి రఘుమహారాజు - కాదు - కాదు, అడుగువాఁడున్న యెడల నీ పిశాచమునుండి విడుదలకాఁ దలఁచి యామాత్రపుఁ బనిని నీవును జేయగలవు కాబోలు.

దశ - (తల వంచుకొని) హరిహరీ! హరిహరీ!

కైక - ఆ హరియే వామనుఁడై యాచింప బలిచక్రవర్తి సత్యసంరక్షాదక్షుఁడై యిప్పటివఱకనంతకీర్తిని బొందుచున్నాఁడు. రాక్షసాగ్రగణ్యులకైన నీతిగాని యీ అసత్యపథము నీ కేల? శాశ్వతమైన సత్యమును గాపాడుకొని కీర్తినొందుము. రాముడున్న నేమి యూడిన నేమి?

దశ - (చెవులుమూసికొని) నారాయణ నారాయణ—(ఏడ్చును.)

కైక - కొట్టలేక తిట్లు, ఇయ్యలేక యేడుపు సహజమేకదా,

దశ - అయ్యయో - రాముడున్న నేమి లేకున్న నేమి యనుచుంటివా! ఎంత మాటాడితివి.

గీ.॥ జగ మనంతుఁడు లేక నిల్వఁగనుగలదు
గాలి లేక జీవులు బ్రతుకంగవచ్చుఁ
గాని రాముని విడచి యీ కట్టె యొక్క
గడియయైన నిల్వఁబడదు, పడదు, పడదు.

కైక — రాజేంద్రా నీకు బ్రాణాపాయకర మని నీ విప్పుడు విచారింపఁదగదు. రాముని కి జీవనోపద్రవము రాకుండ నీ వాతనిని గాపాడుకొను మార్గమొకటి జూచు కొనుము.

దశ — ఆమార్గ మెద్దియో నీ నేత్రాగ్రమున నున్నది, నీ జిహ్వాగ్రమున నున్నది.

కైక — అటులైన జెప్పెదవినుము.

దశ — కైకేయీ, నీకు బ్రొక్కెదను, ఓ పుణ్యాత్మురాలా.

గీ. రామభరతులు గన్న పుత్త్రకులు నీకుఁ
గోసలాత్మజ లేదనుకొనుము కొల్పు
కొంటికిని జూఁచినాఁడ నన్ గరుణఁ జూచి
పడఁతి సెల విమ్ము రాముని బ్రదుకు తెరవు.

కైక — రాముని నెత్తిగొట్టి భయంకరప్రమాణమును నీవు చేసితివా ?

దశ — చేసితిని బుద్ధిలేక.

కైక — అవలంబింపవలసినవి రెండును గష్టమార్గములే. వానిలో నొకటి రెండవ దానికంటె మంచిది. ఏ మార్గమవలంబింతువు ?

దశ — చెప్పుట కేమున్నది.

గీ. మంటఁ బడుటకంటె ముంటిమార్గము మేలు
శత్రుబాధ మేలు పిశాచికంటెఁ
జావుకంటెఁ గష్టచయమె సౌఖ్య, మచటి
చావుకంటె నిచటిచావుమేలు,

కైక — సెబాస్, చావుకంటె గష్టచయము సౌఖ్యముగదా. రాముని మరణముకంటె వనవాసమే శ్రేయముకాదా ? నీ కచటి చావుకంటె నిచటి మరణమే మేలు కాదా ?

దశ — (వడకుచు) రామునికి మరణ మేమి ?

కైక — నీవు నోరారా నుచ్చరించిన ప్రమాణమే ఫలించు నెడల నంత జరుగకపోవునా ? నా వరముల నీయనియెడల నీ ప్రమాణము ఫలించునుగాని, రాముడు బ్రదుక దలచినయెడల నీ వాతని వనవాసమున కంగీకరింపక తప్పదు. అతని బ్రతుకు తెరవు నీలోనే యున్నది. అదిగాక "అచటి చావుకంటె నిచటిచావు మేలు" అని చెప్పితివి. అసత్యమాడి యాత్మ ననంతపాపభూయిష్టముజేసి శాశ్వతనుగతి త్యాగ మొందుకంటె నీ కిచటి తనుత్యాగమే మేలు. ఐనను నాగళసూత్రపాటవమున నీ యాపదయును రానేరదు. కావున రాముని యరణ్యవాసమున కంపకతీరదు.

దశ — అయ్యో, ఇదియేనా రామునికి నీవు చూపిన బ్రదుకుదెరువు ? రామ భద్రునిపై నింత యాగ్రహమేల ?

సీ. అపరాధ మొనరించు నతినీచసేవకు
రాం. ౫ — నైనఁ బల్లెత్తుమా టననివాఁడు
భరతునికంటె నీ పరిచారికలకంటె
భక్తి నీచరణముల్ పట్టువాఁడు
తన మూలమునను నెవ్వని కేమివచ్చునో
యని భీతి గడగడ లాడువాఁడు
దోషదూరుఁడె కాక దోషసందేహదూ
రుండై మనలఁ గొల్చుచుండువాఁడు

గీ. నట్టిసత్యగుణారాముఁ డైనరాము
వనములోఁ ద్రోయు మని యెట్లు పలికితీవు!
పలికితివొ! యాజ్ఞముగ్గినపండు నేను
చేతులాఱఁగ వానిఁ ద్యజించు టెటులు?]

కైక — త్యజించు టెట్టులని పెద్దయాలోచన యెందులకు? పదునాలుగు వత్సరములు నీవు దండకారణ్యమున వసించుట మాయాజ్ఞయని యీ రెండుమాటలు నీ వాతనితో బలుకలేవా? ఇంత త్రొక్కులాడెదవేల? నీయాజ్ఞ నతఁడు శిరమున బూనువాఁడుకదా?

దశ — అయ్యయ్యో, అయ్యయ్యో, వాఁ డట్టివాఁడే. వాడు నామాట యెన్నడును జవదాటడు. అడవికిఁ బో పో, యని యీ రెండుమాట లనలేవా యని పలుకుచుంటివా? ఎంతమాటాడితివి?

గీ. రామ! రా! రాఘవా! రార! రామభద్ర?
రా! రఘువర! రా! యంచు నో రాఱఁ బలికి
కాఁడడవి కిప్పు డీవు నిష్కారణముగఁ
బోర యనుటకు నెట్లు నా నోరువచ్చు!

కైకేయీ, పొమ్మనుసరికిఁ బోవు వినయస్వభావముగలవాఁ డగుటచేత నేనా పొమ్మనవలసినది? అంతకంటె పాపమేమైన నున్నదా?

కైక — కారణమునుగుఱించి చర్చయెందులకు? నీవు తండ్రివి? సర్వాధికారివి

దశ — హారిహారి, తండ్రి నైనంతుల కిదేనా చేయవలసినది?

సీ. రార తండ్రి! యంచు బారగౌఁగిటఁ జేర్చి
మోహాన మఱి మఱి ముద్దుగొనుటా?
కొడుకుఁ గోడలు చిల్కగోరంకవలెఁ గాపు
రం బుండి రనుచు ముదంబు గనుటా?

రాష్ట్రపాలనమున వగడు చేరఁగఁ గొంత
బరువు ముందుగఁ దలపైన నిడుటొ ?
ముసలివాడ నరణ్యమున కేగవలె. నేలు
మని సింహాపీఠి నాతనిని నిడుటొ ?

గీ. చావనున్నట్టి యేను రాష్ట్రమున నిలిచి
రాజు గాఁదగు రాము నరణ్యమునకుఁ
బంచు దిక్కుమాలిన మందభాగ్యుఁడైన
తండ్రి చండాలు ననుఁ జేయ దగునె నీకు ?

కైకేయీ, శ్రీరామచంద్రమూర్తి కీఘోరవనపరివాసమున కేమి కారణమో చెప్పవా ?

కైక – కారణము నీకుఁ దెలిసియుండియే నన్నడిగెద వేల ?

దశ – అయ్యో, నే నెరుగుదునా ?

కైక – నీ విచ్చెదనను వాగ్దానముపై నేను కోరుటయే కారణము తెలిసినదా ? వనవాస కారణ మేదో రాము డడిగినయెడల నే నాతనికి జెప్పెదనులెమ్ము.

దశ – అయ్యయో, వాడు నాయాజ్ఞ కెన్నడైన గారణ మడిగినాడా ? ఇప్పుడు మాత్ర మడుగునా, రాఘవా,

సీ. రాష్ట్రమందలి జనరాజికోరిక లేవొ
తెలిసి వేగమ వానిఁ దీర్తు వీవు
తల్లులకే వస్తుతతి ప్రీతియో వారి
చెలులచేఁ దెలిసి యిచ్చెదవు నీవు
తీర్థ పాదులకేది తేవలెనో యది
శిష్యుల నెఱిఁగి కూర్చెదవు నీవు
నావెూము దిలకించి యేమి కోరితి నేను
వేగ దానిని సమర్పింతువట్టి

గీ. యీవు నాయాజ్ఞకును హేతు వేల యడుగు
దువుర నాతండ్రి ! నీవు ముందుముందైన
వినయసంపన్నుఁడవైన నీవును, మతేను
ను బ్రతుకుదు మీమహామారినోటఁ బడక.

కైక - ఈ యిక్ష్వాకువంశమున నసత్యపరాయణుఁడ వగు నీ వొక్కఁడవు జన్మించినందులకే పితృదేవత లుద్ధతులాడి యేడువవలసి యుండఁగ, నీకొడుకుఁగూడ నీచాయవాఁడు కాఁడయ్యెనని విచారించుచుంటివా? "రాజేంద్రా చాలు చాలు! కారణముతో నీకును రామునకునుగూడఁ బనిలేదు. ఇఁక మరెవరికి? తెల్లవారవచ్చుచున్నదేమో! శీఘ్రముగ స్థిరపఱచుము. నీకొడుకు వనవాసప్రయాణ ముహూర్తము సమీపించుచున్నది.

దశ — అయ్యో! నాకొడుకు పట్టాభిషేకముహూర్తమనుము.

కైక — అలాగే! నాకొడుకు పట్టాభిషేకముహూర్తము.

దశ — ఛీ! భరతపట్టాభిషేకమున కిప్పు డేమి కారణము?

కైక — రామవనవాసమే కారణము, కాని రామునకుఁ బట్టాభిషేకమును జేయ నీవేల సంకల్పించుకొంటివి?

దశ - రాఘవుఁడు శౌర్యమున, గుణగణమున, వయస్సున జ్యేష్ఠుఁడు కావున-

కైక - ఈ పక్షపాతమే నిన్నింతమట్టునకుఁ దెచ్చినది. భరతునకంటె రాముని విశేష మేమి?

దశ - కైకేయీ! వృద్ధునకుఁ గనిష్ఠభార్యయందును జ్యేష్ఠపుత్త్రునందు నపరిమిత మమకారము సహజమేకదా! ఇది నాయొక్క తలనే పుట్టెనా?

కైక - భరతునికంటె రాముఁడుమాత్ర మేమంత జ్యేష్ఠుఁడు? అందరును గూడ యజ్ఞపురుషదత్తపాయసప్రభావమున నొక్కసారియే గర్భములఁ బడిరి కాదా?

దశ - ఏమో! ఆమాట మన కేమి తెలియును? కాని ముందుజన్మించినవాఁడు రాఘవుఁడే కద!

కైక - ముందుజన్మించుటయే ప్రాశస్త్యమునకు హేతువా? దానవగణము దేవగణముకంటె ముందుద్భవింపలేదా?

దశ - ఛీ! ఛీ! తులువా! శుద్ధసత్త్వగుణస్ఫూర్తియైన శ్రీరామమూర్తిని రాక్షసునితోఁ బోల్చుచుంటివా? హా! ఎంతదారుణాలాప మాడితివి! సంతతమందహాసపూర్వక మృదుమధురగంభీరభాషణ రాక్షసగుణమా? సకలాంగసుందరదివ్యమంగళమూర్తిత్వము రాక్షసాకారమా? గాధేయసవనరక్షాధురీణత రాక్షసకృత్యమా? ఛీ! ఒడలెఱుఁగక వదరెదవా? శిష్టరక్షణార్థమై దుష్టశిక్షణార్థమై యవతరించిన మహాపురుషుఁడని మునులవలన మనము వినుచు నాతని నిట్టిమాటలాడెదవా? నోరు ముచ్చ రింపఁ దగిన తిట్లైన నన్నుఁదిట్టుము. నేను సహింతును, కాని—

కైక — ఒకరిని దిట్టవలసిన యావశ్యకత నా కేమి? ఇయ్యలేక నీవే నన్ను నోటికివచ్చినట్లెల్లఁ దిట్టుచున్నావు. యథార్థముగ నాకు గావలసినది—ఇదిగో తీసికొమ్మని నీవు నాచేతఁబెట్టినది—నా కిప్పటి కావశ్యకములేక నీయొద్ద దాఁచుకొనినది— అట్టి వరరూప మగు ద్రవ్యము—నే నిప్పుడు సంగ్రహింపఁదలఁచితిని—దైన్యమున బ్రార్థింపవలసి యుండఁగా—ఈ కోపము—ఈ మాటలు— ఈ రోదనములు—ఈ గుఱ్ఱిద్దులాటలు; అహా! అహా! రఘువంశమునఁబుట్టిన సత్యవ్రత

తారమపగు నీకే చెల్లినది! ఆసురయుద్ధమున మూర్ఛబడి ప్రాణావశిష్టుఁడవై అరదముపై నీవొరగఁ బ్రళయకాలాభీలానలజ్వాలలవలె శత్రుబాణపరంపరాకీలలు చుట్టిముట్టి భగ్నమనఁ జుండ ఇక నొక్క బాణముతో నీప్రాణ మట్టె యెగిరిపోవుటకు సిద్ధమై యుండఁగ ఆడుదాననయ్యును అవిదితాహవవిద్యనయ్యును పత్యభిమానముచే స్వప్రాణముకంటె, బతిప్రాణమే హెచ్చనినమ్మి, దైవముఖమునఁ జూచి నీ పేరును నీ ప్రతిష్ఠను, నీప్రాణమును, నీవంశమును, రాష్ట్రమును గాపాడిన మహోపకారమునకుఁ బ్రత్యుపకారమేకదా యీతిట్లు! కాని కానీ! ఇక నెంతకాలము తిట్టెదవు? భరతుని పట్టాభిషేకమునకే దిట్టెదవా? ఆపైనఁగూడఁ దిట్టెదవా?

దశ — భరతపట్టాభిషేక మనుమాటఁ దలపెట్టుట తెలిసినదా?

కైక — నేను నీ కప్పు డిచ్చినరాష్ట్రమును నాకొడుకున కిప్పు డేల నీ వీయఁ గూడదు?

దశ — వీలులేదు.

కైక — ఎందుచేత?

దశ — వంశాచారవిరుద్ధ మగుటచేత.

కైక — అఱువదివేలయేండ్లు పరిపాలించుట వంశాచారమా! అనేకకళత్ర భార్యాత్వమనూచానమా? అసత్య మాడుట యన్వయమర్యాదేనా? అన్నిటితో పాటే భరతపట్టాభిషేకము గూడను. ఏమంత విశ్చలముగఁ జూచెదవు?

దశ — కైకేయీ! నాప్రాణరక్షణము చేసి రాష్ట్రము నీవే యొసంగితివి, తిరిగి నేను నీ కీరాజ్యము నిచ్చెదను. నీచేతిమీఁదుగా రాముని కిమ్ము లేదా నీవు దానిని భరతుని కొసంగి వానికరములమీఁదుగా దానిని రామునికి సమర్పింపఁ జేయుము.

కైక — ఏలాగైన రామునిపట్టఁ గట్టింపవలెను రాజేంద్రా! ఏటిమాటలు, బొల్లిబొల్లి నైచ్యములచే నన్ను సంతోషపెట్టఁ దలఁచుచుంటివా? "నీవేలు నాయనా!" అని రాజ్యమును నేను రామునికి సమర్పింపనా? ఆఁ! "రాజ్యమో రాజ్యమో" అని యేడుచుచున్న భరతునిచేతఁ బడినరాష్ట్రమును పప్పుబెల్లము లతనిచేతఁ బెట్టి మఱపించి బుజ్జగించి, రామునికి గట్టింపనా? ఆఁ.

దశ — భరతుఁడు రాజ్యముకొఱ కేడ్చుచున్నాఁడా? ఛీ! ఛీ! ఈయేడుపంత నీదే! నాగొంతు గోయుటకు నీవీతంత్రము పన్నినావు. నాకంటె రామునియందు భరతునికి భక్తి హెచ్చు. అట్టివాఁడు రాముని వనవాసమున కంపి తాను పట్టాభిషిక్తుఁడగుట కంగీకరించునా? అసత్యము.

కైక — సర్వసద్గుణసంపన్నుఁడైన యిర్వదినాలుగేండ్ల రాజపుత్రునకు రాజ్యమేల వాంఛయుండదు? మహారాజమాతనై సపత్నులతోఁగూడ నందఱిచేతను బరిచర్య చేయించుకొనవలెనని నా కుండదా? సాపత్న్యసోదరు లెక్కడ! ప్రేమ లెక్కడ! రాష్ట్రములొసఁగుట యెక్కడ? కృతయుగపుమాటలఁ జెప్పుచుంటివి?

దశ — ఛీ! దుర్మార్గురాలా! ఆ దుర్మార్గుఁడును నీవు నేకీభవించి రాముని నన్నుఁ జంపఁదలఁచితిరా? చెడ్డదాగి యజ్ఞోపవీతమును ద్రెంచి పాఱవైచిన బాపన

పండువలె నీ వలలోఁ జిక్కి నా యీదుర్గతికిఁ గారణమగు రాముని విడనాడుకొందు ననుకొంటివా? నీ వింతయఘమాఘములాలవని నే నెఱుఁగను, అగ్నిసాక్షిగఁ గ్రహించిన నీపాణి ద్యజియించుచున్నాను. భరతుడు నాకొడుకు కాడు. నేను చచ్చిన వెనుక నీవు నాకు ధర్మోదకము లీయవలదు. భరతుడు నాకు శ్రాద్ధక్రియను జేయ వలదు పో! పో!

కైక – సరే! నేను పోవుటకు సర్వసిద్ధముగనే యున్నాను. నీయసత్యపిశాచమునకు నాప్రాణముల నిప్పుడే నీయెదుట బలియిచ్చుచున్నాను. ఇదుగో తలబగుల గొట్టుకొందును. (తల నేల గొట్టుకొనబోవును)

దశ – (పట్టుకొని) ఆఁ! ఆఁ!

కైక – నన్నాపకుము. నేఁడు చావక మానను. నా రక్తముతో రామాభిషేకింపుము. నీవు విపరీతసత్యవాదివే కాక, ధర్మపత్నిని జేతులార వధించిన పరమధార్మికుఁడవని లోకమున కిప్పుడే వెల్లడి కాక తప్పదు. వదలు వదలు.

దశ – కైకేయీ! నీకింత సాహస మెందులకు? నీప్రాణములేల పోగొట్టుకొన వలయును?

కైక – ఏమి? ఏల పోగొట్టుకొనవలెనో నీ వెఱుఁగవా? నేను చచ్చినయెడల సైలవచ్చుననియు, సందువలన రామపట్టాభిషేక మహోత్సవ మాగిపోవుననియుం నీ వాందోళనపడి నన్ను నిరోధించుచుంటివా? నీకట్టిసందేహ మక్కఱలేదు. రామపట్టాభిషేక మాగదు. అగ్నిపురోభాగమున నీకును నాకును గలిగిన సంబంధము, నీ విప్పుడు త్యజించుకొంటివి కదా!

దశ — హరిహరీ! ఎంత పాపము తటస్థించెను హా భగవంతుఁడా! ఇన్ని సంవత్సరము లనుకూలముగఁ గడిపి యీ యొక్క రాత్రి గడుపలేకపోయితివా? కైకేయీ! చూడు, ఒక్కమాట.

కైక – ఒకమాట కాదు రెండుమాటలు. రామవనవాసము; భరతపట్టాభిషేకము

దశ – నారాయణ! నారాయణ! (ఏడ్చును) కైకేయీ! వసిష్ఠాదుల కడుపును, గాళ్లు, బట్టుకొని యెటులైన భరత – పట్టాభిషేకమునకు – అయోధ్యా – అంగీకరింపజేసినచో రామవనవాసవరము వదలుకొందువా?

కైక – రాముఁ డరణ్యమునకుఁ బోయినపుడే కదా భరతుని పట్టాభిషేకార్హత? కావున – మొట్టమొదట – అనఁగ – రేపు – రామవనవాసము తప్పదు.

దశ – (ఏడ్చుచు) తప్పదా! తప్పదా! రామ! రామ! రామా! (మూర్ఛిల్లును)

కైక – (నవ్వుచు తనలో) ఈమహారాజు మూర్ఛనొందినాఁడు. అబ్బ నా[illegible] ముకలు కటకట కొఱికినాఁడు. ఇప్పటికి నాప్రయత్నము పాకమునకు వచ్చినట్లున్నది. ఎవరిదో కాలిచప్పుడు వినుచున్నది. ఎవ రక్కడ?

(నేపథ్యమున) నేను సుమంత్రుఁడను. మహారాజుగారిని దర్శింపవచ్చితి నమ్మా.

కైక—(తనలో) సమయమునకే వచ్చినాడు. (ప్రకాశముగ) చిరకాలసేవకుఁడ వైన నీకు సందేహమేల? లోనికి రమ్ము. నాథా! సుమంత్రుఁడు వచ్చినాడు.
(సుమంత్రుఁడు ప్రవేశించును.)

దశ—(కన్నులువిప్పి చూచును.)

సు—మహారాజేంద్రా! తెల్లవారవచ్చుచున్నది. పట్టాభిషేక సంభారములు సర్వమును సమకూర్పఁబడినవి. సభాశాలకు వసిష్ఠాదులు వచ్చినారు. మీరిఁక నాలసింప గూడదు. వేగమె దయచేయవలసినదని వసిష్ఠభగవానుని యానతి—

దశ—రామ రామ రామా! (లోలోపల నేడ్చును.)

సు—అమ్మా! మహారాజుగారి నేత్రము లెఱ్ఱగనున్న వేమి?

కైక—ఆనందబాష్పములు విడుచుటచేత – రేపు పట్టాభిషేకము కాదా?

దశ – (తనలో) నారాయణ నారాయణ

సు – అమ్మా! తెల్లవాఱవచ్చుచున్న నింక రాజుగారు నిదురబోవువానివలె నున్నా రేమి?

కైక – చెప్పలేదా? అమితసంతోషమున నిప్పటివఱకు నిద్దురయే లేదు, ఇప్పుడిప్పుడే కొంచెము కన్నులు మోడ్చినారు.

దశ – (ఉస్సురనుచుఁ దనలో నేడ్చును) రామ! రామ! రామా!

సు – అమ్మా! క్షమింపుము. మహారాజుగారేమో బాధనొందువానివలె నున్నారేమి?

కైక – వెఱ్ఱివాఁడా! అమితసంతోషమునకు నమితదుఃఖమునకుఁ బర్యవసాన మస్వస్థతయే కద! చూడు! నీవు వెంటనేపోయి రాము నిటకుఁ దీసికొనిరమ్ము.

సు – చిత్తము (సందేహించును.)

కైక – ఏమి! సంకోచించుచున్నావు!

సు – (చేతులు జోడించుకొని). అమ్మా! క్షమింపుము. మహారాజుగారి యాజ్ఞ కూడ నైనయెడలఁ దీసికొనివత్తును.

దశ – సుమంత్రా! రామచంద్రు నొకసారి నా కన్నులయెదుటఁ బెట్టుము.

సు – చిత్తము. (నిష్క్రమించును.)

దశ – (తనలో, చేతులు జోడించుకొని) రామా! రఘువంశాబ్ధిసోమా!

గీ. రాఘవా! వనమున కేగరా యటన్నఁ
బూర్ణచంద్రుని బోలు నీ ముద్దుమొగము
వాడుబాఱఁగ నాకను ల్వాడిపోవ
వినయగుణసాంద్ర! యెట్లు చూతునుర తండ్రి!

గీ. మూడుకాళ్ల ముదుసలి మొదలు పాలు
క్రోలు పసిబిడ్డదనుక నిన్నోర్చెలుఘనుఁడుఁ

కలుగఁ డని జయవిజయధ్వానులను బలుక
నే మనుచు నేను గానఁ ద్యజింతు నిన్ను?

గీ. గువ్వపిట్టల చందానఁ గులికి కులికి
చిన్న కాపురమును జేయు సీత నిన్ను
గాఢవనసీమలోని నక్కల యెదానఁ
బులులవాతను నెట్లు దాపుఁదుర తండ్రి?

ఓ సూర్యభగవానుఁడా !

గీ. వనితకై రేపు రాముని వనికిఁ ద్రోచి
నీకులము రూపుమాపక నాకుఁ దీర
దయ్య! చిరసమాగతభవదన్వయమును
రక్షణముఁ జేసికొనఁ బైకి రాకుమయ్య

హా రామ! రామా! (బిగ్గరగ నరచి నేల వ్రాయును.)

రామ - (ప్రవేశించుచు) నాన్నగారూ! వచ్చుచున్నాను. తండ్రీ! నమస్కారము.

దశ - (అదరిపడి, తల పైకెత్తి, గద్గదస్వరమున) హా! రామచంద్రా! (నేల వ్రాలును.)

రామ - (అదరిపడి, రెండడుగులు వెనుకకు వైచి, తనలో) హా! ఏమిది! మా తండ్రిగారిట్టి విపరీతావస్థలో నుండుటకుఁ గారణ మేమి?

గీ. నాగళధ్వని యెవని వీణారవంబొ
నాదు ముఖబింబ మెవనిచంద్రప్రకాశ;
మట్టి నాతండ్రి నను వినఁడయ్యె! కానఁ
డేనొర్చిన పాతక మేది యగునో?

గీ. ప్రబలతమరాజ్య తంత్రనిర్వాహణసంభ్ర
మమున నున్నను రామనామంబు చెవిని
బడ నోడలు జల్లు మన నట్టి పాఱఁజూచు
ప్రభుఁ డెదుటి నన్నుఁ గనడు పారిరబ్ధ మేమొ?

(కైకేయివంకఁ దిరిగి) అమ్మా!

గీ. బుద్ధివచ్చినదాది యెప్పుడును నేను
తండ్రిగారికి గోపపాత్రమను గాను

నీ పదంబులఁ బట్టుదు గోపశాంతిఁ
బడయ జేయు మాతనికి నాపక్షమూని.

(పాదములబడును.)

కైక — రామభద్రా! నీ తండ్రిగారికి నీ పైఁ గోపమింతమాత్రమును లేదు.

రామ — అమ్మా! నిశ్చయమేకద! అటులైన నీ యస్వస్థతకు దేహపీడ కారణమగునా?

కైక - ఆయన కారోగ్యలోపమేమియు లేదు.

రామ — అమ్మా! చిరంజీవి తమ్ముఁడైన భరతుఁ డారోగ్యముగ నున్నట్లు వార్తలు వచ్చుచున్నవికదా!

కైక — ఆహా! అతనికి శత్రుఘ్ను నితోడఁ గుశలమే!

రామ — అమ్మా! భరతుఁడింక మనరాష్ట్రమేల పొందలేదు?

కైక — (తనలో) ఇదిగో! రేపు నీవు వనమునకు నడచినతరువాత — (ప్రకాశముగా) రాఘవా! మొన్న మొన్ననే మేనమామయింటికి బోయిన భరతుని కింతలో రావలసిన తొందర యేమున్నది?

రామ — అమ్మా! అటు లానతిచ్చుట న్యాయమా? తొందరయే లేదనుచున్నావా? రేపటి పట్టాభిషేకమునకు భరతుఁడు రాకపోవుటచేత నాకెంత విచారముగ నున్నది?

కైక — (తనలో) రేపటి పట్టాభిషేకము భరతునికే స్థిరపఱచితిని. నీకు విచారకరమగునట్లే జాగ్రత్తపెట్టితిని.

రామ - అమ్మా నాయనగారి యస్థిమితత కేమి కారణమో చెప్పవా?

కైక — ఇన్నిసారు లడిగితివి కానఁ జెప్పవలసి వచ్చినది. నీవే కారణము.

రామ — అయ్యయ్యో! నామూలముననే నాయనగారికి విచారమా! తండ్రిగారియెడల బుద్ధిపూర్వకముగ నేలోపమును జరిగించియుండలేదు; నాపాపవశమునఁ బ్రమాదికమేమి తటస్థించెను? అమ్మా! నా మనసు మిక్కిలి యాందోళనపడుచున్నది. నన్ను క్షమించి తెలిసినంతవరకు నా తప్పేమియో యానతీయవలయును.

కైక — ఇంతవఱకు నీ వేలోపమును జేసియుండవు కాని యిఁకముందు చేయుదువేమో యని యాతఁ డిబ్బందిపడుచున్నాడు.

రామ — అమ్మా! ఇంతకంటె విరుద్ధ మున్నదా? ఇంతవఱకు దప్పొనర్పనివాఁడ నిఁక ముందుమాత్రము బుద్ధిపూర్వకముగ నేల చేయుదును?

కైక — ఇంతవఱకుముందుదారి వేఱు ఇప్పటిదారి వేఱు. కొడుకులకు వయసు వృద్ధి యగుకొలఁది తండ్రులయెడల విధేయత క్షయించునుగదా! కొడుకులైననేమి? కోడండ్రైననేమి? హితములైన యాజ్ఞలనే శిరమున ధరింతురు. కొంచెము హితవులైనచో మూలఁగూరుచున్న ముసలివానికి మిట్టిపాటేల యని తిరస్కరింతురు.

రామ—(చెవులు మూసికొని) హరి హరీ ! ఎంత మాటాడితివి తల్లీ! నాస్వభావమును బాగుగ గుర్తెఱిఁగియుండియు నిటు లానతీయఁదగునా ?

గీ. తండ్రియానతి యైనచో దారుణాగ్ని
ఖండమున నైన నుఱికెదఁ జండతమ వి
విషంబు నైనను గ్రోలెద సంబురాశి
మధ్యమున నైనఁ బడుదు నమ్మా ! నిజంబు.

దశ—(తనలో) హాతండ్రీ! పుత్రఘాతకుఁడైన యీ నిర్భాగ్యుని కొఱ కెంత దారుణ ప్రతిజ్ఞను జేసితివిరా తండ్రీ !

కైక—సెబాస్ రామభద్రా ! ఈ మహారాజు నన్నుఁ బూర్వమున రెండు వరములఁ గోరుకొమ్మనిపలికినాఁడు. అప్పటికి యావశ్యకతలేక యిప్పుడు వాంఛించితిని. అవి నీకు బాధాకరము లగుటచే నాతఁ డిచ్చుటకు భయపడుచున్నాఁడు. నీ వేమందువోయని యాతఁడు నీతోఁ బలుకుటకు జంకుచున్నాడు. నాకుఁ జెప్పక తీరదు కావునఁ జెప్పెదను విందువా ?

రామ—పరమసంతోషకరముగ విందును.

కైక—తెల్లవాఱినది మొదలు పదునాలుగు సంవత్సరములు నీవు దండకారణ్యమున నివసింపవలయును. నీ పట్టాభిషేకమున కార్జింపబడిన వస్తుసామగ్రితో భరతునికి బట్టాభిషేకముఁ జేయవలయును.

దశ—(తనలో) హరి హరీ ! హరి హరీ !

రామ—అమ్మా ! అవశ్యమటులే జరుగుఁగాత. నాకీ రెండునమితానందకరములే.

దశ—(గుండెలుగొట్టుకొని, తనలో) రామ, రామ, రామా ! ఒప్పుకొంటివా తండ్రీ ! (మూర్ఛిల్లును.)

కైక—సరే ! నీవు తెల్లవారినతరువాతనే పోవలసినవాఁడవు కాన శీఘ్రము ప్రయత్నములో నుండదగును. పొమ్ము.

రామ—అమ్మా! కట్టుబట్టలతోఁ బోవుదానికిఁ బ్రయత్నమేమున్నది ?

కైక—కాదయ్యా ! ఈ యాభరణములను వస్త్రములనిట దిగవిడిచి నారలు ధరించి జటాధారివై కానకుఁ బోవలయును. వింటివా ?

రామ—(నవ్వుచు) నాకుఁ బ్రత్యక్షభగవంతుఁడైన నా తండ్రిని, నాయెడల నత్యంత ప్రేమాస్పదలగు మాతృదేవతలైన మిమ్ములను సర్వ రాష్ట్రమును బరిత్యజించి పోవునపుడమ్మా, ఈ వస్త్రముల నీ యాభరణములను మాత్రము విడువ లేనందునా ? జటావల్కలధారినగుట నాకు మఱింత సంతోషము.

రా యీ బైరాగివేషము .

గీ. ఉచితవేషంబునను మునిపరిచయపాద
పద్మపరిచర్య సేయంగ వాంఛ యుండె
నెంతకాలంబు నుండియో! యిప్పటి కది
అమ్మ! సమకూరెఁ బూర్వపుణ్యంబువలన.

కైక — సంతోషమే. నీవనవాసము స్థిరపడినది. కావున నింక భరతుని పట్టాభిషేకమును గురించి యొక్క మాటఁ జెప్పవలసియున్నది.

రామ — ఆనతిమ్ము.

కైక — ఈ మహారాజునకు నాపై మిగులఁ గోపముగ నున్నది. నీ వుదయముననే వెడలక తప్పదయ్యెను. లక్ష్మణుఁ డుద్ధతస్వభావుఁడు. భరత శత్రుఘ్నులు దూరముననున్నారు. వసిష్ఠసుమంత్రాదులు నన్ను లక్ష్యపెట్టరు. భరతుని వెంటనే యిచ్చటకుఁ బిలిపించి యభిషేకింపవలసినదని మీ తండ్రిగారితోను, వసిష్ఠాదులతోడను, జెప్పి మఱి పోవలయును.

రామ — నీయాజ్ఞానుసారముగ వారిఁ బ్రార్థింతును. అమ్మా నేనొక్క మనవిఁ జేసికొనవలయును. రా. ఎంతో భక్తి.

కైక — సరే చెప్పుము.

రామ — గీ. రామ! రాఘవ రఘురామ రార యంచు
నాదు పేరులె గీతాలఁగాఁ దవిల్చి
పాడుకొను కరుణాబ్ధి నాతోడ నేఁడు
పలుకఁడు ననుఁజూడఁడు నాదుపాప మేమి!

కైక — నీవింక శీఘ్రముగ వెడలలేదని యాతఁ డిబ్బంది పడుచున్నాడు. నీ వెంతశీఘ్రముగ వనమునకుఁ బోయిన నాతని డెంద మంత శీఘ్రముగ నిమ్మళమగును.

రామ — అమ్మా! మా అమ్మగారితోడను, వైదేహితోడ నొక్కమాటఁ జెప్పి యిప్పుడే వెడలిపోయెదను. ఒక్క మనవిఁ జేసికొందును కోపపడనని వర మీయవలయును.

కైక — త్వరగఁ జెప్పుము.

రామ — నాకుఁ దండ్రిగారియాజ్ఞ యొకటియు, నీయాజ్ఞ యొకటియు నా? నీచే బడఁదగినరాజ్యము భరతున కిచ్చి నీ వరణ్యమునకు బోవలసినదని నీయాజ్ఞయగు నెడల మనఃపూర్వకముగ నే నంగీకరింపక పోదునా? ఈ మాత్రపు స్వల్పకార్యమునకుఁ బూజ్యులు, వృద్ధులు, దైవసమానులైన తండ్రిగారి నిటుల బాధింప న్యాయమా?

కైక — ఏమి? నాకు నీతులు కఱపుచుంటివి? మేము పెద్దల మగుటచే మా సంసారము లెటులో కడతేర రానేవచ్చినది. నీవు పడుచువాఁడవు. పడుచు

పెండ్లామునకు భర్తవు. సీత నీతో వచ్చునెడలఁ జేయునది యరణ్యములో స్వతంత్ర సంసారము. నీ భార్యనిన్ను బాధింపకుండ, నిన్నేడిపింపకుండ జాగ్రత్తపెట్టుకొనిన జాలును కాని నీ వెందుల కింక నాలసించెదవు ?

రామ – అమ్మా, క్షమింపుము. పోవుచున్నాను.

(నేలబడియున్న తండ్రిచుట్టుఁ బ్రదక్షిణముఁజేసి యాతని రెండు పాదములను గనుల నుంచుకొని) తండ్రీ! నమస్కారము. పోయెదను.

(నిష్క్రమించును)

కైక – (పైన జిలుచుచు) నాథా! లెమ్ము! తిరిగి మూర్ఛాపరవశుఁడైనట్లున్నాఁడు. (విసరుచు) నాథా, నాథా. లెమ్ము. (కన్నులు తెఱచి లేచును.)

దశ – (కన్నులు చేతులతో మూసికొని) నారాయణ, నారాయణ.

(ఏడ్చుచు లేవఁబోయి పడును.)

ఎవఁడురా అక్కడ.

సేవ – (ప్రవేశించి) మహాప్రభూ!

దశ – సేవకా, నన్నుఁ బట్టుకొని కౌసల్యాంతఃపురమునకైన, నీలోపున మరణించినయెడలఁ గాటికైనఁ దీసికొనిపొమ్ము.

(సేవక సాహాయ్యమునఁ బోవును)

కైక – నేనీసంగతి మంథరతోఁ జెప్పుటకుఁ బోవలయును.

(నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.



పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## చతుర్థాంకము

ప్రదేశము:— శ్రీరామభవనము.

(ప్రవేశము:— భద్రుఁడు, కచుఁడను నిద్దఱు ద్వారరక్షకులు.)

భద్ర - కచా నీ నిద్ర కాలిపోను, లే తెల్లవాఱవచ్చిన నింక గునికిపాట్లేనా ? (వీఁపుపైఁ జఱచును.)

కచ - (కన్నులు నులుముకొనుచు) ఓస్సీ, అంబలిఁగాచినావఁటే ?

భద్ర - కన్నులు తెఱచిచూడు. ఇది నీ గుడిసెకాదు. నేను నీ భార్యనుగాను.

కచ - భద్రా, నీవా ? చూడు, బండికను పాకటి పారాకా పాకటి నిద్రకొ మంచి బింకమైన పట్లుసుమా.

భద్ర - ఇప్పుడైనను లేచి కత్తిఁ చేబట్టుకొని నిలువబడుము. ఈ రోజున రామభద్రుడు గాన—

కచ - ఛీ, ఛీ, రామభద్రుడేమిటి, కానయేమిటిరా, నీ మొగము.

భద్ర - రామభద్రుడుగాన నీ మాన ప్రాణములు దక్కినవి.

కచ - ఎందుచేత ?

భద్ర - నీవు నిద్రపోవుచుండఁగ నేకాదా కైకేయమ్మగారి యంతఃపురములో నుండివచ్చి కౌశల్యమ్మగారి యీ యంతఃపురములోని కిప్పుడే యాతఁడు వెళ్ళినాడు. నిన్నుఁ జూచి నవ్వుకొనుచు వెళ్ళినాఁడు.

కచ - రామభద్రుని జిన్నతనమున నే నెత్తుకొనినవాఁడను గావున నాపై నభిమానము.

భద్ర - రామభద్రుఁ డందఱియెడల దయాళుఁడే. కాని యెవరిమట్టుకువారు తమయందే మిక్కిలి యనుగ్రహమని యనుచుందురు. నీవాయన నేమి, లక్ష్మణుని మాత్ర మెత్తుకొనలేదా ? ఏదీ ; ఆయన నే నిన్ని నిద్రావస్థలోఁ జూచినయెడలఁ గత్తి దూసి మీఁద బడియుండఁడా ?

కచ - అతఁడగ్ని రాముడు. ఈతఁడు సీతారాముడు. నే నెఱుఁగనా ? కాని అమ్మయ్యో, అదేమి, లక్ష్మణుడు కత్తిచేతఁ బూని లోని తలుపులఁ దన్నుకొని యిటులు వచ్చుచున్నాఁడు. నన్ను శిక్షించుటకుఁ గాదుగద.

భద్రి - (నవ్వుచు) మహారాజుల కసూయి కలుగునంతవఱకే కాని కలిగిన యెడలఁ గన్నపుత్రికలనే శిక్షింతురు. అట్టిచో నీ నా లెక్కయేమి ? ఆ కోప స్వభావు నెదుట నిలువఁబడకుండ నిసుకగడియారమున్న యీ వంక నుందుమురా ?

కచ - నీవును దాఁగియుండవలయునా ? నీకు గూఁడ నాతోపాటుశిక్షయేల?

(నేపథ్యమున) సోదరా, సౌమిత్రీ, ఆఁగు ఆగు.

భద్రి - అటుచూడు, లక్ష్మణుని వారించుచు రామభద్రుడు కూడ వచ్చుచున్నాఁడు. ప్రక్క కొసరిలుదము రా. (నిష్క్రమింతురు)

(ఇది విష్కంభము)

ప్రదేశము:- కౌశల్యాంతఃపుర పురోభాగము

(ప్రవేశము:- రాముఁడు ధనుర్ధరుడై. కత్తిని జేతబూని లక్ష్మణుఁడు)

రామ - సోదరా, సౌమిత్రీ ఆగుఁ ఆగు. కర్మగతి కెవఁడేమి చేయఁగలడు.

ల - కర్మగతియనుమాట యసత్యము.

గీ. కర్మసూత్రము బలిమియొ? నాధర్మసూత్ర
మే బలిమొ? నన్ను విడుఁడు చూపింతునిపుడె;
దైవ పౌరుషగతులలో ద్రఢిమ కలది
యేదొ యను లోక సంశయ మిపుడె తీఱు.

రామ - సోదరా ప్రశాంతినొందుము. ఇప్పుడంతతొందర యేమి వచ్చినది.

ల - అగ్రజా ఇప్పటికి దొందరయే లేదనుచున్నారా ?

సీ. మత్సరంబున దుష్టమాదన కైకేయి
తలఁచినవాంఛ తొందరయె గాదె
భార్యాపరాధీన బాంచాలిముదుకఁడా
దటఁ దలయూఁపఁ దొందరయె కాదె
భరతుఁడు రాజౌను బదపద నీవు కా
నకని యాతఁ డనఁ తొందరయె కాదె
అదె బళీ యని వనీయాత్రాపరాయణ
తను మీర లుంట తొందరయె కాదె!

క. ఇంతకంటెను దొందర యేది గలుగు
నసువు లీమేన నుండఁ బట్టాభిషేక
భంగమును వినను, గనను, భంగకరుల
ఖరతరాస్మత్కరాసిచే నఱుకునాఁడు.

రామ — (చిరునగవుతో) తమ్ముఁడా లక్ష్మణా ;

గీ. ఏను నీకంటె పెద్దనుగాన భక్తి
నాయెడలఁ జూపినావు సంతసము నిండెఁ
గాని నాకంటెఁ బెద్దలౌ ఘనులయెడల
ద్విగుణభక్తిని నీవు చూపింపవలదె ?

గీ. మాత, తండ్రి, యన్నయు, సంభ్రమవశులమయి
తి మని పలికితి నీవు, కత్తిని వహించి
ముందు సర్వోత్త వెనుక నే మందలింపఁ
దమ్ముఁడా ! యిది శాంతవర్తనము నీకు?

(కౌగిలించును.)

ల — పెద్దలయెడల ఘనులయెడల నేను భక్తిని గనబరుపలేదని మీరు సెల విచ్చితిరి పరమకోపశీలురయ్యు, యత్యంతానూయాహేయస్వభావయగు భార్యవలలోఁ దగిలి, యైహికసుఖలోలుఁడై, మతిచెడి యుండుట పెద్దతనమునకు ఘనతకు లక్షణమా ? అంతతో నూరకుండక తననోటికి నీళ్ళొసగఁగల జ్యేష్ఠపుత్రులరై మహాను భావులరగు మిమ్ముల గానలపాలు చేసి యూరుపేరు లేని భరతుని సింహాసనముపై కెక్కించుట కంగీకరించుట పెద్దతనమునకు ఘనతకు లక్షణమా ?

రాము — తమ్ముఁడా ! శాంతింపుము.

గీ. సతి కవశుఁడౌట ఘనతకు సంజ్ఞకాదు
పెద్దకొడుకును నెత్తిపైఁ బెట్టుకొనుటె
గౌరవమునకు జిహ్నంబు గాదు, సత్య
మును వదలమికి ముఖ్యలాంఛనము సుమ్ము.

గీ. నన్నుఁ బ్రాణముగా నెన్నుకొన్న తండ్రి
నన్నుఁ బట్టభద్రునిఁ జేయనున్న తండ్రి
సత్యవాగ్రక్షకై తృణప్రాయము గాఁగ
విడుచు టెంతటిఘనతయో తలఁపరాదె ?

గీ. భరతపట్టాభిషేకోత్సవమున కాతఁ
డౌ ననుట నిత్యసత్యావనైకదీక్ష
చేతనేకాని స్త్రీలోలతాతరళిత
చిత్తసంతతమోహంబుచేతఁ గాదు.

లక్ష్మ—సత్యవాగ్లోలత యనుచున్నారా ? కాదు - కాదు.

గీ. అసుర యుద్ధము కలలో నెఱుంగనేము, పర
యుగ్మ మంతకంటె నసత్యమో మహాత్మ ?
సత్యమిషమున జనుల మోసంబు సేయు
మనల గొంతుఁగోయఁగఁ బన్ను మాయబుద్ధి

నిన్న నీసరికి సభాశాలలో మనతండ్రిచేసిన భవదీయపట్టాభిషేక ప్రశంస, వసిష్ఠాదుల కంతుదుమ్ముకొట్టుటకు జేసిన యింద్రజాలము, మీతో నీసంగతి ముచ్చటించుట మిమ్ము మోసపుచ్చుటకు జేసిన కనుకట్టు. ఈయుత్సవములు ఈమహాప్రయత్నములు జనుల వాక్స్తంభనమునకు జేసిన గారడి. చిన్నకొడుకు పట్టాభిషేకము. పెద్దకొడుకు వనవాస మను నీరెండు పనులు ప్రపంచమున నెన్నడైన జరిగియుండెనా ? భరతపట్టాభిషేక మొనరించుట మహారాజునకు కైకేయీప్రోద్బలముచేత నిష్టమే కాని యట్లుచేయుట లోకవిరుద్ధమగుటయేకాక, యిందుకొఱకు రామపట్టాభిషేక సన్నాహము నంచి యంతఃకరణముతో నొనరించునట్లు నటించి, యెన్నఁడో యిచ్చెనఁగని మిథ్యావరములను గల్పించి, సత్యవాక్యపరిపాలనచ్ఛలమునఁ జిరకాలమనోరథాధిరూఢమగు భరతపట్టాభిషేకమును మహారాజు స్థిరపఱచినాఁడు.

రామ...వెఱ్ఱివాఁడా! నాపైనుండుభక్తిచే నీకిట్టియసందర్భాభిప్రాయములు గలుగుచున్నవి. నకే నీవనినట్లుయయే స్థిరపఱుపుము. తండ్రిగారికి భరతపట్టాభిషేక మభిమతమే యైనయెడల నాకేల వనవాసముగూడ నాజ్ఞాపింపనేల ?

లక్ష్మ...నాయఁ గారణములు తెలియవు। (గుండెలుకొట్టుకొని) అమ్మా అమ్మ ఈ మహోపద్రవమును నేను సహింపను ఆర్యా! నన్ను వదలుము.

గీ. సవనభంజన మొనరించి స్త్రబాధఁ
జేయుతాటక నీవు హింసించినట్లు
తావకీనాభిషేకవిధ్వంసిని యగు
మనల బాధించు కైకను దునుముదునాఁడ

మిమ్మెవ్వ రడ్డంతరపెట్టుదురో చూచెదను నావెంట రండు. మిమ్మిపుడు సింహాసనముపైఁ గూరుచుండఁబెట్టెదను.

రా...(నవ్వుచు) తమ్ముడా లక్ష్మణా నీవు క్రోధపడవలదు. నాకు సింహాసన మక్కఱలేదు. శాంతి వహించి యాలోచించుకొనుము, తల్లిగారైన కైకేయి మనకేమియు నపకార మొనర్పలేదు,

సీ. పాపఫలాంత్రవైభవభావ మానక
పుణ్యకాలమునఁ బోవుచునియు

బహుజన పాలనభార మొందక సూత్కృ
 ముగ నొక్క పొట్ట నోముకొను మనియె
ధరణీ ప్రపాలనో త్తర మైన వ్రాతమా
 మునివృత్తి నిప్పుడే పూను మనియె
నెన్నటికైన నదే కాని యిది యుండ
 దదె వేగఁ జూచుకొమ్మంచుఁ బలికె

గీ. నట్టి కరుణార్ద్రచిత్త మైనట్టి తల్లి
ఋణ మెటులు తీర్చుకొందు నం చేను జింత
పడ నతికెద ననచు దీవించెద వీవు
తమ్ముడా! యిది కీర్తిసధంబె నీకు.

సీ. తండ్రియాజ్ఞనను దలఁ దాల్చి గోహత్యఁ గం
 డుఁడు చేసి యుద్ధతిఁ బడయలేదె?
పిత్రాజ్ఞ మీరక ధాత్రిఁ ద్రవ్వుచు సగ
 రజు లెల్ల సద్యశోరయము గనరె?
తండ్రి కానిమ్మనఁ దల్లిన దుంచిన
 పరశురాముఁడు మహాయోధుఁడు కాడె?
వసుధలోఁ బితృవాక్యపరిపాలనంబె యై
 త్యాగుల కెల్ల గంకణము గాదె?

గీ. ఏ వచించినవా రాచరించినట్టి
కష్టములు లేక బహుసుఖకర మతిసుల
భ మగు మునివృత్తిచే వాకు వమయుగీర్తి
యిట్టి రానుండ వనికిఁ బర్విడఁగవలదె!

లక్ష్మ—ఆర్యా! మీరింక వనప్రయాణమునకుఁ గృతసంపూర్ణ నిశ్చయులరై యున్నారు. కావున మీ దిశేషదుఃఖమును సహింపలేని నన్ను మీ వెంట రానిండు.

రామ—(నవ్వుచు) తమ్ముడా!

గీ. ధరణిలో సోదరులు ధనధాన్య భూవ
సతులలోఁ బాలునకురిబోర సహజమగును.
గాని నా వనవాసార్తిలోన భాగ
మి మ్మటంచును బలికితి వేల బేల?

లక్ష్మ—గీ. మనకుఁ దనువులు రెండైన జననమాది
కలిసియుండుచేత గతి యొక్కటియె యగును
కలము రెండైన మొనలను గలిగియున్నఁ
గడకు ఫల మైనవ్రాఁత యొక్కటియె కాదె.

రామ — సౌమిత్రీ!

సీ. ననుఁ బాసి మనతండ్రి మనలేఁడు కోసలా
త్మజ పతిహీన యాత్మజవిహీన
యగు దిక్కుమాలిన దగును మీ తల్లికిఁ
బుణ్యావశంబునఁ బుత్త్రియుగను
జనన మొందెను గాన ననయంబు నాతోడి
నీడవై తిరిగెడు నీవు నాను
మాఱుగా నా తల్లిఁ గూరిమి సేవింప
నే లేని కొఱఁత నిండింపఁ గలవు

గీ. ముగ్గ రమ్మలకు ముగ్గురు పుత్త్రులుండు
గర్భవాసంబులో భేది కానఁబడదు
ముగిరిలోపల జ్యేష్ఠుఁడౌ సుగుణసాంద్రు
భరతరాజేంద్రు సేవించి బ్రతుకుమయ్య.

లక్ష్మ—(కత్తి పారవైచి, చెవులు మూసికొని) హరిహరీ! ఎంతమాట వినవలసి వచ్చెను. రామచంద్రప్రభూ భరతుఁడు రాజేంద్రుఁడు! (రాముని రెండు పాదములఁ బట్టుకొని) మహాప్రభూ! యథావిధిగఁ జిక్కిన రాజ్యమును తృణప్రాయముగ విసర్జించి యెట్టి మనస్థైర్యమును గలిగియుంటివి.

రామ—(నవ్వుచు) తమ్ముఁడా ఇది యొక విశేషము కాదు.

గీ. తనస్వరూపము తా నెఱిఁగినయెడ, నగుఁ
దైహికాలోలతను దేవులాడఁ డెప్డు
డాటవస్తువుకై యేడ్చునట్టి బిడ్డఁ
డైన నద్దముఁ గని యేడ్పు మానుఁ గాదె?

గీ. సత్యవర్తనమునఁ బొందు మృత్యువైన
శక్రసామ్రాజ్యమునఁ కంటె శస్తతర మ
సత్యవర్తనమునఁ బొందు శకవిభవ
మైన దుర్మృతికంటె హేయంబు మనకు.

అదిగాక :—

గీ. పల్లమున వేగిరపడక, బండఁ బైన
నైచుకొనక, కాలెత్తికలఁ బడక, తనబ
రువు వెనుకకఁ గాఁదిమఱి జాగరూకతగను
పదము లిడి దిగు శకటవృషభమును బోలె,

గీ. అపజయంబునఁ బర్వోత్తునప్పుడైన
మనసు చెదరనీయక భటులఁ జెటు లిటులు
పోవనీక సక్రమరీతిఁ బోక నడపు
నతులితోత్తమ సేనాధిపతిని బోలె

గీ. జనుఁ డదృష్టముఁ బాసిన సమయమందు
సలజడిని బొంది కష్టబాధలను ద్విగుణ
ములుగ నొనరించుకొనక యోర్పును వహించ
వలె ననుచు జ్ఞానవాసిష్ఠపంక్తిగాదె ?

లక్ష్మణా! ఇదివరకే యాలస్యమైనది. శీఘ్రముగ నడవికి బోయెదనని యమ్మగారితో మాటనిచ్చినాను. ఇంకను మా యమ్మగారిని, వైదేహిని జూడనే లేదు. నీవు కోపముడిగి, విచారము వదలి, మాతాపితృలకు బరిచర్య సేయుచు సుఖముగనుండుము.

లక్ష్మ — (ఏడ్చుచు)

గీ. తల్లి నీవె గురుఁడ నీవే తండ్రి నీవె    ల. ని కం. రా వం. [illegible]
దైవమును నీవె సర్వంబు నీవె నాకు
నీదు పదసేవ తప్ప నా కేదివలదు.
కానఁ గానను వత్తు నీతోడ నేను.

రాము — తమ్ముఁడా వలదు.

లక్ష్మ:— గీ. రా వలదటంచుఁ బలుక కో రామచంద్ర !
నిన్ను విడనాడ జీవము ల్నిలువనయ్య
రామ రామా యటంచు నాప్రాణచయము
నిప్పుడె వహ్నిలోఁ బడి త్యజించువాఁడ

రామ — (కౌగిలించుకొని) అనుజా! చిన్నవాడ వగుటచే శ్రమ మొందలేదని కాని నిన్ను నేనుమాత్రము వదలియుందునా ?    రా. ల. [illegible]

గీ. ఇద్దఱము మున్న మునికొఱకేగి వనికి
నసురహరణం బొనర్చి కల్యాణ మంది
వచ్చినప్డు మునులకై వనికి నేగి
శ్రీయుతల మాచుఁ దిరిగి వచ్చెదముగాక.

గీ. అదె జనులరావ మదె వసిష్ఠాదిమునుల
వేదరవ మదె సామంతవిభుజనార
వంబు నీ వేగి యీయుత్సవముల నాఁపు
మమ్మ విన్నను గోపంబు నందునేమొ ?

నీవు త్వరగబోయి మాయమ్మగారిని దర్శింపవత్తునని చెప్పుము. నే నింతలో వైదేహితో రెండుమాటలాడివత్తును. నివోర్మిళి నోదార్చి యంగీకరింపజేసి మఱి రమ్ము.

లక్ష్మ — చిత్తము. (నిష్క్రమించును)

రామ — ఎవరక్కడ.

[నేపథ్యమున] చిత్తము.

రామ — జానకి యంతఃపురమునకు బోయి యేమిచేయుచున్నదో చూచి యొకసారి యిటువచ్చునేమో కనుగొనెదవా ?

(నేపథ్యమున) చిత్తము.

రామ— గీ. హరధనుర్భంగమాది పట్టాభిషేక
భంగపర్యంత మెన్నఁడు పదలియుండ
నట్టిజానకితో విరహంబు గలుగుఁ
గటగటా ! యెట్లు ననుఁ బాయఁగలదో వెలఁది ?

ఆహా ! విధిపంచవైఖరిఁ దలంచుకొనిన నవ్వురాకమానదు కదా !

గీ. లోక మెల్ల నాపట్టాభిషేక మిపుడు
జరుగనలెనన యత్నము ల్సలిపి జరుగు
ననుచు నెంచె నొక్కటైన నద్ది యిట్లు
పరిణమించునం చింతైన నెఱుఁగదయ్యె

గీ. జనులయత్నంబు లేపాటి శక్తిగలవొ
బుద్ధు లేపాటి ఘనములో బోవునమ్మ లైన
నెరుల నాడించునది యేదో, నా విచిత్రి
పట్టమును గాంచి తెలిసికోవలయు జనులు

గీ. వీఁపైఁబ్రాఁకు నద్ది పిపీలికయో, మ
శకమొ యెఱుఁగకఁ మనుజుఁడు సర్వవేత్త
నని దివికి భువికి ముడి పెట్టును వెనుకటి
పరికట్ల, మృతి కర్మసూత్రంబు వెక్కిరింప.

గీ. భువి కదలు, గ్రహాళి కదలు, భూత పంచ
క మయమంతయుఁ గదలును, గాల మటులె
చలనమే లేనిదే ప్రపంచంబు లేదు
జనుల గతులకు చలన మాశ్చర్య మేమి ?

గీ. ఐహికము లశాశ్వతములౌ ననుచు మనుజు
లంద ఱెఱిగిన యంశమే, యందఱెపుడు
మఱచు సంగతి యది యుండె; మఱువకుండ
నాచరించెడువాఁడు జ్ఞానాధికుండు.

గీ. ఘనతరంగాహతాంగంబుఁ గలిగి కరము
నెత్తి నది దాఁటు కరివోలె, నెన్ని యాప
దలు సుఖంబులు కదిపిన, విలసదూర్ధ్వ
దృష్టినస్ఖలితోన్నతు డుత్తరించు భవము.

(నేపథ్యమున) రామప్రభూ! సీతాదేవిగారు వచ్చుచున్నారు.
రామ — సరే నీవు చూచునరికి యామె యేమి చేయుచున్నది ?
(నేపథ్యమున) ఆభరణముల నుంచుకొనుచున్నారు.
రామ — సరే నీవు పో (కరుణగ నవ్వి)

గీ. నాతి భూతలలక్ష్మితో నన్నుఁజేరఁ
దలఁచుచున్నది కాఁబోలు, ధరణిలక్ష్మి
యటులు నన్నుఁ బాసె, గృహలక్ష్మియైన తాను
నిటులు నను వీడవలసెనం చెఱుఁగదహహా.

అదిగో వచ్చుచున్నది.

గీ. భూషితాంగియై నను దూరముననె కాంచి
కులుకు కలికికిఁ గటువార్తఁ బలికి యశువు
నోసఁగు టెటు ? తాండవించు మయూరిచెవులు
వారిదము పిడుగును బడవైచు కరణి.

(సీత ప్రవేశించును.)

సీత—ప్రాణనాథా! నమస్కారము. నన్ను క్షమింపవలయును. నేను వల దనుచుండఁగనే మా రెండవ యత్తగారు నన్నింత సాంప్రదముగ నలంకరించుచు చేత నామె మూలమున మిమ్ము నాలస్యముగఁ జేరవలసివచ్చెను. కాని ముహూర్తము కావచ్చినను రాజ్యలక్ష్మిఁ మిమ్ముఁ జేర నాలసించుచున్న దేల?

రామ—(నవ్వుచు) అది మీ మూడవ యత్తగారి మూలమున.

సీ—పరిహాసించుచుంటిరా? ముహూర్తము మార్చఁబడినదా యేమి? ఇంక నెంత వ్యవధి యున్నది.)

రామ—పదునాలుగు సంవత్సరములు.

సీత—(రాముని చేయి పట్టుకొని) పరిహాసమేల? సభాసీనులకుఁ బోవుదము రండు. ప్రాణనాథా! ఈ యలంకారమును పూర్వ మెన్నడైన మీరు గాంచినటులు జ్ఞప్తి యున్నదా?

రామ - (తనలో)

గీ. ఒక్కసారిగ విషవార్త నొందిపలుక
నలసతను బొందు నని తొట్రుపడుచుంటిఁ
గ్రమముగాఁ బల్క హాస్యవాక్యములటంచు
విశ్వసింపకయున్న దీ వెఱ్ఱిసీత.

గీ. ఏను నీవాఁడ నని పల్కు నెట్టిపరుల
నైన విడువని రాఘవుఁ డవనితనయ
బరమసాధ్వి యగా జానకీ భామతోడ
విడుతు నిన్నంచు నిపుడెట్లు పలుకువాఁడ.

(ప్రకాశముగా) జానకీ! నీ యలంకారము నుందెప్పుడో చూచినట్లు జ్ఞప్తి యున్నది కాని స్పష్టీకరింపలేకున్నాఁడను.

సీత - ఈ యాభరణము లన్నియు మా తండ్రిగారు నా వివాహమహోత్సవమున నప్పగింతవేళ నా కిచ్చినారు. ఈ చీరయుఁగూడ నప్పటిదే. పుట్టింటివారి వస్తువును ప్రీతిచేఁ బదునొకండేండ్లు దాఁటవచ్చినను దీనిని ప్రాణతుల్యముగ భద్రపఱచుకొను చున్నాను.

రామ - (ఊస్సురనుచు) ఆ యప్పగింతల సమయమే యిప్పుడు తిరిగి తటస్థించిన దని నేను విచారించుచుంటిని.

సీత - (కౌగిలించుకొని) ఆఁ! ఆఁ! తిరిగి నాయప్పగింతయేమి? ఆఁ జగదానంద మూర్తియైన శ్రీరామమూర్తికిఁగూడ విచారమా?

రామ — పూర్వము సురాసురయుద్ధమున మా తండ్రిగారికి మా పినతల్లిగారైన కైకేయి చేసిన యుపకారమున కాతఁడిచ్చిన రెండు వరముల నిప్పుడు మా పినతల్లి గారు వాంఛించిరి.

సీత — అవేవి ?

రామ — పదునాలుగు సంవత్సరములు నా వనవాసము. భరత పట్టాభిషేకము. వీనివలన నా కెంతమాత్రము విచారము లేదు. కాని —

సీత — "కాని" యనుచున్నారేమి ? అందులకు లేశమాత్రము విచారించి మీ పితృవాక్యపరిపాలన ధర్మాచరణమును కేవలము సహధర్మచారిణి నైన నేను ప్రతిబంధింతునా ? మహాప్రభూ ? ఎన్నఁడు లేనిది నన్నిట్లు సందేహించుచుంటి రేల ? ప్రాణప్రియా ! మీరు పితాజ్ఞానిర్వహణమునకుఁ గూర్చి వాగ్దానము చేసియే వచ్చితిరికద.

రామ — సీతాపతినైన నే నట్లు చేయకుందునా?

సీత — పరమసంతోషము.

రామ — ఆహా!

గీ. జ్ఞానమూర్తి జీవన్ముక్తుఁడైన జనక
విభునితపమున నావిర్భవించినట్టి
నీకు నిట్టి విరాగత నిర్మలతయు
సత్యదీక్షయుఁ గల్గు టాశ్చర్యమేమి ?

కాని, గుణగణముచేత, ముఖవైఖరిచే నీ తండ్రిగారిని బోలిన నీకదృష్ట మేల పట్టకుండెనో యనిమాత్రము చింతగ నున్నది.

సీత — (చిఱునగవుతో) నేనే మహాదృష్టవంతురాలను. పురుషుల కధికారాల్ప పదవీభేదములచే భాగ్యాభాగ్యములు రావచ్చును. ఇక స్త్రీలకో-పురుషుఁడు మహారాజైననేమి? భిక్షుకుఁడైననేమి ? ధీశాలియైననేమి ? మందుఁడైననేమి ? యశఃకాముఁడైననేమి? అపకీర్తిభాజనుఁడైననేమి? ప్రత్యక్షదైవమైన పతి నెడఁబాయకుంటయే మహాదృష్టము. భవదీయపాదారవింద నిరంతరపరిచర్య నాకు లభించియుండఁగ నాకు లోపమేమి ?

రామ — ఇదివఱకట్టులే జరిగెను. కాని, యింతటినుండి యట్టిభాగ్యము నీకును నాకును గూడ లేదు.

సీత — (తొందరతో) ఎందుచేత ! ఎందుచేత!

రామ — నాకు వనవాసయోగమగుటచేతను, నీకుఁ బురవాసయోగమగుటచేతను.

సీత — ప్రాణనాథా ! మీ మాటలవలన నవ్వు వచ్చుచున్నది ! భార్యకొక యోగము, భర్తకొక యోగమునా? ఒక కన్ను బాష్పములు విడిచి యొక కన్ను ప్రసన్నముగ నుండఁగలదా ? బండిచక్రములొకటి ముందునకు నొకటి వెనుకకుఁ బోగలదా ? జగదేకలబ్ధప్రతిష్ఠులైన మీ ధనుస్సున కొకకోటి వంగ రెండవకొన యెప్పుడైన వంగకుండునా? ప్రపంచమున నెన్నఁడులేని భర్తృభార్యాయోగ విభేదమును మీ రేల

సెలవీయవలెను? మహాప్రభూ! సేవకురాల నైన నాకుఁగూడ వనవాసయోగ మేల యనుగ్రహింపరాదు?

రామ—అందులకు మా తల్లిగారి యాజ్ఞ కాకపోవుటచేత—

సీత—నన్నుఁ దీసికొని పోఁగూడదని యామె సెల విచ్చిరా?

రామ—లేదు. కాని నిన్నుగూడఁ దీసికొని వెళ్ళుమని నా కాజ్ఞాపింపలేదు.

సీత - మంచిదే! ఈ మీ సవ్యచరణ మును మీతోఁ గూడఁ దీసికొని వెళ్లుమని మీ యమ్మగారు సెలవిచ్చిరా?

రామ - అందులకు సెల వేల కావలెను? అది లేకుండ నే నెటుల పోఁగలను?

సీత - ఈ సవ్యహస్తము మాటయో?

రామ - అదియు నటులే.

సీత - మీ యవయవములలో నల్పభాగమైనదానినైన విడిచి మీరు వెడల లేనిచో నర్ధభాగమునైన నన్నెట్లు విడిచిపోఁగలరు? మీ తల్లి మిమ్ముల సంపూర్ణముగ వనయాత్రకుఁ బొమ్మనగ నర్ధదేహముతో మాత్రి మేగి యధిక్షేపణ మొందఁదగునా?

రామ - (నవ్వుచు) నా దేహమున నిమిడిన భార్యారూపకార్ధము నే నెక్కడకుఁబోవ నక్కడకు వచ్చునదేకదా? ఇఁక ప్రత్యేకముగ నీవు చెప్పనేల?

సీత - తెలియ కటుల చెప్పినందులకు క్షమింపుఁడు కావున నేను మీ వెంట వత్తును.

రామ - వచ్చినట్లే యనుకొనుము.

సీత - అదియేమి! మహాప్రభూ! అటు లానతీయవలదు. మీ కష్టసుఖము లన్నిటిలోను నే నర్ధభాగమును గ్రహింపక తప్పదు.

రామ - జానకీ! నీవు నా సవ్యార్ధభాగమని చెప్పితిని. కాన నస్మదీయ కష్టసుఖార్ధభాగము నీకుఁ దప్ప నే తప్పదు.

గీ. కందమూలములహస్తయుగ్మమునఁ ద్రవ్వ
నాదుపాలున సగపాలు నీదె; యక్షి
గోచరం బైన వనచిత్రకోటివలని
మోదమున నర్ధభాగంబు ముదిత నీదె.

గీ. పాణియుగమున మునుల సేవలను జేయఁ
గలుగు సుకృతిలో నర్ధభాగంబు నీదె
దీని విల్లూది దీనిచే దిగిచి యసుర
వరులఁ జంపుకీర్తిని నర్ధఫలము నీదె

నీ విచ్చట నున్నను పత్న్యనుసర్ణఫలము నీకుఁ దప్పదు. ఇచ్చటనే యుండు మని నేను చెప్పుట కెందులకు సాహసించితినన—

గీ. రాష్ట్రజనపాలనము, బంధురాజసేవ
యాటవికమునిసేవయు ననెడు మూడు
పనులు కర్తవ్యములు భూపవరున కిలను
వెలఁది యుష్మన్మిత్రయము సేవవిధము గాఁగ.

ఆ కార్యత్రయమునఁ బిన్నవాఁడైన భరతునిపై రాష్ట్రపాలనభారము చేరెను. మిగిలిన రెండుపనులు నాకే చేయవలసె యుండెను. రెండును భగవత్ప్రీతికరములై రెండును సంసాగరతారణయోగ్యములైన పనులే—

గీ. కాననాంతస్థమునిసేవ నేను జేయ
నిటను బితృమాతృసేవకై యెవ్వరైన
వలదె? తపమునకై నరుఁ డడవి కేఁగ
గదల గృహదేవతార్చ కొకఁడుండవలెను.

కావున, వైదేహీ! నిన్ను నాతల్లిదండ్రుల సేవార్థ మిచ్చుట నుంచితిని. ఏమి! మాటలాడకుంటివి. (గడ్డము పట్టుకొని)

గీ. అఱుముగ్గి యిదిగో! యిదిగో! యనెడుతండ్రి
గారి యంతికాస్త్రకాలమునను
నీవె పెద్దకొడుకువై వారి కే లేని
లోటుఁ దీర్చుటకును బాటుపడుము.

గీ. తనపనికి వేగఁ బరితాప మెనయనున్న
కైకగారిని నతిభక్తి గారవింపు;
మప్రమాద చిత్తముకంటె నధికమధుర
మగును నాకు బశ్చాత్తప్త మైనమనసు

సీత— అత్తమామల సేవ యధికఫలప్రదమని నేను మాతండ్రిగారివలన బోధింపఁబడి యటు లాచరించుచునే యున్నాను. కాని, వారలసేవ నాకుఁబతిసేవ తరువాతననియును, పతి నెన్నఁడును విడిచియుండఁగలదనియును మాతండ్రిగారు నా కాజ్ఞాపించినారు (నవ్వుచు) పితృవాక్యపరిపాలనపుణ్యము మీరు కట్టుకొని నన్నేల కట్టుకొననీయరు? ఆపుణ్యముతోఁ బాటు నిరంతరకాంతసేవామహాసుకృతముకూడ నాకు కానున్నది. కావున, మహాప్రభూ! కాదనక నన్నుఁగటాక్షింపుఁడు. మా యత్తమామల పరిచర్యకు గుణవంతులైన ముగ్గురు కోడండ్రున్నారు. భక్తి ధురంధరులగు ముగ్గురు మఱఁదు లున్నారు.

రామ — శత్రుఘ్నుఁడు మిక్కిలి చిన్నవాఁడు. అతఁ డెందుల కసమర్థుఁడు; భరతుఁడు రాజ్యభారనిర్వహణముననే శోషిలి పరిచర్య నపేక్షించియుండువాఁడు. లక్ష్మణుఁడు నాతో వచ్చును. కావున నీ కీ వృద్ధసేవావిశేషము తప్పదు.

సీత — (కన్నులనీరు పెట్టుకొని) మీపాదసేవకు లక్ష్మణు నంగీకరించి నన్ను నిరాకరింతురా? దయాసత్యములు ధర్మము ననుసరించు నటుల మే మిద్దఱము మిమ్మెప్పుడు విడువక, మీ చరణదాస్యముచే మా జన్మములు పవిత్రములుగఁ జేసికొను చుంటిమిగదా? మీతో రానీయకుండుటకు నేను జేసిన పాప మేమి? మీ సేవకంటె నాకుఁ దారకమార్గము మఱియొక్కటి యున్నదా? లోకోద్ధరణార్థ మవతరించిన మహామూర్తులరని నారదాదులు మాతండ్రిగారితో బహువిధములఁ మిమ్ముఁ బ్రశంసించియుండ, నన్నీ దుఃఖమునుండి యేల యుద్ధరింపఁజాలరు. అడవినుండి కిరాతులు రాక్షసులు, క్రూరమృగములుకూడ మీపదానందరూపదర్శనమునఁ గృతార్థతను బొందనుండగ భార్యనైన నాకేనా యీ పాపదశ !

రామ — సీతా! నాకుఁ బితృాజ్ఞ యెట్లు లవిలంఘనీయమో నీకుఁ బత్యాజ్ఞ యట్టిదేకద.

సీత — (రాముని పాదములఁ బట్టుకొని) అట్టిదే! అంతకంటె నెక్కువదికూడను.

రామ — కావున, నీ విక్కడనే యుండుము.

సీత — (బిగ్గఱగా నేడ్చుచు) ఉండుదును. కులతనువు నిచ్చుట సేయఁజాలుదును. కాని ప్రాణనాథా! ప్రాణము లీతనువులో నుండునట్లు నే నెట్లు చేయఁగలను? దయామయా! అసాధ్యమైన పనిని జేయుమని నన్ను నిరోధించిన నేను జేయఁగలనా?

రామ — (సీతను దరిజేర్చుకొని) సీతా! నాకంటెఁ బతివ్రతజన్మనైన నిన్ను నాతో పాటుగ శ్రమ మొందఁజేయనొల్లక యిటు లంటిని విచారింపకుము. కాని,

గీ. వెట్టిరాముఁడు యువసతి స్వేచ్ఛలేక
భీకరపలాశసాంద్రాటవీప్రదేశ
మునకు నామెను గొనిపోయె, వెనుక నేమి
ముప్పు వచ్చునో యని జను లెన్నఁజుటింత్రు.

సీత — (నవ్వి) కుబేరుని భార్యకు దారిద్ర్యమా? సూర్యుని భార్యకుఁ జీఁకటి బాధయా? అటులే యఖండశౌర్యప్రతిష్ఠుఁడైన మహాధనుర్ధరుని భార్య కసురబాధ యెచ్చటిది? అట్టిశలభపు రక్కసుఁ డెవ్వఁడైన నట్టిద్రోహమునకు ప్రయత్నించి వచ్చో వాని వంశము నిర్మూలము కాదా?

రామ — అందుల కేమైన సందేహమా? కాని వైదేహీ! నీ ప్రయాణముగూడ నీకటఁ దప్పనిదే కాదా?

సీత — మీ కాశ్రితరక్షణముతో పాటు నాకుఁ బతిసేవతో పాటు.

రామ — అటులైన వేగరమ్ము. మాయమ్మగారియొద్దకుఁ బోయి సెలవుతీసికొని వెళ్లుదము రమ్ము. ఇది చతుర్థాంకము. (ఇద్దఱు నిష్క్రమింతురు)

# శ్రీ పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## పంచమాంకము

ప్రదేశము;— దశరథసభాశాలా పురోభాగము

[ప్రవేశము:- (ఏడ్చుచు) కౌసల్యయు, సీతారాములు]

కౌస - (గుండెలు కొట్టుకొని) నాయనా! నాతండ్రీ! నన్ను విడిచిపోవుదువా?

రామ - అమ్మా! విచారింపకుము.

కౌస - హా తండ్రీ! విచారము గాక యిక నాకు సంతోషమెక్కడిది? నన్నుఁ జూచి దుష్ట్ర స్త్రీ యిట్టు నా దుర్భాగ్యమునకు కిట్లు చేసినదా? హా నాయనా! నీ విశ్లేషమును నేను సహింపలేనురా! తండ్రీ! (ఏడ్చును)

రామ - తల్లీ! ఊరడిల్లుము.

కౌస - ఇంతకాలమునుండి నిన్నుఁ గష్టపడి పెంచి పెద్దవానినిజేసి విద్యాబుద్ధులు గఱపించి, యొక యింటివానిని జేసి; నా తండ్రీ నీవు తండ్రిగారి సింహాసనము నధిష్ఠించియుండఁగ జూడవలెనని యెంచి కొండంత మహానందముతోనున్న నా కెంత ప్రారబ్ధమాయెనిప్పుడు? దుఃఖింపవలసె నాయనా! నీవు వనమునకు బోవుట తప్పదా? మమ్ముద్ధరించు నీ చేతులమీఁదుగా గడప నుత్తి పోరాదా?

రామ - అమ్మా!

సీ. పదరానియిడుముల బహువత్సరము లొంది
కానఁగారాని సంతాన మిలను
బ్రార్థించి నాతండ్రి పలికినమాటను
తలదాల్చి యతనిసత్యప్రతిజ్ఞ
కాపాడి తత్పరోద్ధతులకు నిరువది
యైదేండ్ల వయసున్న యట్టిపెద్ద
కొడుకనై మునిజనకోమలపదపద్మ
సంసేవనక్రియ సలుపునట్టి

గీ. యేమి పాటుపడకయున్న నింకఁ గొడుకు
లేల? పుత్రులు లేరని యేడ్పులేల?

నరుల కుద్వాహసంబంధసరణి యేల?
స్త్రీపురుషజన్మభేదసంసిద్ధి యేల?

తండ్రిగారిని నా చేతిమీదుగఁ బంపిన పిదప వనమునకు వెడలుమని నీవు చెప్పితివి.

గీ. కట్టెను శ్మశానవాటిక కడకుఁ జేర్చు
నతఁడె పుత్రుఁడు కాఁడు; సత్యపవిత్ర
నమునఁ దండ్రియాత్మ ననంతవిమలపదవిఁ
జేర్చునాతఁడె సుతుఁ డని చెప్పబడును.

గీ. నీకుఁ బతియైన వృద్ధావనీశశత్రు
సంతత పవిత్ర శాశ్వత సద్గతికయి
శ్రమము నొందుట నీకు నేర్పడినవిధియె
కానఁ గాననయానము మాను నునకు.

కౌస — నీ తండ్రిగారి యుద్ధతికై నీవు నేనును దోడుపడుట నాకుఁ గర్తవ్యము కాన నేను నీతోడనే వత్తును. నే నిక్కడ నుండజాలను. నన్ను దీసికొనిపొమ్ము (ఏడ్చును)

రామ గీ. తనుజయుగి బాసి తను వోపఁడగని ముసలి
నిన్నుఁగూడను బాసిన నిలువ గలఁడె?
యడుగుసంకులు రెండూడ నలలనాడు
పటము పై ద్రాడునుం బాయునటులు తల్లి!

గీ. కాన, ముంగాళ్ళపైనున్న కన్నతండ్రి
నరనిముషమైనఁ ద్యజించు టమ్మ! తగదు
సతికిఁ బతిసేవకంటెఁ బ్రశస్తతరము
పుణ్యాతర మైనకృత్య మీ పుడమి లేదు.

గీ. వ్రతతపోదానయజ్ఞ తీర్థప్రయాణ
ములు సతుల కక్కఱయె లేదు మొదటిది, కడ
పటిది, పతిసేవ యా దానివలనఁ గలుగు
మునిమణీదుర్లభానంతమోదపదము.

గీ. కనఁబడని దేవుఁ బురుషులు కష్టమునను
గానవలె కాని కనులందుఁ గట్టబడిన

యీశు నిల్లాలు గొల్చి యిట్లే తరించు
సులభతారకధన్యంబు సుదతిబ్రతుకు

కావున నమ్మా! పతిసేవకై నీ విచ్చట నుండకతప్పదు. నే నిటు లనవలసి వచ్చినందులకు క్షమింపుము.

కౌసల్య - (ఏడ్చుచు) నే నిక్కడ నుండవలసినదే నా? పరమకోపస్వభావ యగు కైకేయిచే నవి యివి యనరాని యన్నిసూటిపోటిమాటలను బడుచు నష్టకష్టములఁ బడుచు నామె పరిచారికలచేగూడఁ దిరస్కృతిని బొందుచు. గన్నకడుపు కాలఁ బాలై, భరతచక్రవర్తిని సేవించుచు బ్రతుకు మని నీయభిప్రాయమా? నాయనా! సార్వభౌమునికి మాతనై మహాగౌరవము నీసరికి నొందుచుండవలసిన నేను కొడుకున కును దూరమై, సవతులకుఁ బరిహాసభాజనమై, లోకులకు బరమదరిద్రురాలను నిం దకుఁ బాత్రమై, గర్భశోకమహాగ్ని కింధనమై, బ్రతికిన వినియోగము లేక, చచ్చి చావకుండ దినములం జరుపుకొనవలసినదేనా? నాతండ్రీ! (ఏడ్చును.)

రామ - అమ్మా! భరతుడు నీయందు విశేషభక్తికలఁవాడు ఆతఁడు.

గీ. కొలఁదిగా నిల నాకంటెఁ గుఱుచవాఁ డన్న
మాటయే కాని నామోము, మాటతీరుఁ
జాయయున్నుగల్గు నాతఁడు- సరళహృదయుఁ
డాతనిని నన్నుఁగా నెంచనగును తల్లి !

అదిగాక, కైకేయినిగూర్చి నీవేమియు సంకోచింపవలదు. ఆమె తీవ్రభావయే యని యెంచుము

గీ. ఇట్టె చంపునట్లేచి బాధించునట్టి
జనులు హానిచేయరు పంటిసెలువుపోలె
నున్న జాడయే కనఁబడకుండువారు
ప్రాణములు పీల్తురిట్టె హృద్వ్యాధిఁబోలె

గీ. అమ్మ ! క్షణకోపు లిట్టె భగ్గనుచుమండి
ప్రజల భయపెట్టి తైక్ష్ణ్యకారణము పోవఁ
దిరిగి వేగ శాంతింతురు కొఱవిదయ్య
ములని జను లెంచువాయుమూర్తులను బోలి

నా వనవాసముతోను, భరతుని పట్టాభిషేకముతోను, దల్లిగారగు కైకేయికి సంపూర్ణకోపశాంతి యగును. కాన నామెనుగూర్చి నీవు భయపడవలసిన పనిలేదు.

కౌస - నాయనా! ఈ నిర్భాగ్యురాలి నిచ్చట నేయుంచి నీవు కాంతారమున కేగ నిశ్చయపఱచుకొంటివా? ఆగర్భ శ్రీమంతుఁడ వైన నీవు సమస్తసౌఖ్యములను

సామ్రాజ్యపదవి నొక్కసారి పరిత్యజించి కష్టభూయిష్టమైన మునివృత్తి నెట్లు సహింపఁగలవు నాతండ్రీ! (ఏడ్చును)

రామ - అమ్మా! నీవెంతమాత్రము పరితపింపవలదు, ఈమార్పువలన నాకేమియు బాధలేదు.

సీ. కూర్చుండుటకును బంగారు సింహాసనం
బైననేమి ? పులితోలైన నేమి ?
తలదాల్చుటకు రత్నకలితచిత్రకిరీట
మైన నేమి ? జటాలి యైననేమి ?
ధరియించుట కమూల్యతమపీతకౌశేయ
మైననేమిరా ? నార లైన నేమి ?
క్షుద్బాధ శాంతించుకొరకు క్షీరోదన
మైననేమి ? ఫలాళి యైననేమి ?

గీ. లంపటము దక్క సత్యశీలంబు గల్గి
నాల్గుదినములు నుండి యుండనివిధాన
నెట్లొయుండి వెడలుట కహీనభర్మ
హర్మ్యమైననేమి ? యరణ్యమైననేమి ?

కౌస - హా! నాయనా! మొన్నమొన్నటివాఁడవు నీ కింతవిరాగజ్ఞానసంపన్నత యిట్టి ప్రాపంచిక సౌఖ్యపరాఙ్ముఖత్వము నీ కీపసితనములోనె యెటు లబ్బి వదిరా! (ఏడ్చును)

రామ - తల్లీ!

గీ. స్వచ్ఛమూర్తివి నీవు, తేజస్స్వరూప
ముదిత ! పుట్టువుతోనె యీ భూవిదూర
మతము నాకుంట వింతగా ? మఱుగునీట
బుట్టు నావిరి కూర్ధ్వంపుఁబోక కాదె ?

గీ. ఇహసుఖములన్న నాసయు నిడుమలన్న
భయము నే నెఱుంగను గర్మచయము వలని
బంధ మంటదు నన్నుఁ బరిపంచసంగ
హార్ధ మోతల్లి ! నేఁ గర్మ మాచరింతు.

నేను కాననసీమను గష్టములఁబడి దుఃఖింతునేమో యను నాందోళనమును బాపుట కింత దూరపుమాట చెప్పవలసివచ్చినది. నాకు నిర్భీతిగ సెలవిమ్ము.

కౌస - అన్నిటి కన్నియుఁ జెప్పి నన్ను మాటాడకుండఁ జేయుచున్నావు నాయనా! నీకు బ్రతివాక్యములఁ జెప్పుటకు సమర్థురాలనా? అరుగో! నీకు బోధించుటకు వసిష్ఠభగవానుఁడును నీతండ్రి గారును వచ్చుచున్నారు.

రామ - అమ్మా! వారు నన్నాపుటకుఁ గాదు నాప్రణామములు గైకొని నన్నాశీర్వదించి సెలవిచ్చుటకు వచ్చుచున్నారు.

కౌస - (గుండెలుఁ గొట్టుకొనుచు) అయ్యో! నాతండ్రీ! నాతండ్రీ! ఇప్పుడే వెడలిపోవుదువా? నేను నిన్ను విడనాడఁగలనా? (కౌగిలించుకొని యేడ్చును)

దశ - (తొందరగఁ బ్రవేశించి) అయ్యయ్యో నేనుమాత్రము విడువఁగలనా? రామా రామా రామా (కౌగిలించుకొని యేడ్చును.)

వసి - (ప్రవేశించి తనలో) ఆహా

గీ దంపతులు చెరియొకవంకఁ దల్లడిల్ల
నడుమ జానకీయుతరాముఁ డడరు, సోమ
యాజియును సోమిదమ్మ బాష్పాంబు లొలుక
మధ్యమున సకీలాజ్యహోమమ్ముఁ బోలె.

(ప్రకాశముగ) దశరథా కోసలాత్మజా ఊఱడిల్లుఁడు.

కౌస - వసిష్ఠభగవానుఁడా మీరాజ్ఞ యిచ్చిన పట్టాభిషేక ముహూర్తము వృథపోఁగూడదు. కావున శ్రీరామభద్రు నిప్పుడే పట్టభద్రునిఁ జేసి మమ్ముఁ గృతార్థులఁ జేసి రక్షింపుము. (సాష్టాంగపడుచున్నది.)

వసి - (లేవనెత్తి, అపవారించి) దేవీ

గీ. ఇరువదై దేండ్లనుండియే యీ మహాత్ము
నెఱుఁగుదువు నీవు, నేనో యనేకహాయ
నములనుండి తలంచి మననముచేసి,
భక్తిఁ బ్రేమించి పూజించి, బహువిధముల
సేవఁజేయుచు, నితని సచ్చిదమల స్వ
రూపచరణ సందర్శన రూఢ మతిని
గర్హ్యమగు పురోహితతను గాంచి రఘుకు
లమును గనిపెట్టుకొని యుంటి విమలచరిత!

గీ. ఇతనిపైన నీ యనురాగమే యధికమొ?
రామనామ సంస్మరణపూర్వకముగ జప
మాలఁ ద్రిప్ప నరిగిపోవు వ్రేళ్లులు గల
ముదిమిగడ్డపు మునిరాగము ఘనమొ? కను

గీ. ఇంతి వెూట బావురుమంచు నేడ్చుచుంటి
వేను బురుషుఁడ నంచు పై బుష్పధార
నాముఁడను బెద్దఁగాన లోలో మఱికెద
నితని విశ్లేష మెవఁడు సహింపగలఁడు?

గీ. విన నీతఁడు సత్యవాక్యాను పాల
నమును లోకార్థ మాచరింప, మతి నెంచి
యుండ, వలదనరాదు; భూమండలాధి
పత్యపద మంతకంటె గొప్పదియె తలఁప?

కౌస — (అపవారించి) అయ్యయ్యో నాతండ్రిని విడిచియుండవలసినదే నా? ఈ సుగుణసంపన్ను నీప్రసన్నసుకుమారాంగు, నీగంభీరస్వభావు, నీదయాసముద్రు నయో ఒక్కని—నాకొక్క డేయైనవానిని—

వసి — (అపవారించి) నీకేకాదు; ఈ పదునాలుగు భువనములకుఁగూడ నీతఁ డొక్కఁడే.

గీ. కడుపునను గాంచి నీవును, గనులఁ గాంచి
యేము, ధన్యుల మైనార మింకఁ జిరత
పస్సమాధిగతాటవీ వాసిమౌని
కులము దర్శించి తరియింప వలదె వేగ?

కావున, శిష్టరక్షణార్థము దుష్టశిక్షణార్థము శ్రీరామభద్రుని విడువక తప్పదు. ఏడుపును విడువుము.

కౌస — (అపవారించి) భగవానుఁడా మీ యాజ్ఞ యట్టులైనది కాన నా తండ్రిని నేను విడువఁగలను గాని యేడు పెట్టులు విడువఁగలను? మీయానతి యగు నెడల శిరము నవలీల దెగగోసికొందును గాని రక్తము స్రవింపకుండ నే నాప గలనా? (ఏడ్చును.)

దశ — హా కౌసల్యా నాతో నింతసేపటినుండియు బలుక కున్నావు.

గీ. పైమెఱుంగులరాకాసి వలను దగిలి
నినుఁ దృణీకరించితి మున్నె; నీసుసుతుని
నిప్పుడాశక్తికే బలినిచ్చి త్రాళ్లు
మెడను గట్టి నట్టేట దింపితిని నిన్ను,

వసి — (చెవులు మూసికొని) పాపము శాంతించును గాక

దశ — మహానుభావా నాపాపము శాంతించునది కాదు. ఈదోషాగ్నిజ్వాల ప్రళయకాలాంబుధరసంతతవర్ష ధారాపాతమున నైన శాంతి వొందదు. (ఏడ్చును)

రామ — తండ్రీ ఊఱడిల్లుము.

కౌస - నాయనా! మాకింక బ్రదికియున్నంతకాల మూఱటకాక యింక వ్యాపార మేమున్నది? మాగతి యేమిచేసితివోయి నాయనా! (ఏడ్చును.)

స్త్రీ - అయ్యో [illegible] పురపు వీరి కొంచె మూ[illegible],

కౌస - (స్త్రీ[illegible]) హా! క్షితపుత్రీ! నీవుకూడ నా తండ్రి ననుసరించి పోయితి[illegible] ఎంత పాపాత్మురాలను? పండ్రెండేండ్లనుంచి కాపురమును జేయుచున్నప్పుడు నా దిక్కు [illegible] నుదుటివ్రాత కాని [illegible] నొక్క [illegible]మైన నిదివఱకు కాచి [illegible] ఆకసు గాయని దగ్గఱ బె[illegible]కొని యేదో యొకతీరుగ దెల్లవారనద్చుచున్న యీ మహాపాతకపు జీవములు గడతేర్చుకొందుము గదా (ఏడ్చును.)

దశ - కౌసల్యపైఁ జేయివైచి సతీమణీ

సీ. కొడుకో కొడుకో యని కూసిననోటికి
నిద్రవిరామమును లేక వెఱ్ఱిలెత్తి
తినరానిగడ్డిని తిని హాహోరుహాహో గని
యఱువదియైదు వేలైనవత్స
రము లేడ్చి కనిసపుత్త్రిసు నిర్వైదేండ్ల
నాయంతవాని మిగ్రింగంగఁ దలఁచు
పాతకి యింటిలోపల నింకఁ బిల్లలు
కూడనా? క్షుద్బాధకును దపించి

గీ. పిల్లలనె తను బాలింత పెద్దపులి గ
ల వనిచుట్టు రెండామడలనరకు నెట
జంతు బృందనిచోఁ బెద్దసంతతి వారి
యించు నా యిల్లిక శ్మశానమేల కాదు?

వసి - సత్యవ్రాగ్రత్యుకై యింతవాఁడైన జ్యేష్ఠసుతుని బరిత్యజించుట కంగీకరించుట నీ మహోదారతను సూచించుచుండ నిన్ను నీవేల వృథగ దూఱుకొందువు?

దశ - మహానుభావా లోకమున కిప్పుడు సూచింపఁబడినది నా [illegible]దారత కాదు? దారలోలత - కనిష్ఠదారలోలత, దారకహింసాపరాయణత - జ్యేష్ఠదార హింసాపరాయణత. కత్తి కెఱఁబెట్టఁదగిన గద్యాళిని, నెత్తిపై బెట్టుకొని సింహాసనమున బెట్టదగిన సుగుణశిఖామణిని, పరమసుకుమారు నాగర్భసముజ్జ్వల వైభవుని నట్టడవిలోఁ బెట్టితిని.

రామ — తండ్రీ! వనవాసము నాకు గష్టమని యాలోచించు చున్నవేమో? నాకు గష్ట మింతమాత్రము లేదు. ఏలన.

సీ. ఈ బాల్యతనువున కీవె కారణమవు
నావైభవములన్ని నీవె కాన,
నీ సత్యవాక్యంబు నిలుపుట విధి నాకు
విధిచేయనుంటచే వెలయుఁ దుష్టి
సంతుష్టియే సర్వసౌఖ్యనిదానంబు
బాహ్యావస్తువుల లోపలను సుఖము
లే దది చిత్తవిలీనంబు చిత్తగ
తులఁబట్టి బాహ్యావస్తువులు కాని
గీ. బాహ్యావస్తులవలనఁ జేపడవు చిత్త
గతులు గావునఁ గానన స్థితులు నాకు
నమితసుఖదాయకంబు లౌనయ్య మీరు
నాకొఱకు చింతవడకుఁడీ నతు లొనర్తు.

(నమస్కరించును)

దశ—నాతండ్రి! జ్ఞానసంపన్నుఁడవైన నీ కట్లే కావచ్చును గాని దుర్మ దాంధుఁడనై వార్ధకమునఁ గాటికిఁ గాళులు చాచుకొని, నీవలనఁ దరింపవలెనని యెంచి, యింతకాలమునుండి యేడ్చుచున్న నాకు నీవిశ్లేషము కష్టముగాదా?

గీ. నీతోడ నాలాడగాఁ గుర్చినిచయకయ్యఁ
బండి, లోకావనాధ్యమాపాణి, నాదు లోకవములను ఉద్దీపించు సామర్థ్యమునకు
మొగమునను రాలు నీ బాష్పములను నీవు
దుడువ హాయిగా నీకట్టివిడుచు టేది? (ఏడ్చును.)

కౌస - నాథా! దుర్గతులకుఁ బాలు కావలసిన మనకిట్టి పుత్త్రుడేల దక్కును? హా! మందభాగ్యులమైన మన కింక నేది గతి?

వసి - (తనలో) మెండకైన

గీ. బ్రహ్మముఖ దేవతాచింత్యపాద పీఠ
మగు మహాతేజమును గడుపారఁ గాంచి
ధన్యులగు వీరె యిట్లు రోదనము సేయ
వసుధ సుఖు లనఁదగినట్టివార లెవరు?

రామ - తండ్రిగారూ! ఆలస్య మగుచున్నది. అందువలనఁ దల్లిగారైన కైకేయి కన్యథా తోఁచఁగలదు.

వసి - అదిగో! కైకేయియు, సుమిత్రా లక్ష్మణులు వేగ వేగ వచ్చు. చున్నారు?

(కైకేయి, సుమిత్ర, లక్ష్మణుఁడు ప్రవేశింతురు)

లక్ష్మ - తండ్రీ! నమస్కారము, అన్నగారూ (మ్రొక్కుచున్నాఁడు) నరూత్తమ నమస్కారము.

సీత - (అపవారించి చిఱునగవుతో) వత్స సౌమిత్రి తుదకు నాప్రయాణ మగూడ స్థిరపడినదిసుమా

లక్ష్మ - (అపవారించి) సంతోషమే.

దశ - కౌసల్యా మన గృహమహాలక్ష్మియైన పెద్దకోడలిని వైదేహిని జూడుము. ఎంతముగ్ధాంగనయో కనిపెట్టుము.

గీ. మొగమునందున చిఱునవ్వు మొలకలెత్త
నీ యుపద్రవ మేమియో యెఱుఁగ దబల
భర్తతోఁ బోదు నను మోదభరమె కాని
యచటి యాపద లెన్నెన్నొ యరయ దహహ!

కౌస - అమ్మా సీతా ఒక్కసారి యిటురా. కవుగిలించుకొని యేడ్చును)

సీత - అత్తా నన్నుగూర్చి మీకుగాని మామగారికిగాని విచారమువలదు. నాభర్త చక్రవర్తియైన నేనతనికి దాసినే. మునివృత్తినున్నను దాసినే. నాభర్త యోగ్యాయోగ్యములవలన నాస్థితి మాఱునదికాదు. నాకుఁ బత్యనుసరణమే సమస్త లోక సౌఖ్యావధి. కావున రాజ్యత్యాగము నాకేమి యుపద్రవముగాఁ దోఁచుట లేదు. అదిగాక లోకరక్షకుడైన నాపతి ననుసరించిన నాకుఁ గష్టము లెన్నండును రావు.

కైక - (తనలో) కాఁబోవు. పట్టమహిషిపాట్లీలాగున నున్నవి. వైభవము జారినప్పుడు వైరాగ్యమునకు లోటేమి?

సుమి - (అపవారించి) నాయనా! లక్ష్మణా! మరియొకసారి చెప్పుచున్నాను. పరమసుకుమారి యగు సీత నాకుఁ బ్రాణాధిక, నీ వామె పరిచర్యయం దప్రమత్తుఁడవై యుండి యామెను నాకంటె నధికముగ భావించుకొనుచుండవలయు. రామా!

లక్ష్మ - (అప) అమ్మా! ఆయంశ మిన్నిమాఱులు చెప్పినను నీకు దనివిలేదు అటు లాచరింపకున్న నా జన్మమునకుఁ గృతార్థతలేదు.

దశ - తండ్రీ! రాఘవా!

గీ. మణులరాసుల బంగారుమ్రలల భృత్యగణముల
కోట్లనడుమను బుట్టి యెక్కువగఁ బెరిఁగి
నట్టి నీవు కాఱడవిలో బ్రొద్దెంపు భయంకరమున
ఱాలలో ముండ్లలో నెట్లు బ్రతుకగలవు?

గీ. సర్వభండారచతురంగ సైన్యదాస
సంఘకలితుఁడవై వనస్థలికి నేగి

తనయ ! ఘాతుకకర్కశాధముని విడిచి
యట నయోధ్యలోవలె సుఖమందవయ్య

కైక – ఆఁ! ఆ! అదెటులు! సమస్త భండారసామగ్రి రామునితో బంపుటకు నీకేమి యధికారమున్నది? సర్వాంగసమేత సమస్తరాజ్యమును భరతునికి సప్రమాణముగ నింతకుమున్నే యిచ్చి తిరిగి స్వయందత్తాపహరణ ప్రవీణుడవై ప్రకాశింపదలచితివా ? వసిష్ఠభగవానుడా ! ఊరకుందువేల? నీ ధర్మశాస్త్రశిక్షలో దేలిన యీ మహానుభావునికి విపరీతబుద్ధు లేల? మందలింపరాదా? ఆ! రాజేంద్రా సమస్తమును రామునెత్తిఁ గట్టిపంపంగ సర్వశూన్యమైన యీ రాజ్యమును నా కొడుకెటు లేలు ననుకొంటివి?

దశ – ఓసీ, చండాలురాలా! దయ, దాక్షిణ్యము, భయము, సిగ్గు, పరమార్థ చింతాలేశము లేక సర్వసద్గుణశూన్యయైన నిన్ను నే నేలినట్లే యాతఁడీ ధరణి నేలును. ఓసి, దుర్మార్గురాలా, భరతుని రాజత్వము నీ రాజమాతృత్వ వైభవము నెట్లు వెలుఁగుదువో చెప్పెదను విను.

సీ. రాముఁ డడవి కేగ రాజ్యంబు వల్లకా
డౌను, నక్కలును వృకాళి నీకుఁ
జెలికత్తె లగుదురు; జీరిగుడ్లితువు
లబ్బిలాల్ లీలాశుకములు నీకుఁ
జికిలింతలును బొమ్మజెముడు చెట్లుద్యాన
ములు; ఘూకకృతి మేలుకొలుపు నీకు
నన్ను బుగ్గిని జేయుటిన్నె పంచాస్యపీ
ఠము; నాపునుక కిరీటమును నీదు

గీ. సుతుని కగు; నాకసమె గొడుగ తని కిట్టు
లీశ్మశానంబు నతఁ డేలు నెపుడు నీదు
వెడనుడుల మీఱు కభిచారవిద్యఁ బర్యు
పాసనముఁ జేసి బ్రదికెడు భ్రష్టుపోల్కి

రాము – తండ్రీ! ఆభిజాత్యసంపన్నయైన మాయమ్మగారియెడను, గురుజనభక్తియుక్తుఁడగు చిరంజీవి మా తమ్మునియెడల నిట్టి కఠినోక్తులు బలుక న్యాయమగునా? (కైకేయివంక దిరిగి) అమ్మా! మునివృత్తినిఁ బ్రచ్ఛన్నముగ నడవి నుండదలచిన నాకు గజతురగమణి సేనాది రాజ్యవైభవము లేల? నాకేమియు వలదు? సమస్త ప్రాభవములతో దమ్ముడే పరిపాలించుఁ గాక! ఆతఁడైన నేమి? నేనైన నేమి?

కైక – రామభద్రా! నీవు బుద్ధిమంతుఁడవు, ధర్మమార్గసంచారివని నే నెఱుగనా? కాని పుత్రాభిమాన ప్రాబల్యముచేత నీ తండ్రి –

కౌస - ఓ కృపామయులారా! ఓ పుత్రవతీ! ఈ వద్ధమహారాజు నీమూలమున జ్యేష్ఠపుత్రుని, సింహాసనార్హుని, సర్వమంగళ గుణాభిరాముండైనరాముని, నాలంద్రిసి గానకు బోవలసినదని నిర్దయుఁడై పలికి పంపుచుండిన నతని కింక బుత్రాభిమాన ప్రాబల్య మని నీవు కన్నులు పొడుచుకొనుచుంటివా? కన్నందులకుఁ దండ్రి కా మాత్రమైన నభిమాన ముండక, పిల్లలను గండుకొటికినట్లు కోయుడు మని నీ యభిప్రాయమా? కడుపుతీపు తెలిసిన నీకే యీపోగాలమా?

కైక - పోగాలము నాకు గాదు. నీకు - నీకొడుకునకు - నీకొడుకునకు గాటికి బోగాలము. ఆ వేడుక చూడలేక నీకు వల్లకాటికి బోగాలము.

అంద - (చెవులు మూసికొని) హరిహరీ

రామ - అమ్మా నీవింక మాటలాడక నీ సపత్నియెడల నిర్మత్సర వై నన్నుగూర్చి విచారము దక్కియుండవలెను. (కైకేయివంక దిరిగి) అమ్మా మాతల్లి సంతాపాతిశయమున ని న్నాడినమాటలకు నీవు కోపపడక క్షమింపదగును.

కైక - సంతాపమున్న గంట నిప్పులు కొట్టుకొనవలెను. గొంతెత్తి యేడ్వవలెను గాని యీ పలంగాకితనా తేల?

లక్ష్మ - (అపవారించి రోషముతో) అగ్రజా! దాశరథి! ఇంకను శాంతమేనా? ఇంకను నోరుమూసికొనియే యుండవలెనా? సీసముగాల్చి చెవులలో బోసికొనుట కంటె దీక్ష్ణతరములగు పలుకులు గర్ణములం బడుచుండ బౌరుషహీనుడనై బ్రదుకవలసిన దేనా? రాఘవా! నన్ను వదలుము. నాదేహము గంపమెత్తుచున్నది. నాకడుపు మండుకొనిపోవుచున్నది; నాచెవులు చిల్లులు పడుచున్నవి! నే నిక సహింపలేను. రామా! రామా! రామా! ఇప్పుడు పనికిరాకపోయిన నా ధనుస్సేల కాల్పనా? విడు విడు ఈ రాకాసిని ...

రామ - (అపవారించి) తమ్ముడా!

గీ. అమ్మ! కఠినోక్తులకు మన మర్హుల మయి
యున్న దిద్దుకోవలెఁ గోప మూనఁ దగదు
కానిచో, నవి మముగూర్చి కావు గాన
ననుజ! తాపంబు బొత్తిగా ననవసరము.

అదిగాక!

గీ. స్తుతికి ముదమంది నిందకు వెతను జెందు
జనునిలఘుచిత్త మెపుడు సంచలితమగుచు
శాంతతను జెందదు, పరితిదిశాసమాగ
తశ్వసన చలత్కేతు వస్త్రమును బోలె.

(కౌగిలించుకొని) తమ్ముడా! నీవిప్పు డేమియు మాటలాడకుండవలెను (ప్రకాశముగా) తండ్రీ! దాసదాసీజనస్వర్ణమణి సేనాని రాజ్యవైభవము లాగర్భ

శ్రీమంతుడనైన నాకు గానవకష్టముబాధ తెలియకుండునటుల నాతోగూ బంపుదురని మీ రానతిచ్చిరి

దశ — నాయనా! ఆమాటలాడినందులకేకదా యింతరాద్ధాంతము జరిగినది.

రామ — తండ్రీ! అదియేమియూ నాతో బంపవలదు.

గీ. సర్వసామగ్రి సృష్టిలో సౌఖ్య మీయ
జాలియుండ బ్రశస్త మశస్త మంచు
విననిభేదముఁ జేసి మంచిని వరించి
చిత్తసౌఖ్యమాందారినే చెందుకంటె.

గీ. జ్ఞానమున చిత్తసుఖ మంది సకలవస్తు
కోటి సుఖదముగాఁ జేసికొనుటమంచి;
అది జలుబిది కాకని దేవులాడుకంటె
జనుండు జఠరదీప్తినిఁ జేసికొనుట తగదె ;

గీ. గురువసిష్ఠోపదేశ మీగరణి నయ్యెఁ
గావునను నాకు మట్టి బంగార మగును
బవనపారణమే పయఃప్రాశన మగు
నారబట్టలె హొంబట్టుచీర లగును

గీ. ప్రబల కానన ముద్యానవాటి యగును
జాపజాబండలే పుష్పశయ్య లగును
సత్త్వులే ప్రాణసన్నిభబంధు లగును
మృగతతులె నిరంకుశసేన లగును నాకు.

అదిగాక తండ్రీ!

గీ. నాకుఁ గీడేదొ యొనరించినాఁడ ననుచు
వ్యసన మొందుచునుంటి వాపనిమె నాకు
ముద మొసంగుటె కాక సంపూర్ణహర్ష
సంఘటనదక్ష మగు జగజ్జాలమునకు.

గీ. కాన నిర్విచారము గాఁగఁ గాన కిపుడు
నన్నుఁ బంపుము నా తండ్రి! నిన్ను గురుని
ముగురుతల్లులఁ బ్రత్యక్షముగను గొల్చు
ముదము గడితేతె నీకఁ జిత్తముననె కొలుతు.

వసి—(తనలో)

గీ. తల్లు లని తండ్రియని గురూత్తముఁ డటంచు
ప్రొక్కుటని లోకసంగ్రహము కొఱ కిటులు
పలికితివి గాని వృద్ధ్యంతభవవిదూర
పరచిదానందమయపరబ్రహ్మ మీవె.

కౌస—నాతండ్రీ! నిర్భాగ్యులమగు మమ్ము వదలి యిప్పుడే పోవఁదలచితివా? అయ్యయో! నాయనా! నాయనా! తిరిగి నీముఖదర్శనము మా కెంతికాలమునకురా తండ్రి! నీకు మావస్తువు లేమియు నక్కఱయే లేదా?

రామ—అమ్మా! నాకొక్కవస్తువును గటాక్షించిన సంతోషపూర్వకముగ గ్రహింతును.

దశ | కౌస — నాయనా! ఏదది?

కైక—(తనలో) రాష్ట్రము గాఁబోలు!

రామ—ఒక్క నారబట్ట.

దశ | కౌస — హరిహరీ! హరిహరీ! (ఏడ్తురు.)

కైక—(ముందునకు నడచి) ఇదిగో! నీవు కోరిన వల్కలము నీకొఱకు భద్రపఱచియుంటిని. శీఘ్రముగ ధరించి పొమ్ము.

రాము—(వస్త్రముల కన్నుల కద్దుకొని) అమ్మా మహాప్రసాదము. (నమస్కరించును.)

దశ | కౌస — అయ్యో! రామా! రామా! (ఏడ్తురు.)

రామ—గీ. ఈతనువు మిశ్రమసాధనం బిద్ది తండ్రి
గా రొసఁగిరి కేవల పరాధార మైన
దీని నీ విచ్చితివి తల్లి! దీనికంటెఁ
బ్రియతరం బైనవస్తు వే పృథివిఁ గలదె?

గీ. రాముఁ డనునొక యైక్ష్వాకరాజు భువిని
గలఁ డఁటంచును ముందురాఁ గలుగుజనులు
బలుకదగియున్న యట్టి మత్ప్రథితకీర్తి
నీవలననె రావలయును నిజముతల్లి!

తల్లులారా! గురువర్యా! తండ్రి! వస్త్రమును ధరించి వత్తును. సెలవొసఁగుఁడు. (నిష్క్రమించును.)

కౌస—(గుండెలుకొట్టుకొని) ఇఁ కేమున్నది? ఇఁక నేమున్నది?

కైక — సౌమిత్రీ! ఇదిగో! నీ కొక్క వల్కలము

లక్ష్మ — నీవసన మెవరికిఁ గావలెను? అది భరతునికొఱకు భద్రపఱచుకొనుము లేదా ఒకయంచులను నీయత్తునకు ముడివైచుకొని రెండవయంచు భరతుని గొంతుకకు జుట్టఁబెట్టి సింహాసనమున కిద్దఱు జేతియొక్క ప్రక్కన ప్రేలాడుఁడు. నేను నావస్త్రములను సిద్ధపఱచుకొనియేయుంటిని. అవి ధరించి వత్తును. (లక్ష్మణుఁడు పోవును)

దశ — ఓసి! కుటిలాత్మురాలా! ఆవస్త్రములు నాకిమ్ము, ఇమ్ము,

కైక - ఇది నీ కేల?

దశ - ఏలయో చెప్పవలెనా! నాశవముపైఁ గప్పబడుటకు - రాముఁడెట్టి వేషముతోఁ బవిత్రమైన కాననమున కేగునో యట్టివేషముతో నే నపవిత్రమగు నరకమునకు నే నేగెదను.

(నేపథ్యమున) నీ వొక్కఁడవే యేగ నేల? కైకేయినిగూడ దీసికొనిపొమ్ము శీఘ్రముగ దీసికొనిపొమ్ము.

దశ - ఓసి! పాపాత్మురాలా, రామవిశ్లేషమును సహింపలేక జను లెల్లు కోటబురుజు నెక్కి నిన్ను నన్ను నెట్లు తిట్టుచున్నారో చూడుము?

కైక - భయ మేల? భరతుఁడు వచ్చిన నన్నియు జక్కఁబడును.

(నేపథ్యమున) భరతుఁడు వచ్చుటకు రామభద్రుని వనమునకు వెడలనిత్తుమా? మాగొంతుకల గోయించుకొందుము; రథమున కడ్డముగ బడుదుము. రామభద్రుని కాళ్ళపై బడుదుము; కాని లోకానందమూర్తియైన శ్రీరామమూర్తిని బోనిచ్చెదమా?

(తిరిగి నేపథ్యమున మఱియొక వ్యక్తితో) జనులారా, తొందరపడకుడు మంచియో చెడ్డయో మహారాజు శాసనము అవిలంఘనీయము జాగ్రత్త, జాగ్రత్త.

దశ - గురూత్తమా, ఆకంఠస్వరము సుమంత్రునిదే కాదా?

వసి - ఔను.

దశ - సుమంత్రుఁడా! ఇటురా.

(సుమంత్రుఁడు ప్రవేశించును.)

దశ - సుమంత్రా? ఇంతసేపేమి చేయుచుంటివి?

సుమం - సేనాధిపతులను దీసికొనిపోయి జనుల మహాకలకలమును వారించుచుంటిని. మహాప్రభూ! రామలక్ష్మణులేరి?

(నేపథ్యమున) ఇదిగో వచ్చుచున్నాము.

(నారలు ధరించి రామలక్ష్మణులు ప్రవేశింతురు.)

రామ - (అపవారించి) సుమంత్రా! రథమును సిద్ధపఱచితివి కాదా?

సుమం - (అపవారించి) ఆజ్ఞానుసారమే.

రామ - (నవ్వుచు) సుమంత్రుఁడా! మా మునివేషములు బాగుగనున్నవా?

సుమం - సాలగ్రామము, స్ఫటికము సంపుటములలో నుంచినట్లున్నవి.

దశ - ఓ గురూత్తమా! ఓ కోసలాత్మజా! అటు చూడుడు! నా తండ్రి మునుగుడ్డలలోనైన నెంత తేజస్వియై వెలుగుచున్నాడో! చూడు.

ఇంద్రుడు
గీ. ద్యుపతిసమవైభవము లోష్టతుల్యముగను
వదలి వైరాగ్యవిజ్ఞాన భవ్యభావుఁ
డై మహానందమూర్తియై । యుడుగొ ; లిప్త
సర్వసంగుఁడౌ పరమహంసను పోలెఁచు.

(ఏడ్చుచు) నాతండ్రీ! నాతండ్రీ! ఒక్కసారి యిటు వచ్చి నన్ను గట్టిగఁ గౌఁగిలించుకొనుము, కౌసల్యయు, దశరథుఁడు రాముని గౌగిలించుకొని యేడ్తురు.)

గీ. అమితవనితాతిలోలుఁడ నలుసనాకు
నేకపత్నీవ్రతుఁడ వుద్భవించి తౌర !
భవమహాపాశపరిబద్ధభావుఁ డైన
నాకు భవదూరుఁడవు పుట్టినావు తండ్రి

గీ. ఇట్టి విజ్ఞానిచేతఁ దరింపలేక
యోఁడుదానికై నిను విడనాడుకొంటిఁ
గర్మకలనకు నమితాధికతను జూపి
భక్తిఁ బోషించుకొనిన యపుత్రప్రాజ్ఞు వలెను. (ఏడ్చును)

రామ—తండ్రీ! మీరిట్లు విచారింపఁదగదు నే నిక్కడ నుండునంతసేపును మీకు విచారము ప్రబలమగుచు నుండును గాన నేను బోయెదను. రథము సిద్ధపఱచితినని సుమంత్రుఁడు చెప్పినాడు. ఓతండ్రీ! ఓతల్లులారా! నాకానతిండు.

దశ
కౌస—సుమి } రామ–రామ–రామా! అయ్యయ్యో (ఏడ్తురు)

కైక—రాఘవా! సీతకూడ మునికాంతావేషమును ధరించకుండనే పోఁదలచితివా? జానకీ! ఇదిగో! నీవల్కలము ఇటు వచ్చి దీనిని గ్రహించుము.

సీత—(రాముని వంక జూచుచున్నది)

రామ—జానకీ! సంతోషపూర్వకముగ మా తల్లిగారి ప్రసాదమును స్వీకరింపుము ఆ పవిత్రవల్కలము అందుకొని నేత్రముల కద్దుకొని. యాకెకు నమస్కరింపుము.

సీత—చిత్తము. (కైకయొద్దకుఁ బోయి యటుల చేయును)

సుమి—అయ్యో! అయ్యో! జానకికికూడ వల్కలములేల!

కౌస—నాతల్లీ! క్షితమ్మా! నీకుఁగూడ నీ వికృతవేష మెందుకు? (ఏడ్చును.)

సీత - అత్తా! నాకాంతున కే వేష ముచితమో నాకు నదియె యుక్తము. ప్రాణనాథా! మునికాంతా పరిచర్యలాభము నాకెంతదనుక లభింపబోవుటచే నిట్టి పవిత్రవనముల నెట్లు ధరింపవలెనో నాకనుభవము లేదు. ఏమిచేయుదును?

రామ - అమ్మా! నీ కోడలి కీవసనమును గట్టించెదవా ?

కౌస - (గుండెలు కొట్టుకొని) అయ్యయ్యో! నాతండ్రీ! నాతండ్రీ! నీవివాహము

వేళ మధుపర్కము లిచ్చుసమయమున జానకికి బంగారుచీరఁ గట్టించిన యీ చేతులు తిరిగి సీతమ్మకు యీ నారగుడ్డ నెటులఁ గట్టఁగలవు! ఈ చేతులతో నా కన్నులఁ బొడుచుకొందును గాని యీ ఘోరపాపమును నేను జూడలేనురా! (ఏడ్చును.)

కైక - (తనలో) రామపట్టాభిషేకమహోత్సవ మనుభవించు అనుభవించు.

లక్ష్మ - అమ్మా! నీవైన జానకీదేవి కీయుపకారమును జేయఁగలవా? (ఏడ్చును)

సుమి - నావలన గాదు నాతండ్రీ! (ఏడ్చును)

లక్ష్మ - ఓ కైకయాత్మజా! ఓకరుణోదధీ! నీవు మనస్ఫూర్తిగ నిచ్చితివి గాన చేతులార నీవే కట్టుము.

కైక - ఛీ! ఛీ! యేమి పేలితివి? నేను నీ వదినెకు బట్టలుగట్టించుటకు దాసి ననుకొంటివా? ఊడిగపుతొత్తుననుకొంటివా? నీకుఁ గనులులేవా? నోటికిఁ గావరమా? రాజమాతనైన నన్నిట్టు లాడెదవా ?

రాము - తమ్ముడా! తొందరపడకు. అమ్మా క్షమింపుము జానకీ! ఇప్పటి కిది నీపైఁ గప్పెదను. చేతనైనట్లు తరువాతఁ గట్టవచ్చును లెమ్ము (పైన గప్పును)

కౌస | ఆహా! ఆహా! (ఏడ్తురు)
సుమి |

కైక - ఇకఁ నన్నియాఁడుపనులు నీచేతనే కానున్నది కావా? ఈ పదునాలుగు సంవత్సరములు నీవు చేయు మహోద్యోగ మే మున్నది?

వసి - కేకయరాజపుత్రీ, ఏమి యీ వేషబములు? ఏమి యీ పట్టుదలమాటలు యజ్ఞవేది కాసంభవయుఁ ద్రిలోకపావనియునగు సీతాదేవికి వల్కలధారణ మేల ? అది కాక మునివృత్తియొక్క రామభద్రున కేకదా నీవు కోరితివి?

కైక - రామచంద్రునికి గోరితని గాని సీతకు వలదని చెప్పితినా ?

వసి - అట్టిదానవు జానకీదేవికిగూడ నప్పుడే యేల కోరక పోయితివి?

కైక - అనవసరముగ గంతక్షోభ మొనర్చుకొని మీరిప్పుడు లేనిపోని ధర్మశాస్త్రాక్షేపణమును జెప్పి యిటుల హాస్యాస్పదముగ నిరోధింతురని నేనప్పు డెఱుగక పోవుటచేత గోరలేదు. మీదబడవైచినది బట్ట కాని పాము కాదుగదా, పోవునది వనమునకుగాని మరణమునకు గాదుకదా, సంసారలంపటుల మొదలుకొని సంగపరిత్యాగులవఱ కందఱి కిట్టికడుపుమంట యేల ?

లక్ష్మ—గీ, పొడిచెదను, గోసెదను, జెరుపుదును, జీరు
దును, వెలఁదిఁ జెప్పఁను గొట్టక నను నిటు ద
దహింతువా ? రామచంద్రు బాధింతువా ? ము
నీశ్వరులను దిట్టింతువా ? యిదిగో ? కత్తి.

(తండ్రిపై గత్తిదూసి యురుకును.)

రామ:- ఆ, ఆ, సౌమిత్రీ. (ఆపును)

సుమి - లక్ష్మణా! లక్ష్మణా! అదేమి? అదేమి? నీకెంత బోధించినను శాంతత రాదేమి ప్రారబ్ధమురా!

కౌస - రాఘవా, తమ్ముని గట్టిగఁ బట్టుకొనుమా!

దశ - దేవీ! పట్టుకొన నేల? రామభద్రా! నాయందు దయగలవాఁడ వైన యెడల నీతమ్ముని విడువుము, లక్ష్మణా, నీవిప్పుడుగదా లక్ష్మణుఁడవై ప్రకాశించుచున్నావు? రా, వెనుదీయక రా,

సీ. చండాలుఁడను మదాంధుఁడ, జడుండ, గాం
      తాజనతాలోలతాయుతుండ,
బుత్రఘాతుకుఁడను, భూభర దేహుఁడ
      వధ్యుండ నైన నన్ వధము సేయు
నాతఁ డేఁడీ! లక్ష్మణా? తండ్రి! నీ కింత
      కాలంబునకు దయగల్గె; నిదె కి
రీటము, లోకసంప్రీతిఁ జేసెదు రాము
      తల నుంచు మిదె నాదుతలను వంచి

గీ. నాఁడఁ! గానీ నెటులొ చెప్పవాఁడు? విను! శి
రంబు గిరగిర దొరలుచు రాముపాద
ములను బడవలె; తెలిసెనా; మోడ్చు కేలు
వట్టితిని; ఊఁ; యికాఁగ కబ్బా యిదేల?

ఏమి సౌమిత్రి, ఊరకుంటివేమి? తండ్రిమాట జవదాఁటఁదగునా? సంకోచింపకు. ఏమి? అటు లూరక చూచెదవేమి? పొమ్ము. పితృవాక్యపరిపాలన మనునది నీయన్నకు జెల్లినది కాని నీవంటివానికేనా? పోపో, నీవే వనమునకుఁ ముందుగఁ బో.

లక్ష్మ - పితృవాక్యవ్యతిరేకమునకు నన్ను వనమునకుఁ బొమ్మనినారు. పితృవాక్యవిధేయుత కీమహాత్ముని వనమునకుఁ బొమ్మనినారు. ఇఁక మీ పరిపాలనమునకు శ్రద్ధకు మంచిది భేద మేమున్నది?

రామ - (అపవారించి) లక్ష్మణా,

గీ. తరణికులమున నుదయించి, తమ్ముఁడా! వ
శిష్టశిష్యుఁడ వై పరమేష్ఠితుల్యు
గాధిసుతుచేత దివ్యాస్త్రకాండ మంది
నందులకుఁ దండ్రిఁ జంపుటేనా? ఫలంబు.

గీ. అందుపై నుత్తమాయుష్మికార్హ్య పరమ
పూతమైనట్టి మునివేషమును ధరించి

కాని; వృద్ధుఁడౌ మనతండ్రిగారిఁ జంపఁ
బూన, నీకు సరిపడకపోయెనొక్కొ ?

గీ. ఈ బ్రతుకుఁ గర్మమున, దరియింపనింక
నొకబ్రదుకిచ్చి, తన శాశ్వతోద్గతులకుఁ
బ్రాపు మన మనుకొనుతండ్రిఁ బ్రదుకు నూడఁ
బెఱకనుండి వాతనిమేలు మఱవఁ దగునె ?

గీ. దైవమును దూషణసేయు దైవమోర్చు
కొనును కన్నట్టిదేవునిఁ గొడుకు పరిభ
వింప. భగవంతుడే సహింపఁడయ్యె
కొడుకునకుఁ దండ్రి దైవాధికుండు గాఁడె ?

గీ. కల్లుఁద్రావినకంటె మైకమును జేయు
గాఢకోపాప్తి నంటిని కాని వెన్నె
బట్టమెడఁ జుట్టుకొని తండ్రిపాదములను
బడినగాని చూడను నీనువదన మింక.

లక్ష్మ - (అపవారించి, లెంపలు వైచుకొని) రామచంద్రా! బుద్ధి పొరబడినది క్షమింపుము.

రామ - (అపవారించి) నిన్ను క్షమించునది నేను గాను తండ్రిగారు.

లక్ష్మ - (బట్ట మెడఁ జుట్టుకొని)

గీ. ఒడలు కాలి, యహంకృత్యంబు నుడిగి, బుద్ధి
గడ్డిఁ దిని బ్రేలితిని దయాకంధి నగుచు
నన్ను క్షమియింపుతండ్రి! లేనన్నఁ దలను
బగులగాఁ గొట్టుకొని మృతిఁ బడయనుంటి.

వశి - లక్ష్మణా! ఇంతకుముందు నీవు తలఁచుకొనినపనికి నీవు శక్తిహీనుఁడ వైనప్పుడు నిన్ను క్షమింపకపోవునా? నీవందుల కసమర్థుడవనే యూహింతును.

రామ - (అపవారించి) చూచితివా? దయాసముద్రు డగు తండ్రిగారిపై నీ వెంత తీవరించితివి?

గీ. ఇంతచేసిన నిన్ను క్షమించె నీతఁ
డిట్టి; తండ్రికొడుకులలో నెట్టియు భేద
మిదియె; పితపైని గలుగు సుతుదయకంటె
తండ్రికి సుతరాగము వేయితడవ లెచ్చు

దశ – రామ వనయానమును జూడవచ్చిన యోపురజనులారా! మీకందఱ కొక విజ్ఞాపనమును జేసికొనుచున్నాఁడ, దయతో నాలింపుడు.

వసి – దశరథా! అతివిచారమున మునుఁగఁదగదు.

దశ – గురువర్యా! విచారహరణమునకే ప్రయత్నించుచున్నాను ఓ మహాజనులారా!

సీ. శ్రీరామపట్టాభిషేకంబు సేవింప
వచ్చిన మీకంటఁ జిచ్చుఁ బెట్టి
నాఁడఁ, బాపాత్ముఁడ, నను వధించినఁ బాప
మంటదు; చంపుడీ? యార్యులార!
ఊరకుంటి రిదేల? యొక్క చేపాటిక
ర్రయునైన వైవఁగా రాదె? యెన్ని
త్రాళ్లున్నవట, నొక్క త్రాతిని విసరి నా
గ్ధకకంపమానశిరంబు నూడఁ
గీ. గొట్టరాదె? పెద్దకొడుకు నెట్టియెనుటఁ
జచ్చుభాగ్యము నొందంగనిచ్చి యతుల
సుకృతమును గట్టుకొనరాదె! చూతురేల?
మీరు! మీరు! మీరును మీరు మీరు. (ఏడ్చును)

(నేపథ్యమున) అంతపని మావలనఁ గాదు. సర్వతంత్రస్వతంత్రురాలైన కైకేయినే యందులకై వేడుకొనుము.

సుమం – మహాప్రభూ! క్షమింపుము. జనుల మహాకలకలమంతయు దగ్గెను. గానియెవ్వడో యొకడు జనసంఘమునుండి కానరాకుండ నిట్టివంకరమాటననినాడు.

దశ – తప్పేమియులేదు. వానిమాట వంకర కాదు. దానిబుద్ధి వంకర; నా చేష్ట వంకర.

రామ – ఓజనులారా! మీకు నమస్కారము. నాతల్లిదండ్రుల నెంతమాత్రము దూషింపకుడు. వారు సత్యశీలురు. సత్యపరిపాలనమునకైకన్న పెద్దకొడుకునైన నన్ను త్యజించుచున్నారు. అట్టి మహా సాహసకృత్యము మీలో నెవ్వరైన జేయగలరా? మావంశమున బూర్వ మెన్నడో హరిశ్చంద్రు డొనర్చినాడు. ఇట్టి సత్యమూర్తియైన వృద్ధచక్రవర్తి లక్షజిహ్వల గొనియాడుటకు మాఱుగా నిందించుచున్నారా? ఓ జనులారా! ఇప్పుడైన దప్పు గ్రహించుకొందురా?

(నేపథ్యమున) రామభద్రా! మహావైభవసమన్విత మహారాజ్య పదవి నత్యుచ్ఛ్రయముగ నుండవలసిన నీవు కాఱడవిలో నతి నీచమైన నిర్వైభవస్థితి నుండవలసి వచ్చినదని దుఃఖముచే నటు లంటిమి, క్షమింపుము.

రామ — ఓ మహాజనులారా!

సీ. సృష్టియంతయు నొక్క చిత్రనాటక మిందుఁ
గల్గు పాత్రములలోపలను భూపుఁ
డని ఘనతయు భృత్యుఁ డని న్యూనతయును లే
దింతైన; వాఁడితఁ డితఁడు వాఁడు
కాలానువశమునఁ గానవచ్చు; నెవ్వఁడే
వేషానఁ దనకథ వినికి బాగు
గాఁ జేయు నాతఁడే ఘనుఁడు; సామాజికుల్
దేవత ల్గనకు; నా భూవరసుత

గీ. వేషమైనది; మునికథ వినికి జేయ
నుంటిఁ బైయంకమున! నింతె యుర్విజదుల
బ్రదుకు! గంధమొ బుగ్గియో ప్రాణి యొక్క
గంతిడి తెర దాఁటి చనుటకంటె కలదె?

వసి — ఆహా రామభద్రా! వైరాగ్యమూర్తివై ప్రకాశించుచున్నావు.

కౌస — నాయనా నాయనా ఎంతబుద్ధిమంతుడవోయి నాయనా (ఏడ్చును.)

దశ — రామభద్రా

గీ. జనులు కొందఱు చంద్రాస్తసమయమందు
జత్తు, రేను జావను రామచంద్ర! నీవు
వనికిఁ బోవుదనుక; మృతి బడసి దుఃఖ
శాంతినొందెద వెంటనే చనుము వనికి (ఏడ్చును)

కౌస — సుమి రామ రామ రామా

రామ — (అపవారించి) సుమంత్రుడా నీవు పోయి రథము మంగళవాద్య హర్మ్యయమ్ముక్రింద నుంచుము. మేమిప్పుడే వత్తుము, మాతండ్రిగారి దుఃఖమును నేను జూడలేకున్నాడను.

సుమం — చిత్తము. (నిష్క్రమించును.)

రామ — సీతా లక్ష్మణా మీ రిద్దఱు నావెనుక నుండుడు. గురుమాతా పితలకుఁ బ్రదక్షిణ మాచరించి నమస్కరింతము. (అటుల చేయుచున్నారు)

గురూత్తమా! నమస్కారము. తమ శ్రీపాదదర్శనస్పర్శనలాభము నాకు తిరిగి యెన్నడు కలుగునో?

కైక — (తనలో) అప్పటి కాయన, నీవు, బాగుగా నున్నయెడల బదు నాలుగు సంవత్సరములకు.

వసి—రామభద్ర ; చిరాయురస్తు.

గీ. మునులు నీదివ్యమంగళతనువు ననుభ
వింపఁ దపియింత్రు వారిఁ దరింపఁజేసి
యసురులను జంపి దేవకార్యము నొనర్చి
శ్రీసనాథుఁడ వగుచు వచ్చెదవు వేగ

రామ—అమ్మా ! నమస్కారము.
(అపవారించి)

సీ. నను నింతగాఁ జేసెనని నీవు సవతిని
చిత్తమందైన దూషింపకమ్మ
వార్ధకమున సుతవ్యథ గల్గుతండ్రిని
జేతులఁ బెట్టి పోషింపు మమ్మ
భరతరాజును రామభద్రుఁగా భావించి
వేడ్క నాతనిని దీవింపు మమ్మ
ననుఁ బాయుచింతచే నవయు నాభృత్యుల
వ్యథ మాన్పి కృపను గాపాడుమమ్మ,

గీ. కానసంధ్యల మన్న మస్కారములను
నిందు గ్రహింపు మమ్మ "నాచందమామ"
యనుచు నీ వనుచుండు సీతను మఱి నను,
బరమ వైరాగ్యవృత్తిని మఱవు మమ్మ.

కౌస—(కౌగలించుకొని) నాతండ్రీ ! నాతండ్రి ! వెళ్లెదవా వెళ్ళెదవా ? అయ్యయో ! ఈ మాయపట్టాభిషేకము మూలమున నిన్నటి సాయంకాలమునుండియు నీవు భోజనముకూడ లేవయ్యెను. ఈ యొక్కపూఁట నీతల్లిదండ్రుల పంక్తిని గూరుచుండి భోజనముచేసి మఱి పోరాదా నాయనా ?

వసి—కోసలాత్మజా ! ప్రయాణమగువారి నటులు కోరఁగూడదు.

సుమి—అక్కా ! ఈదినమునఁ జంటిపిల్లలు పాలు త్రావలేదు. పశువులు నీరు త్రాగలేదు.

రామ—అమ్మా ! తిరిగి నమస్కారము, నాకు సెలవిమ్మా.

కౌస—నాతండ్రీ ! నీకులదేవతలు నిన్ను రక్షింతురు గాత ! వసిష్ఠులగు మహర్షులు నిన్నుఁ గాపాడుదురు గాక ! విశ్వామిత్రదత్తములగు దివ్యాస్త్రములు నిన్నోమఁగాక ! బ్రాహ్మణమహాశీర్వాదములు నిన్ననుసరించు గాత. సూర్యాదినవగ్రహములు, పంచభూతములు, షడృతువులు నిన్ను సర్వదా రక్షించుఁగాక, నాయనా! వెళ్లెదవా !

అయ్యో! సీతమ్మతల్లీ! నీకు నిట్టిగతియేనా? ఓ భూదేవి! పవిత్రురాలగు నీకూతు నాకొడుకునకుఁ జేసికొని కోడలిని వనమునకుఁ బంపించుచున్నాను. ఈ నిర్భాగ్యురాలగు నాకుఁ గొంచెము దారియిచ్చి పాతాళమునకుఁ ద్రోయవా?

సీతా—అత్తా! నమస్కారము, విచారింపకుడు పోయివచ్చెదను. సెలవిండు, మాగదిలోనుండు రెండు పెంపుడుచిలుకలను మీరు రక్షించుచుండవలెను.

కౌస—అయ్యో! ఈచిలుక పిల్లజంట నింక నెవరు పోషింతురే మాతల్లి! నీభర్తకు సహాయురాలవై సుఖముగానుండుము. వనములోఁ గానబడిన చిత్రవస్తువులవి యివి తెమ్మని తఱుచు నీపతిని గోరకుమా. లక్ష్మణా! చిన్నతనము నుండియు రామభద్రునితోడనే సర్వదా కలిసియుంటచే నీకు నిప్పుడు రామభద్రునితోడి గతియే పట్టినదా?

రామ—(కైకేయివంక తిరిగి) అమ్మా నమస్కారము, నేను సెలవు తీసికొందును.

కైక—నే నిదివరకే యిచ్చితినిగదా!

రామ—భరతు డీసమయమున లేకపోవుటచే నాకుఁ జింతగనున్నది. అతఁడు వచ్చినపిదప నేను వనవాసమునకుఁబోవుచు నాతని బిగ్గఁగౌఁగలించుకొంటి నని చెప్పుము. ఇదియుగాక యీ మాటగూడ జెప్పుము.

గీ. "రాముడనువాఁడు జన్మించి ప్రాకటముగఁ
బెరిఁగె ననుమాటయే కాని వృద్ధుఁడైన
తండ్రిగారిఋణముఁ దీర్ప దగినపెద్ద
కొడుక వీవౌదు; తమ్ముఁడా! గురువరేణ్య!"

సీతా—అత్తా! నమస్కారము. పోయెదను.

గీ. శ్రమపడఁగ లేవు వలదని చాల చెప్పి
నను వినక కూడవచ్చుచున్నాఁడు తమ్ము
డితని నాప్రాణసమముగా నెన్నుకొందు
నమ్మ దయయుంచి వెడలుట కానతిమ్మ.

కైక—సరే.

రామ—(సుమిత్రయొద్దకేగి) అమ్మా! నమస్కారము.

సుమి—రామభద్రా! సీతాసమేతుఁడ వైన నిన్నే నేను వదలుకొనుచుండఁగ నిఁక లక్ష్మణుని వదలుకొనలేకుందునా?

వసి—(తనలో)

గీ. కనినసుతున్నికై సవతిబిడ్డను వనమున
కనిపె కైక; సవతి బిడ్డకయి కనినసు

తని వని కనిపెడు సుమిత్ర తుల్యహీన
చరిత నిన్నాత్రిఁ గొనియాడ సాధ్యమగునె ?

కైక—(తనలో)మాలకు రెండు వర్జ్యములవలె సుమిత్రకుఁ గొడుకులిద్దరు కారా? ఒకడుపోయిన నింకొకడుండును. విచారమేల ?

సుమి—నాయనా ! రామభద్రా ! ఈకోటలో ననేకులు స్త్రీలుం బురుషు లున్నారు. పురుషులలో లక్ష్మణునికి, స్త్రీలలో జానకికిమాత్రమే నిన్ను సర్వదా కాంచి సంతసించుభాగ్యము తటస్థించినది. మాతాపితృతుల్యులగు మీ పరిచర్యఁ జేసి కృతార్థతను బొందుటకే లక్ష్మణుఁడు మీవెంట వచ్చుచున్నాడు. లక్ష్మణా! నీవు నోటిదురుసుఁదనపువాడవు! జాగ్రత్తసుమా !

సీత—అత్తా నమస్కారము. పోయెదను.

సుమి—సీతమ్మతల్లి ! రాఘవునికంటె లక్ష్మణునికంటె నూర్మిళకంటె నీవే నాకుఁ బ్రియతరపదార్థమ వైతివితల్లి !

రామ — (దశరథునియొద్దకువచ్చి) తండ్రి ! (పైకిమాటాడలేక చేతులుజోడించుకొని కన్నీరు గ్రుక్కుకొనును.)

దశ—(కౌగలించుకొని)అడవికిఁ బోవుచు నీవు నాకు నమస్కరించితివి. ఐహిక వాంఛాలేశదూరుఁడ వైన నిన్ను నే నేమని దీవింపగలను?

సీ. సర్వమంగళగుణసంపూర్ణుఁ డగునిన్ను
నరుడు దేవునిఁగాఁగ నరయుఁగాత !
రామనామము భవస్తోమభంజనదివ్య
తారకనామమై తనరుఁగాత !
పదికొంపలును లేని పల్లెనైనను రామ
భజన మందిర మొండు వరలుఁగాత !
కవులెల్ల నీ దివ్యకథ నెన్నొరీతులఁ
గొనియాడి ముక్తిఁ గైకొంద్రుగాత !

గీ. ఎట్టివారితయు శ్రీరామ చుట్టఁబడక
వ్రాయఁబడకుండుఁగావుత! రామవాక్య
మనినఁ దిరుగని దని యర్థ మగునుగాత
రామ! రామ! రామా! రామ! రామ! రామ!

వసి – (తనలో) ఆహా ఎట్టి పరమార్థవాక్యములు వినఁ బడెను?

గీ. బ్రహ్మసంధాయిదివ్యర్షి వదసతతిని
యత్నశూన్యత వేదాక్షరాళి యుబికె

నట్లు శ్రీరామనిశ్చలధ్యానపరుఁ డి
తనిముఖమునుండి సత్యవాక్తతి జనించె

లక్ష్మ – తండ్రీ నమస్కారము. నాకు సెలవిండు.

దశ – వత్సా! రామభద్రసేవచేఁ గృతార్థుడ వైతివి. పొమ్ము.

సీత – మామగారూ, నమస్కారము.

దశ – రామభద్రా, శీతమ్మకుఁ గప్పిన యీ నారచీర ముందుగ వేసివేయుము. తల్లీ, జానకీ ఈ పదునాలుగు వత్సరములు నీకు గావలసి యాభరణములను వసనములనుగూడ రథముపై నుంచుమని సుమంతునితో జెప్పితిని. నీవు నీపతి ననుసరించి కృతార్థురాలవుగమ్ము. (సీతకుఁ గప్పిన నారచీర రాముఁడు తీయును.]

రామ – ఓమాతాపితృపరిచారకులారా, నేను మిమ్మెప్పుడైనఁ బొరిమాదికముగ ననాదరణ మొనర్చియుండినయెడల మీరు నన్ను మన్నింపుఁ.

(నేపథ్యమున నేడ్పు) అయ్యో, అయ్యో, అయ్యో రామా, రామా, రామా;

రామ – పరిచారకులారా – దుఃఖింపకుడు. లక్ష్మణా, శీతా. పోదుమురండు.

(నిష్క్రమింతురు.)

దశ
కౌస } రామా; రామా; (వీడ్చుచుఁ గూడఁబోవుదురు.)
సుమి

వసి – దశరథా: ఆగుము.

దశ – నన్నుఁ గాదు రాము నాఁగుమనుము, రామా, రామా, ఆఁగవా ? ఆఁగవా ? సుమంత్రుఁడా; రథ మాఁపవా ? రామునితో నొక్కమాటఁ జెప్పెదను. అయ్యో ! (బిగ్గఱగ) రామా; రామా; (క్రిందఁబడును.)

వసి – (దశరథుని లేవనెత్తి) రాజేంద్రాః ఊఱడిల్లుము.

దశ – సుమంత్రుఁడా; నా రామచంద్రు డేడీ ?

వసి – దశరథా; నేను వసిష్ఠుడను; మనసుం గుదుటబరచుకొనుము.

కైక – భగవానుడా; మీవలన నేమగును ? నేను నాయింటికి శితనిని దీసికొనిపోయెదను. (దశరథుని సమీపించి) నాథా; నాథా; రమ్ము పోవుదము.

దశ – రామునియొద్దకేనా ?

కైక – ఇంకను రాముఁ డెక్కడ ?

దశ – నీవా ? దుష్టురాలా, రామునడవికిఁ బంపి నీయింటికి నన్నుఁ దీసికొనిపోనెంచితివా? ఛీ; పొమ్ము. గురూత్తమా, ఎచ్చట నున్నావు ?

వసి – ఇదిగో; ఇక్కడ.

దశ – నే నతిశీఘ్రముగ మృతినొందుట నిశ్చయము. నా శవమునైన నీపాపాత్మురాలంటగూడదు. మీరీసంగతి జ్ఞప్తియుంచవలెను. కన్ను లగుపడుట లేదు. కౌసల్య యేదీ ?

కౌస - నాథా! ఇక్కడ నున్నాను.

దశ - నేను రామునితోఁ బోలేకపోయినను నా దృష్టి యాతని ననుసరించి పోయినది. అదియే నాకు మహాదృష్టము. నన్ను నీయంతఃపురమునకుఁ దీసికొనిపొమ్ము; నీకు నమస్కారము.

కౌస - చిత్తము. (పట్టుకొని నడిపించును.) అపవారించి భగవానుడా, మహారాజుగారికి దృష్టిపోయినట్లే మతిగూడ చంచలించినట్లున్నది. ఈయన ప్రాణము లీదినమున నిల్చునని తోఁచదు. మీ రాశ్రమమునకుఁ బోక మావెంటనే రండు.

వసి - అలాగే (తనలో)

గీ. మూఁడవగ్రహంబు మారకంబునకుఁ దగిన
దందులో మొండియైన ఛాయాగ్రహంబు
నంతరము వచ్చి దీనిసాహాయ్యమునను
నిశ్చయముగ మారక మది నెరవుఁగాదె.

అని గోచారరీతి నతిసన్నిహితమగు తన మరణమును నిన్ననే యీ మహారాజు సూచించినాడు. గోచారరీతి నట్టి సన్నివేశముగల గ్రహములే సంసారరీతిని బ్రత్యక్షములై గృహాగతములయినపుడు మారకమునకు సంశయము గలుగునా? ఈ మూఁడవగృహిణియే యామూఁడవగ్రహము. మనసుచేతను గాత్రముచేతను మొండియైన యీ మంథరానామక ప్రచారికయే తదంతరచ్ఛాయాగ్రహము. దీని ప్రోత్సాహముచేతనే యీ మహాగ్రహము మారకముఁజేయుటకుసమర్థమైనదియై వెలుగుచున్నది

దశ - గీ. ఒడలుదెలియక పడఁతిపై బడతి నిటులు
కట్టుకొని, కామియై యేఁడు గాడిదయును
గూఁతపై గన్నసుతునిఁ బోఁగొట్టుకొనిన
ముచ్చు దిక్కుమాలినచావుఁ జచ్చుగాఁదె?

వసి - (తనలో) ఉపశ్రుతికూడ నట్టులే యైయున్నది. (ప్రకా) రాజేంద్ర పోదమురండు. (నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.



శ్రీ

# పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## షష్ఠాంకము

ప్రదేశము:— అయోధ్యలో నొక వీధి

[ ప్రవేశము :- సురుచిరుఁడు. ]

సురు - మామిడికాయల నూరఁగాయఁ బెట్టుకొనుట యెఱుఁగుదుము కాని

(నేపథ్యమున) ఏమయ్యా ! తెల్లవాఱకుండనే యూరఁగాయను గుఱించి తలపోయుచున్నావేమి ?

సురు - ఓహో ! నీ వెవడవు ? ఇటురా !

[భ్రమరకుఁడు ప్రవేశించును]

భ్రమ - ఏమో యనుచున్నావు ?

సురు - ఏమియున్నది ! మామిడిగాయల నూరఁగాయఁ బెట్టుకొనుట యెఱుఁగుదుము కాని మనుష్యుల నూరఁగాయఁబెట్టుకొనుట యెచ్చటనైన వినియుంటిమా ?

భ్రమ - హరిహరీ ! దశరథుని మృతకళేబరమును తైలభాండ నిక్షిప్తముఁజేసి నందుల కిటు లనుచుంటివా ?

సురు - కాయరీతిగా వేసినట్లా ? లేక ముక్కలుకొట్టి బావకెక్కించినారా ?

భ్రమ - మృతులను, మఱి యందుపైఁ బ్రాహ్మణులను బొత్తిగ దూషింపఁ గూడదు.

సురు - నేనుమాత్ర మెఱుఁగనా? కాని మహారాజుగారి కుంభీపాకములో నొక సంవత్సరమైన నుండఁదలచినట్లేనా ?

భ్రమ - అయ్యో ! అంతకాలమింక నెందులకు ?

సురు - పాతబడి పథ్యమున కక్కఱకు వచ్చును.

భ్రమ - భరతుఁడు మాతామహగృహమునుండి యింతకుఁబూర్వము రాకపోవుట చేత నిన్నిదినము లీరాజకళేబరమున కగ్ని సంస్కారములేకపోయెను. ఆ భరతశత్రుఘ్నులిప్పుడే వచ్చిరి. కాన దెల్లవాఱినతరువాత దహనాదిక్రియలు జరుగనైయున్నది.

సురు - భరతునికి బితృమరణమునుగూర్చి యింతకుఁ బూర్వమందు దెలిసెనా ?

భ్రమ - కోటలోఁ బ్రవేశించువఱకుఁ దెలిసియుండదు.

సురు - రామలక్ష్మణ వనవాసమును గుఱించియో ?

భ్రమ - తెలియదు.

## షష్ఠాంకము

సుర — అటులైన నిప్పుడు భరతుఁడేల వచ్చినాఁడు?

భ్రమ — తత్క్షణమున బయలుదేఱి రావలసినదనిమాత్రమే వసిష్ఠుఁడు భరతున కొకలేఖఁ బంపినాఁడు.

సుర — పోనీ! ఱేపు శ్రాద్ధక్రియ లారంభమైన మనకు దాన దక్షిణాదులు దొరకును.

భ్రమ — ఆ - కాని, నీవింక నాలుగుగడియలరాత్రి యుండగనే వీధివెంటఁ దిరుగుచున్నా వేమి?

సుర — ఆప్రశ్నము నిన్నడిగిన నీ వేమిచెప్పెదవో?

భ్రమ - ఉషఃకాలస్నానదీక్ష యున్న నేను సరయూనదికిఁ బోవుచున్నాడ

సుర — నే నీ గ్రామవాసినిగాను. దశరథమరణమును విని నేఁటికాలమునకు జనులభాగ్యము పండినదని సంతసించి సంభావనకై యాశించి, యిచ్చటకువచ్చి యీదినమున దహింతురో ఱేపు దహింతురో యని గుడ్లు మిటకరించుకొని యేడుదినములనుండి కనిపెట్టుకొనియున్నాను ఏమో! చచ్చినవారితో పాటు సంభావమునకువచ్చినవారు చచ్చుటెందులకని పొరుగూర శ్రమపడలేక ప్రాణమువిసిగి స్వగ్రామమునకు బయలుదేఱినాఁడ. ఆజీవునకు ఘటవిముక్తియైనది. కాని, యాతని ఘటమునకుమాత్ర మింతదనుక యీయవాంతర ఘటవిముక్తి కాకుండ వసిష్ఠబ్రహ్మజాగ్రత్త పెట్టినాఁడు.

భ్రమ... ఱేపు కానున్నదికాదా?

సుర - అటులైన నదృష్టవంతులమే. భరతుఁడు వచ్చినతరువాతనైనఁ గాకుండునా? ఈసరి కాఁతడు తనతల్లిగారిని జూచుచుండును గాఁబోలు!

భ్రమ - ఆ - నేను నదికిఁ బోయెదను.

సుర - ఇప్పటినుండి చేయుపని యేమున్నది? అక్కడ రాజవాహనము లేచుసరికి నిక్కడ నేను లేవలేకపోదునా? కాన నేను నదికిఁ బోయెదను.

(నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

ప్రదేశము:—కైకేయి యంతఃపురము

(ప్రవేశము:—భరతుఁడు, కైకేయి)

కైక - (కనుల నీరుగ్రుక్కుకొని) ఏమియు లేదు నాయనా!

భర - (ఆందోళనముతో) నాయనగారికి జబ్బు చేసినదా యేమి?

కైక - అబ్బే! రుగ్మతయేలేదు నాయనా!

భర - పోనీ బాగుగ నున్నారుగద!

కైక - లేదు రోగ మెంతమాత్ర మున్నట్లేలేదు. వార్ధకముచేఁగలిగిన నీరస మనుకొంటిమి. అబ్బబ్బ! తగనిపలవరింతలుగద! దేహమున జ్వరములేదు. అదేమి ప్రారబ్ధమోకాని, యాదినము మొదలు దృష్టి సంపూర్ణముగ నశించినది.

భర - ఏదినము మొదలు?

# పాదుకాపట్టాభిషేకము

కైక - రోగ మారంభమైనదినము మొదలే నాయనా!

భర - అమ్మా! ఇంతకుమునుపు రోగము లేదంటివి. ఇప్పుడు రోగారంభమున నుండి యనుచుంటివి! నాకుఁ గంపమెత్తుచున్నది; చెప్పుము.

కైక - పెద్దలకు రోగమేమిటి తండ్రీ! (కన్నుల నీరు గ్రుక్కుకొనును.)

భర - నేను గనులఁజూచుట కింతవఱకు మా నాయనగారి తనువునిలిచి యున్నట్టే కద!

కైక - ఆ! ఉన్నది. ఏమియుండుట తండ్రీ అదియు నొకయుండుటలోనిదేనా తండ్రీ! (కనుల నీరు గ్రుక్కుకొనును)

భర - పోనీ! నేను చూచివత్తును కూడదమ్మా.

కైక - నాయనా! తొందరపడకుము. ఇప్పుడు మనముపోయిన లాభముండదురా తండ్రీ! (కనులనీరు గ్రుక్కును.)

భర - ఏల?

కైక - వసిష్ఠభగవానుఁడు వచ్చినఁగాని మీతండ్రిని పైకిఁదీయువారెవ్వరు? (ఏడ్చును)

భర - పైకిఁ దీయుటయేమి? ఎక్కడనుండి?

కైక - తైలఘటమునుండి నాయనా! (ఏడ్చును.)

భర - (గుండెలు కొట్టుకొని) అయ్యో! అయ్యో! తండ్రిగారు మరణించిరా? అయ్యయ్యో! తండ్రీ! (ఏడ్చును.)

కైక - తండ్రీ! ఊరకుండుము. చెప్పినమాట విని యూఱడుము. విచారించిన లాభ మెంతమాత్రమును లేదు.

భర - హా! తండ్రీ! నీ వెంతశీఘ్రముగ నోగిగిపోతివి! నీ యవసానకాలమున నీయొద్ద నుండలేకపోయిన నేనును శత్రుఘ్నుఁడు నెంత దురదృష్టవంతులము!

కైక - నాయనా! ఆవిషయమున నన్నదమ్ముల నలుగురియదృష్టము లొక్కతీరుననే యున్నవి.

భర - అదేమి? రామలక్ష్మణులు తండ్రిగారియొద్ద లేరా?

కైక - ఉన్న నింతకర్మమేల? తండ్రీ మహారాజును తైలఘటమునుంచనేల?

భర - పితృదర్శనము నాకీవిధమునైనఁ గలుగఁజేయుట కాతని కిటులు చేసి రనుకొనుచున్నాను.

కైక - అదియుఁ గొంత నిజమే.

భర - హా! రామలక్ష్మణులుకూడ నాయనగారియొద్ద లేరా? ఎక్కడకు పోయిరి?

కైక - సీతతోఁగూడ వనమునకు,

భర - వేటకై పోయిరి కాఁబోలు! హా తండ్రీ! హా తండ్రీ! ఇంతవాఁడవైన నల్వురి పుత్రులను గాంచి తుద కెంతదిక్కుమాలిన మరణమొందితివి! (గుండెలుకొట్టుకొని

చిత్రిపైనఁ బెట్టుటకు నొక్కసుతుఁడైన నొద్దలేకపోయెనా? హా తండ్రీ! మేమంత నిర్భాగ్యులము!

కైక — కర్మసూత్రమిటు లుండ నెవరేమి చేయఁగలరు?

భర — పితృవశుఁడైన రాఘవుఁడు సీతాలక్ష్మణులతో నిప్పటికైన వనము నుండి తిరిగి వచ్చినట్లేకద!

కైక — వనమునకుఁ బోయినవారెప్పటికైన రాకపోదురా? వేళకు లేకపోయిరని యేడువవలయును గాని,

భర — నిజమే-తల్లీ! నాకిఁకఁ బ్రభుఁడు తాతతుల్యుఁడునైన శ్రీరామచంద్రుని పాదములఁ గొలువఁబోయెదను సెలవిమ్ము.

కైక — (చేతులు పట్టుకొని) ఉండవోయి నాయనా! ఒక్కనిముసము నిలువవోయి తండ్రీ!

భర — (కూరుచుండి)

గీ. నలుగురము నొక్కచోటఁ గౌఁగిళులఁ గూడి
తలలు నేలఁ గొట్టుకొని "హా! తండ్రీ! తండ్రీ!
యిటుల చేసితే" యంచు గొంతెత్తి యొక్క
పఱిని దలపోసికొని యేడ్వవలదె తల్లి!

కైక — సరేకాని, ఎంతవిచారించినను మీతండ్రిగారు తిరిగి వత్తురా? నాకి కేమి పెద్దలు. మహోద్వృత్తవంతులు, చిరకాలజీవులు, అనాయాసత్యక్తజీవులు, అననుభూతదైన్యభావులు మీకుమాత్రమేమి తండ్రీ! విద్యాబుద్ధులు నేర్చినవారు, వయసు వచ్చినవారు, భార్యలతోఁ గాపురములను చేయుచున్నవారు, రాజ్యతంత్రము నెత్తిపైఁ బడినవలీల నిర్వహింపదగినవారు. ఎటువచ్చినను పసుపుత్రాళ్లు తెగి మూలఁగూర్చున్న మాకర్మము గాని మీకేమి నాయనా! కంటఁ దడివెట్టకు — ఇటు చూడు!

భర — (తలయెత్తి) ఏల?

కైక — మీతండ్రిగారు తన ప్రాణప్రయాణకాలమున నాతో రహస్యముగ నేమనిరో నీ వెఱుఁగవుగదా?

భర — అమ్మా! వినుటకు సంభ్రమపడుచుంటిని.

కైక — చెప్పెదను దుఃఖమును వదలివిను. మరణించినవారితో మరణింతుమా? నాయనా! ఏదో ముందుమార్గమునఁ జూచుకొన నక్కఱలేదా?

భర — ఎందుల కీయుపోద్ఘాతము చెప్పరాదా?

కైక — "భరతుఁడు రాకపోయెనే" యని పరితపించుచు మహారాజు ప్రాణములు విడిచినాడుసుమా? (కన్నులనీరు గ్రుక్కుకొనును.)

భర — భరతుఁడు — వచ్చుభరతుఁడు — వచ్చిననేమి? రాకపోయిననేమి? కర్మాధికారియుఁ దండ్రిగారి కుత్తమలోకములనీయ సమర్థుఁడును జగదేకపవిత్రుఁడును-

కైక — అబ్బ! అట్టిరాఘవుఁడు మంచివాఁడేవయ్యా! కాదన్నవారెవరు? అతని మాత్ర మనేకవిధముల నవసానకాలమున స్మరింపలేదని చెప్పితినా? ఎవరియోగ్యతా యోగ్యత లెటులున్నఁ దండ్రిగారికి నల్వురిపుత్రులయందు సమానానురాగమే గదా! అందుపై — మఱియొకమాట - నీవెఱుంగని దేమున్నది? — నాసుతుఁడవగుటచే నీయం దుఁ బ్రేమ మత్యధికము. 'భరతుఁడు వచ్చియుండినయెడల, భరతుఁడు వచ్చియుం డినయెడల నాకుఁ గొంతైనంత కార్యముకూడ నాచేతమీఁదుగ జరిగించి కృతార్థుడనై పోదునుగదా" యని యావృద్ధ మహారాజు కన్నుల నీరు పెట్టుకొని-

[కన్నీరు గ్రుక్కును]

భర - ఆ స్వల్పకార్య మేదియో చెప్పుము.

కైక - నాకుఁ జెప్పశక్తిలేదు, నీవు, బుద్ధిమంతుడవైన నీవు, వినక తీరదు. నాయనా! ఇటురా! నాతొడపైఁ గూరుచుండుము.

భర - అక్కఱలేదు. ఇటఁ గూరుచుందును.

కైక - నాయనా! నేను జెప్పినట్లు మాతృభక్తిగలవాఁడవై యాచరించెదవా?

భర - ఆచరణమునకు ముందు చెప్పుట యావశ్యకముకాదా! అదేదో ముందు చెప్పుము; చేయదగియున్న దరువాతఁ జూచుకొన వచ్చును. (తనలో) ఏదో కీడు మూఁడె నని మనసులో నాందోళనము కలుగుచున్నది.

కైక - "చేయదగియున్న" యను సంశయమేల తండ్రీ! నీ తండ్రిగారి యవ సానకాలవాంఛ నీవలన నెఱవేర్పఁబడదగనిదై యుండునా? అనేక తీర్థముల సేవించి, లెక్కలేని దానములఁజేసి అమితోపవాసక్లేశమున నవసి, నిన్నుఁగని, నవమాస ములు కష్టములఁబడి మోసి, నిన్నుఁగాంచి, కుడిచేయి యెడమచేయి యనక నిన్నుఁ బెంచి యింతవానిని జేసినతల్లి నీవైశ్వర్యకాముఁడవై యనితరసాధారణ వైభవసముగ్రుండవై, దీర్ఘాయుష్మంతుడవై, పరిపూర్ణ యశస్సాంద్రుఁడవై సంతానవంతుడవై, నీతండ్రిగారి బోలెఁ జిరకాలము నీవు భూమిపైఁ దేజశ్శాలివై యుండవలయునని యనేక దైవముల గొల్చు నీతల్లి - యైన నాచిరకాల మనోరథమును - నాతండ్రీ - నీకు నెఱవేర్పకూడని దగునా? అదిగాక దానినే తెలుపు వసిష్ఠభగవానుఁడు నీకుపదేశింపఁదలచియున్నాఁడు. వారి యుపదేశము నిరాకరణార్హమైనదగునా? నీకు సందేహమేల?

భర - నాకొకందులకు సందేహము గలదు.

కైక - అదేది?

భర - అదేదియో వెల్లడించుటకు నీకే సంకోచముగనున్నట్లు నాకుఁగనబడు చున్నది. దానిని జెప్పుటకు నీకే నోరురానప్పుడు చేయుటకు నాకెట్లు మనసువచ్చునని సందేహించుచున్నాను.

కైక - (భరతుని సమీపించి కౌగలించుకొని) వెఱ్ఱివాడా! నాకు సందేహ మేమున్నది? పసివాడవు గావున విశేషభారవహనమునకు జంకుదువేమో యని బుజ్జ గించితిని. చిరకాలమంత్రియై నిపుణుఁడైన సుమంత్రుఁడిన్నిటికి నుండఁగ నీకుభయమేమి?

భర - (తొందరతో తల్లియొద్దనుండి యిటువచ్చి) ఆఁ! ఆఁ! అదేమి?

కైక - ఏమున్నది! భూప్రజలు నేఁటికి నీమూలమునఁ దిరిగి ప్రభువును గల వారుగాఁ దలచి కుతూహలమ్మున నున్నారు.

భర - (చెవులుమూసికొని) పాపము శాంతించును గాక! పాపము శాంతించును గాక! జగదేకరక్షాదక్షుండైన రాముడో! సర్వప్రజానయనచకోర చంద్రుడైన రామచంద్రుడో! సర్వప్రజానయనచకోరచంద్రుడైన రామచంద్రుడో!

కైక - ఆతనిని విసర్జించినిన్నే పట్టాభిషిక్తుని జేయుటకు మహారాజు మనోరథము.

భర - (చెవులుమూసికొని) ఎంతమాట వినుటకు బ్రతికియుంటిని! రామ రామ రామా! (ఏడ్చును) సర్వజంతుశాసనపటిష్ఠమగు పంచాననము గల్గగ మహారణ్యాధిపత్యమును గుక్కకుఁగట్టుదురా? ఆ మహామహుని పాదుకలను మోయుటకంటె నా కర్హతలేదే! అయ్యయ్యో! ఆజానుబాహుఁడు, విశాలవక్షుడు; ఆకర్ణాంత నేత్రుడు, సమస్త సద్గుణసమలంకృతుఁడు; సర్వతోముఖస్వతంత్రుడు; మహాత్ముడైన రాముడుండ-

కైక - "ఉండ" ననుమాటయేల?

భర - (అమితమైన తొందరతో) ఆ! ఆ! రాముఁడే లేఁడా! నాకుప్రభుడే లేడా? నాపాలిటి భగవంతుడే లేడా? ఇక నే నేల బ్రదుకుదును?

(తల నేలగొట్టుకొనబోవును.)

కైక - (ఆపి విసుగుదలతో) రాము డిక్కడ నున్నాడా? వనములో నున్నాడు. ఆతని పురప్రవేశమునకు బెద్ద యుపరోధముండుట చేతనే నిన్నేలు మని నే నేడ్చితిని.

భర - వనమునుండి రాఘవుఁడింటికి వచ్చెనని నీదింతకుముందు చెప్పితివికాదా?

కైక - నేను చెప్పలేదు.

భర - రాముని పురప్రవేశమున కభ్యంతర మున్నదా! ఏమీ!

గీ. అఖిలజనులకు నాజ్ఞనీయంగఁ గలుగు
స్వచ్ఛతముఁడైన రాముని కాజ్ఞ యేల?
సర్వపరిమాణకలన ప్రశస్తమైన
కాలమున కొండు పరిమాణలీల కలదె?

(గుండెలు కొట్టుకొని) రామునికి రాష్ట్రత్యాగ శిక్షయే? తప్పు చేయుటయే యెఱుఁగని రామునకు -

కైక - పదునాలుగు వత్సరములు.

భర - రామా! రామా! రామా! (ఏడ్చును) మా నాయనగారే యిట్టిశిక్ష విధించినారా?

కైక - అందులకు మఱెవఁడు సమర్థుడు? అతనికాశిక్షతోపాటు నీకు రాష్ట్రపాలన బహుమానము.

భర - హరిహరీ! హరిహరీ! మాతండ్రియేమి? ప్రాణాధికుఁడైన రాముని విడుచుటేమి? నేను నమ్మను। కోపస్వభావవు, సపత్నీ కాంతాసూయావిలసిత్తవు నీవే యావృద్ధ రాజేంద్రునిఁ బ్రోత్సాహపఱిచి యింత కొంపతీసి యుందువు. నిజము చెప్పు, నిజముచెప్పు. రామా। రామా। (నెత్తిగొట్టుకొని యేడ్చును)

కైక - రాజ్యమో రాజ్యమో యని యేడువక రామా। రామాయని యేడ్చెద వేమి?

భర - ఓదుర్మార్గురాలా। ఓకోపస్వభావురాలా। ఈ దిక్కుమాలిన రాష్ట్రము నా నెత్తిఁగట్టనెంచి, యానవనీతతుల్యాంతఃకరణుని ఆసుందరాకారుని, ఆకృపా సముద్రుని, ఆసుగుణరాశిని, పతీసోదరులతో వనమున కనుపుమని నాతండ్రికి దుర్బోధన మొనర్చితివా? హా వక్రహృదయా। ఎంత ద్రోహ మొనర్చితివి?

కైక - వయఃప్రాదుర్భావ సంపన్నుఁడైన రాజపుత్రున కుండఁదగిన రాజ్య వాంఛ నీకుండదని యెఱుఁగక రాముని పాదములు గొలుచుటతప్ప అంతకంటె నిత రోద్యోగ మక్కఱలేదను బానిసపందవు నీవని యెఱుఁగక, నన్ను రాజమాతను జేసి నా సవతులను కటాక్షవీక్షణముచే నాడించు మహాధికారము నాకొసఁగఁజాలనియాడు పుట్టువని యెఱుఁగక, నేను నీతండ్రిని ప్రోత్సాహపఱచితత్పూర్వదత్తములగు రెండు వరములను - రామవనవాసము మొదటిదిగ, నీపట్టాభిషేకము రెండవదిగ - వాంఛించి గ్రహించితిని. నీవు రాష్ట్రమును సంపాదించుకొనలేవు సరేకదా, నేనార్జించియిచ్చిన దీసికొనలేవు గూడనా?

భర - ఛీ ఛీ లోభాత్మురాలా, ఛీ ఛీ క్రూరురాలా। యీ రాజ్యమును నే నపేక్షించితినని నీతో నెన్నఁడైనఁ జెప్పితినా? ఆహా పరాత్పరుడా। అట్టి నీచోద్దేశగంధము లేశమైన నాహృదయమున స్వప్నమందైనఁ బ్రవేశించెనా? ఓదురాశాపాతకినీ నాకులేని రాజ్యవాంఛ నీ కేల? అయ్యో అయ్యో సర్వజ్ఞుఁడైసమంజసగుణనికురుంబుఁడైన దాశరథి యేలవలయునుగాని...(ఏడ్చును)

కైక - రాముఁడజ్ఞానసంపన్నుఁడు. అందువలన రాజ్యార్హుఁడు కాడు. నీకుఁదెలియదు. నీక్షేమము కొఱకే చెప్పుచున్నానువిను. తగ్వాత జ్యేష్ఠుఁడవు నీవే

భర - అసదగ్ప్రలాపినీ జాత్యంధతాదులు రాజ్యార్హతకుఁ బ్రతిబంధమని యపూర్వ ధర్మశాస్త్ర నిర్ణయోపన్యాసమును జేయుచుంటివా? ఇట్టి ద్రోహవాక్యము లాడిన నీనాలుక ముందులకు ఖండఖండములై రాలిపోలేదోయని నే నేడ్చుచున్నాను.

కైక - తరువాత సావకాశముగ నేడువవచ్చును ఇప్పుడీమాటను విను. పితృ కర్మను నీవిప్పుడు చేయనున్నావు? శ్రాద్ధక్రియ లే పుత్రుఁడొనర్చునో యాతడే తండ్రిసొత్తున కధికారి - తెలిసినదా?

భర - (చెవులుమూసికొని) నోరుఁ గట్టిపెట్టుకొనుము. నేను నీమాటలను వినను. (గుండెలుకొట్టుకొని) అయ్యో అయ్యో అట్టి మహాదారుణ వాంఛలను వెల్లడించి రఘువంశమునకు నాయకమణి యైనవానిని ద్రెంపి యడవిలోఁ ద్రోయించి పెనిమిటిని జంపి, లోకులచేతను గన్నకొడుకుచేత నవియివి యనరానితిట్లు తినుచు

నింకను సిగ్గులేక యిటులు ప్రేలుచు:—నీ విక బ్రదికియుంటివిగాని...ఛీ! రఘువంశ నాశని! ఛీ! నర రూప బ్రహ్మరాక్షసీ! ఛీ! మహాపాతకినీ! నీ మొగము చూడదగునా? (తల త్రిప్పుకొనుచు) తీక్ష్ణస్వభావుడైన సౌమిత్రి కత్తి కెఱగాకుండ నీవింక నెటులు బ్రిదికితివో తెలియకున్నది.

కైక — అతఁడు నన్నుఁ జంపువాఁడా? నే నే చచ్చుటకు సిద్ధముగ నున్నాను. ఇఁక నొక్కమాట చెప్పెదను వినుము. నీవు సింహాసనమెక్కి బోరగిలబడవలయునని నే నీపనిఁ జేయలేదు రామచంద్రుపై ననురాగములోపముచేతఁ జేయలేదు. కౌసల్యపై నాకుఁగల వైరమును దీర్చుకొనుటకే చేసితిని. అందులకే చేసితిని. ముమ్మాటికిఁ జెప్పుచున్నాను ఇందువలనఁ గావలసినంత నింద నాకుఁ గలిగినది. ఇట్టిస్థితిలో నీవు రాజ్యము నే నంగీకరింపనియెడల నాయపకీర్తికిఁ బదునాలుగు భువనములుం జాలవు. కాన, గన్నకొడుకవైనందులకు రాజ్యము నంగీకరించి, నాయప్రతిష్ఠఁ బాపి, నా మర్యాద కాపాడుము. లేదా చచ్చుటకు సర్వసిద్ధముగ నున్నాను.

భర — నాకు రాజ్యమక్కఱలేదు; అక్కఱలేదు అక్కఱలేదు. సరేకదా! జటావల్కములంధరించి మునివేషధారినై రామనామసంస్మరణముఁ జేయుచు నడవికిఁ బోయి యా శ్రీరామచంద్రుని పాదముల నెత్తిపైఁ బెట్టుకొని, యిటకుఁ దీసికొనివచ్చి సింహాసనముపైఁ బెట్టుదును. ఇదియే నా సంకల్పము.

కైక — అటులయిన నే నగ్నిప్రవిష్టనై చావవలసినదేనా?

భర — అటులయిననుసరే, గొంతుకకురిఁబోసికొని చచ్చినసరే! ధనపు సంచులం బైనఁ బడవేయించుకొని నలిగి చచ్చినసరే.

కైక — (ముందుకు నడచి) ఇంతవాఁడవైన పుత్త్రుఁడవు నీ వుండఁగ జంపుకొనుటలోఁగల శ్రమము నన్ను నీవు పొందనిచ్చుట న్యాయమా? నీవే చంపుము కానీ — చంపవేమి? చంపవేమి?

(నేపథ్యమున) అమ్మా నీయెడల నేను చేసిన మహోపకారమునకు "చంపవేమి: చంపవేమి" యని నన్ను వెంటాడించుచున్న యాతని కిట్లు ప్రోత్సాహపఱుతువా?

కైక — (అటుచూచి తనలో) అదేమి? అయ్యో! మంధర భయాక్రాంతయై పర్వెత్తుకొని వచ్చుచున్నది.

భర — "చంపవేమి? చంపవేమి" యని మీఁదిమీఁదికి వచ్చుచున్నావు నిన్ను జంపవలసినదే. లోకోత్పాతకారిణి వగునిను జంపిన పుణ్యమేగాని పాపము లేదు. కాని, యటులచేసినయెడల రామునకు నాపై నేమికోపము వచ్చునోయని యింతగా సందేహించుచుంటిని. నీవలన బాధపడుచున్న రాముఁడే నీ కిప్పుడు ప్రాణరక్షకుఁడయ్యెను.

(నేపథ్యమున) ఛీ! తుచ్ఛురాలా! ఇంతచేసిన నిన్ను ననేక సహస్ర ఖండములుగ గోసెదను.

కైక – (తనలో) అమ్మయ్యో! "నన్నను" అనుచున్నాడు. ఈకోపస్వభావుడు నన్నుగూడ ఖండించునేమో? భరతునికివలె శత్రుఘ్నునికిమాత్రము రామభీతి యుండకపోవునా? కాన, భయము లేదనుకొందును.

భర – అదుగో! తమ్ముడు శత్రుఘ్నుడు మంథరను వెంటాడించి వచ్చుచున్నాడు. ఇదియంతయు మందరాదుర్బోధనము వలనగలిగినదని తెలియుచున్నది.

(మంథర ముందు పశ్చాత్తుగ శత్రుఘ్నుడు ప్రవేశము)

శత్రు—గీ. భైరవైతన్మహోపద్రవమున కాది
కారణంబైన యీవక్రగాత్రి నిదిగో
కండకండలుగాఁ గోసి కావు కావు
మనెడు కాకులఁ కెఱబెట్టుదును మహాత్మ!

భర – ఆహా! తెల్లవారినదికాబోలు! లక్ష్మణానుజా! కావు కావు మని కాకులే యఱచుచుండ మనము కావకుండుట న్యాయమా?

మంథ—భరతరాజేంద్ర! శరణము జొచ్చితిని. సీతమ్ముని వారింపుము.

భర—పలుగాకీ! జగదేక వంద్యుఁ డగురామభద్రుడుండ "రాజేంద్ర" యని నన్ను బిలంతువా?

శత్రు—తప్పుజేసిన దీని నుపేక్షించుట తగవుకాదు, కావున జంపుటకు సెలవిండు. (మంథరజుట్టు బట్టుకొనబోవును.)

మంథ—అమ్మయ్యో! తల్లీ! నీవైన రక్షించుము. (కైకచాటునకు బోవును)

భర – అనుజా! సెలవిచ్చుటకు నీవెంతసమర్థుడవో నేనునంతే సమర్థుడను. మనయన్నగారినిగూర్చి ద్రోహ మొనర్చిన దీనిని శిక్షించుటెడల నాకృపామయునికి మనపై గోపమువచ్చునేమో? మనకాతండ్రిలేడు. తండ్రితరువాత తండ్రియైన జ్యేష్ఠభ్రాత యిచ్చటలేడు. మనకు దండ్రిగారైనను, అన్నగారైనను, దగ్గిరైన, గౌసల్యాదేవియే! దీనినిగూర్చి యామె యనుజ్ఞ యెట్టులో యటు లాచరింపుము.

కై – (అపవారించి) కులటా! "భరతుడు రాజ్యమంగీకరింపడు సుమా" యని నే నెన్నివిధముల జెప్పిన వినక నన్నీతంత్రమున దింపి నాగొంతుగోసితివి. ఛీ పో.

మంథ – (అపవారించి పోవుచు) ఇంతవిశ్వాసవతివైన నీగొంతు గోసిన పాపమే మున్నది? (పోబోవును)

శత్రు – నేను రాకుండనీవెచ్చటకుబోయెదవు? కౌసల్యాదేవియొద్ద కీడ్చుకొని పోయెదను. రా. (ఇద్దఱును పోవుదురు.)

(నేపథ్యమున) శత్రుఘ్నుడా భరతు డెచ్చట నున్నాడు?

(తిరిగి నేపథ్యమున)

వసిష్ఠభగవానుడా! కనుటచేతనే తల్లి యని పిలువదగిన కైకేయియొద్ద నున్నాడు. మీరు దయచేయవచ్చును.

భర—మహానుభావా గురువర్యా

[వసిష్ఠుఁడు ప్రవేశించును.]

గీ. కనినతండ్రిని నామూలమునను జంపి
యడవి కగ్రజు నను(గూర్చి వెడల(గొట్టి
బ్రదికియుండియుఁ జచ్చిన పడఁతియెమట(
జచ్చియు బ్రదికియుంటిని సంయమీంద్ర!

వసి - కాలగతి కెవ రేమిచేయగలరు? విచారింపకుము.

భర - నాకుమరెందులకుసంతాపములేదుకాని, యొకందులకుమాత్రమున్నది.

వసి - ఎందులకు?

భర—గీ. ఈకుటిల చేయుకుట్రలలో నేను(గూడ
నుంటి నని రాముచిత్తమం దుండునేమొ!
యనుచు నేడ్చెద నదె సత్యమైన నిటనె
యిపుడె యీ జీవములు త్యజియించువాఁడ.

అపుడు మీరొక మహోపకారము సేయవలయును

గీ. నాదుతండ్రిశవముతోడ నాకళేబ
రమును( దమ్మునిచేత భస్మము నొనర్ప
బంచి, భరతుఁడు శ్రీరామపాదదాసుఁ
డంచు వనికేగి వచియింపు మతనితోను.

(ఏడ్చుచుఁ గాళ్ళపైఁ బడును.)

వసి - వత్సా రామానుజా లెమ్ము. రామభద్రునకు నీపై నెంత మాత్రము కాలుష్యము లేదు. జరుపకుము.

(నేపథ్యమున) జరుపకు, మంథరా జరుపకు. నేను వచ్చుచుంటిని. శత్రుఘ్నుఁడా ఆఁగు

భర - (తనలో)మాఅమ్మ కౌసల్య చిరంజీవితోడను మంథరతోడనిక్కడకే వచ్చుచున్నది. అయ్యయ్యో ఆమె మొగ మెటుల చూడగలను.

కైక - (తనలో) నేను దీనిని జూడకుండ లోనికిఁ బోయెదను?

(నిష్క్రమించును.)

(కౌసల్య, శత్రుఘ్నుఁడు, మంథర, ప్రవేశించుచున్నారు.)

కౌస - శత్రుఘ్నా మాప్రారబ్ధమంతేయు నిటు లుండ మధ్యమున నిది యేమి చేసెను? దాని నేమియు బాధింపవలదు. విడిచిపెట్టుము.

శత్రు - అమ్మా సరే మంథరా అయినదేదోయైనది. నీవు శిక్షకూడఁ దప్పినది. నీవు రామభద్రునియెడల నంతద్రోహ మేమి కారణమునఁజేసితివో చెప్పుము.

మంథ – శుభము మాచి సహించుట నా స్వభావము కాకపోవుటచేత నటుల జేసితిని. పట్టాభిషేకము ముందుగ భరతునికి స్థిరపరచిన నిటు లభ్యంతర పెట్టుదాననే.

భర – ఛీ. దురాత్మురాలా. నీ గొంతుక కోయదగినదే పో. పో.

(త్రోసి వేయును.)

మంథ – (పోవుచు) నాది కాదు. నన్నింతవంకర జేసినందులకు దేవునిది.

(పోవును.)

భర – అమ్మా నమస్కారము.

కౌస – కైకేయిపుత్రా. నిన్నిప్పుడు నే నేమని దీవింపవలసియున్నది? ఐక్ష్వాక సింహాసనమునఁ బట్టాభిషిక్తుఁడవు గమ్మని మీ యమ్మయే దీవించెను. నీదారికడ్డు కలుగు నేమోయని నా కొడుకును నట్టడవులకుఁ ద్రోసి నీ నిర్విఘ్న రాజ్యప్రాప్తికి మీయమ్మయే దీవించినది. నీవుగాని నీ తల్లిగాని మావంటివారియెడ నిరాదరణమును గనబఱిచినయెడల నిది మీకు నీతి కాదని చెప్పి మందలించుటకుఁ బైన వృద్ధరాజేంద్రు డైనలేకుండ నాతనిని లఘుమార్గముగఁ బరలోకమునకనిపి నీ యథేష్ట పరిపాలన నిరంకుశత్వమునకై మీయమ్మయే దీవించినది. నీవు

భర – (గుండెలుకొట్టుకొని) ఎంతెంతమాటలు వినుటకు బ్రతికియుంటిని. హా! హృదయమా! ఇంకను పగులకుంటివా? హా! రామా! రామా! రామా! రామా!

(మూర్ఛిల్లును.)

శత్రు – (విసరి) అగ్రజా! లెమ్ము.

భర – (లేచి కౌసల్యకాళ్ళపైబడి) అమ్మా! అమ్మా దోషగంధశూన్యుడనైన నన్నేల దూషింతువు నేను చంటిపిల్లవాడనై యుండగ నీవు కరములలోఁ బెట్టి నన్నాడించినపుడు నేనెంత పాపరహితుడనో యిప్పుడుకూడ నంతే యనుకొనుము. రాఘవునియెడల నాకు గలభక్తికి నీ వెఱుఁగవా? తండ్రిగా రెఱుఁగరా? ఈ మహానుభావు డెఱుఁగడా? జను లెఱుఁగరా? నామహాదోష మేదనగ – కైకేయి గర్భమున బుట్టుటయే—

గీ. రామవనవాసమునకు శిరఃపరికంప
నమును జేసిన ఖలుఁడు చండాలుఁ డగుత!
గురుమహాద్రోహి యగు గాత! నరకలోక
శాశ్వతావాస శిక్షార్తి సహితుఁ డగుత!
సీ. అట్టిద్రోహి స్వపుత్రమాంసాశి యగుతఁ
బ్రబలతనుదీర్ఘరోగదుర్భర మహార్తి
భరితుఁ డగుగాత! నోటను పురుగులు పడి
సకలహైన్యంబు భరియించి చచ్చుఁగాత!

ఇంకను —

చివరికైనఁ బెట్టుటకు నొక్కసుతుఁడైన నొద్దలేకపోయెనా? హా తండ్రీ! మేమెంత నిర్భాగ్యులము!

కైక — కర్మసూత్రమిటు లుండ నెవరేమి చేయఁగలరు?

భర — పితృవచనుఁడైన రాఘవుఁడు సీతాలక్ష్మణులతో నిప్పటికైన వనము నుండి తిరిగి వచ్చినట్లేకద!

కైక — వనమునకుఁ బోయినవారెప్పటికైన రాకపోదురా? వేళకు లేకపోయిరని యేమనవలయును గాని,

భర — నిజమే—తల్లీ! నాకిఁకఁ బ్రభుఁడు తాతతుల్యుఁడునైన శ్రీరామచంద్రుని పాదములఁ గొలువఁబోయెదను సెలవిమ్ము.

కైక — (చేతులు పట్టుకొని) ఉండవోయి నాయనా! ఒక్కనిముసము నిలువవోయి తండ్రీ!

భర — (కూరుచుండి)

గీ. నలుగురము నొక్కచోటఁ గౌఁగిళులఁ గూడి
తలలు నేలఁ గొట్టుకొని "హా! తండ్రీ! తండ్రీ!
యిటుల చేసితే" యంచు గొంతెత్తి యొక్క
పజెని దలపోసికొని యేడ్వవలదె తల్లి!

కైక — సరేకాని, ఎంతవిచారించినను మీతండ్రిగారు తిరిగి వత్తురా? వారికేమి పెద్దలు. మహాదృష్టవంతులు, చిరకాలజీవులు, అనాయాసత్యక్తజీవులు, అననుభూతదైన్యభావులు మీకుమాత్రమేమి తండ్రీ! విద్యాబుద్ధులు నేర్చినవారు, వయసు వచ్చినవారు, భార్యలతోఁ గాపురములను చేయుచున్నవారు, రాజ్యతంత్రము నెత్తిపైఁ బడినను వహించి నిర్వహింపఁదగినవారు. ఎటువచ్చినను పసుపుత్రాళ్లు తెగి మూలఁగూర్చున్న మాకర్మము గాని మీ కేమి నాయనా! కంటఁ దడిపెట్టకు—ఇటు చూడు!

భర — (తలయెత్తి) ఏల?

కైక — మీతండ్రిగారు తన ప్రాణప్రయాణకాలమున నాతో రహస్యముగ నేమనిరో నీ వెఱుఁగవుగదా?

భర — అమ్మా! వినుటకు సంభ్రమపడుచుంటిని.

కైక — చెప్పెదను దుఃఖమును వదలివేయు. మరణించినవారితో మరణింతుమా? నాయనా! ఏదో ముందు మార్గమునఁ జూచుకొన నక్కఱలేదా?

భర — ఎందుల కీయుపోద్ఘాతము చెప్పరాదా?

కైక — "భరతుఁడు రాకపోయెనే" యని పరితపించుచు మహారాజు ప్రాణములు విడిచినాఁడు సుమా? (కన్నులనీరు గ్రుక్కుకొనును.)

భర — భరతుఁడు — వచ్చుభరతుఁడు — వచ్చిననేమి? రాకపోయిననేమి? కర్మాధికారి యగు దండ్రిగారి కుత్తమగతులనీయ సమర్థుఁడు జగదేకపవిత్రుఁడు న-

కైక — అబ్బ! అప్పటిరాఘవుఁడు మంచివాఁడేనయ్యా! కాదన్నవారెవరు? అతని మాత్ర మనేకవిధముల నవసానకాలమున స్మరింపలేదని చెప్పితినా! ఎవరియోగ్యతాయోగ్యత లెటులున్నఁ దండ్రిగారికి నల్వురిపుత్రులయందు సమానానురాగమేగదా! అందుపై — మఱియొకమాట - నీవెఱుంగని దేమున్నది? — నాసుతుఁడవగుటచే నీయందుఁ బ్రేమ మత్యధికము. "భరతుఁడు వచ్చియుండినయెడల, భరతుఁడు వచ్చియుండినయెడల నామాత్రమంత కార్యముకూడ నాచేతిమీఁదుగ జరిగించి కృతార్థుఁడనై పోదునుగదా" యని యావృద్ధ మహారాజు కన్నుల నీరు పెట్టుకొని—

[ కన్నీరు గ్రుక్కును ]

భర — ఆ స్వల్పకార్య మేదియో చెప్పుము.

కైక - నాకుఁ జెప్పకతీఱదు, నీవు, బుద్ధిమంతుఁడవైన నీవు, వినక తీఱదు. నాయనా! ఇటురా! నాతొడపైఁ గూరుచుండుము.

భర — అక్కఱలేదు. ఇటఁ గూరుచుండును.

కైక — నాయనా! నేను జెప్పినట్లు మాతృభక్తిగలవాఁడవై యాచరించెదవా?

భర — ఆచరణమునకు ముందు చెప్పుట యావశ్యముకాదా! అదేదో ముందు చెప్పుము; చేయదగియున్న దరువాతఁ జూచుకొన వచ్చును. (తనలో) ఏదో కీడు మూఁడె నని మనసులో నాందోళనము కలుగుచున్నది.

కైక — "చేయదగియున్న" యను సంశయమేల తండ్రీ! నీ తండ్రిగారి యవసానకాలవాంఛ నీవలన నెఱవేర్పఁబడఁదగనిదై యుండునా? అనేక తీర్థముల సేవించి, లెక్కలేని దానములఁజేసి అమితోపవాసక్లేశమున నవసి, నిన్నుఁ గోరి, నవమాసములష్టకష్టములఁబడి మోసి, నిన్నుఁగాంచి, కుడిచేయి యెడమచేయిగాక నిన్నుఁ బెంచి యింతవానిని జేసినతల్లి నీవైశ్వర్యకాముఁడవై యనితరసాధారణ వైభవసమగ్రుండవై, దీర్ఘాయుష్మంతుఁడవై, పరిపూర్ణ యశస్సాంద్రుఁడవై సంతానవంతుఁడవై, నీతండ్రిగారి బోలెఁ జిరకాలము నీవు భూమిపైఁ దేజశ్శాలివై యుండవలయునని యనేకదైవముల గొల్చు నీతల్లి — యైన నాచిరకాల మనోరథమును — నాతండ్రీ — నీవు నెఱవేర్పకూడని దగునా? అదిగాక దానినే అప్పు వసిష్ఠభగవానుఁడు నీకుపదేశింపఁదలఁచియున్నాఁడు. వారి యుపదేశము నిరాకరణార్హమైనదగునా? నీకు సందేహమేల?

భర — నాకొకందులకు సందేహము గలదు.

కైక — అదేది?

భర — అదేదియో వెల్లడించుటకు నీకే సంకోచముగనున్నట్లు నాకుఁగనబడుచున్నది. దానిని జెప్పుటకునీకే నోరురానప్పుడు చేయుటకు నాకెట్లు మనసువచ్చునని సందేహించుచున్నాను.

కైక — (భరతుని సమీపించి కౌగిలించుకొని) వెఱ్ఱివాఁడా! నాకు సందేహమేమున్నది? పసివాఁడవు గావున విశేషభారవహనమునకు జంకెదువేమో యని బుజ్జగించితిని. చిరకాలమంత్రియై నిపుణుఁడైన సుమంత్రుఁడన్నిటికి నుండగఁ నీకుభయమేమి?

భర – (తొందరతో తల్లియొద్దనుండి యిటువచ్చి) ఆః! ఆః! అదేమి?

కైక – ఏమున్నది! భూప్రజలు నేఁటికి నీమూలమునఁ దిరిగి ప్రభువును గల వారుగాఁ దలచి కుతూహలమున నున్నారు.

భర – (చెవులుమూసికొని) పాపము శాంతించును గాక! పాపము శాంతించును గాక! జగదేకరక్షాదక్షుఁడైన రాముఁడో! సర్వప్రజానయనచకోర చంద్రుఁడైన రామ చంద్రుఁడో! సర్వప్రజానయనచకోరచంద్రుఁడైన రామచంద్రుఁడో!

కైక – ఆతనిని విసర్జించినిన్నే పట్టాభిషిక్తుని జేయుటకు మహారాజుమనోరథము.

భర – (చెవులుమూసికొని) ఎంతమాట వినుటకు బ్రతికియుంటిని! రామ రామ రామా! (ఏడ్చును) సర్వజంతుశాసనపటిష్ఠమగు పంచాననము గలుగ మహారణ్యాధి పత్యమును గుక్కకుఁగట్టుదురా? ఆ మహామహుని పాదుకలను మోయుటకంటె నా కర్హతలేదే! అయ్యయ్యో! ఆజానుబాహుఁడు, విశాలవక్షుఁడు; ఆకర్ణాంత నేత్రుఁడు, సమస్త సద్గుణసమలంకృతుఁడు; సర్వతంత్రస్వతంత్రుఁడు; మహాత్ముఁడైన రాముఁడుండ–

కైక – "ఉండ" ననుమాటయేల?

భర – (అమితమైన తొందరతో) ఆ! ఆ! రాముఁడే లేఁడా! నాకుప్రభుఁడే లేఁడా? నా పాలిటి భగవంతుఁడే లేఁడా? ఇక నే నేల బ్రదుకుదును?

(తల నేలగొట్టుకొనబోవును.)

కైక – (ఆపి విసుగుదలతో) రాము డిక్కడ నున్నాఁడా? వనములో నున్నాఁడు. అతని పురప్రవేశమునకు పెద్ద యుపరోధముండుట చేతనే నిన్నేలు మని నే నేడ్చితిని.

భర – వనమునుండి రాఘవుఁడింటికి వచ్చెనని నీవింతకుముందు చెప్పితివి కాదా?

కైక – నేను చెప్పలేదు.

భర – రాముని పురప్రవేశమున కభ్యంతర మున్నదా! ఏమి!

గీ. అఖిలజనులకు నాజ్ఞనీయంగఁ గలుగు
స్వచ్ఛతముఁడైన రాముని కాజ్ఞ యేల?
సర్వపరిమాణకలన ప్రశస్తమైన
కాలమున కొండు పరిమాణలీల కలదె?

(గుండెలు కొట్టుకొని) రామునికి రాష్ట్రత్యాగ శిక్షయే? తప్పు జేయుటయే యెఱుఁగని రామునకు –

కైక – పదునాలుగు వత్సరములు.

భర – రామా! రామా! రామా! (ఏడ్చుచు) మా నాయనగారే యిట్టిశిక్ష విధించినారా?

కైక – అందులకు మఱివేఁడు సమర్థుఁడు? ఆతనికాశిక్షతో పాటు నీకు రాష్ట్ర పాలన బహుమానము.

భర - హరిహరీ! హరిహరీ! మాతండ్రియేమి? ప్రాణాధికుఁడైన రాముని విడుచుటేమి? నేను నమ్మను। కోపస్వభావవు, సపత్నీ కాంతాసూయావిలచిత్తవు నీవే యావృద్ధ రాజేంద్రుని ప్రోత్సాహపఱచి యింత కొంపతీసి యుందువు. నిజము చెప్పు, నిజముచెప్పు. రామా। రామా। (నెత్తిగొట్టుకొని యేడ్చును)

కైక - రాజ్యమో రాజ్యమో యని యేడువక రామా। రామాయని యేడ్చెద వేమి?

భర - ఓదుర్మార్గురాలా। ఓకోపస్వభావురాలా। ఈ దిక్కుమాలిన రాష్ట్రమును నా నెత్తిఁగట్టనెంచి, యానవనీతతుల్యాంతఃకరణుని ఆసుందరాకారుని, ఆకృపాసముద్రుని, ఆసుగుణరాశిని, సతీసోదరులతో వనమునకనుపుమని నాతండ్రికి దుర్బోధన మొనర్చితివా? హా వజ్రహృదయా। ఎంత ద్రోహ మొనర్చితివి?

కైక - వయఃప్రాదుర్భావ సంపన్నుఁడైన రాజపుత్రున కుండదగిన రాజ్యవాంఛ నీకుండదని యెఱుఁగక రాముని పాదములం గొలుచుటతప్ప అంతకంటె నితరోద్యోగ మక్కఱలేదను బానిసపందవు నీవని యెఱుఁగక, నన్ను రాజమాతను జేసి నా సవతులను కటాక్షవీక్షణముచే నాడించు మహాధికారము నాకొసఁగఁజాలనియాడు పుట్టువవని యెఱుఁగక, నేను నీతండ్రిని ప్రోత్సాహపఱచితత్పూర్వదత్తములగు రెండు వరములను - రామవనవాసము మొదటిదిగ, నీపట్టాభిషేకము రెండవదిగ - వాంఛించి గ్రహించితిని. నీవు రాష్ట్రమును సంపాదించుకొనలేవు సరేకదా, నేనార్జించియిచ్చిన దీసికొనలేవు గూడనా?

భర - ఛీ ఛీ లోభాత్మురాలా। ఛీ ఛీ క్రూరురాలా। యీ రాజ్యమును నేనపేక్షించితినని నీతో నెన్నఁడైనఁ జెప్పితివా? ఆహా పరాత్పరుఁడా। అట్టి నీచోద్దేశగంధము లేశమైన నాహృదయమున స్వప్నమందైనఁ బ్రవేశించెనా? ఓదురాశాపాతకినీ నాకులేని రాజ్యవాంఛ నీ కేల? అయ్యో అయ్యో సర్వజ్యేష్ఠుఁడై సమంజసగుణనికురుంబుఁడైన దాశరథి యేలవలయునుగాని...(ఏడ్చును)

కైక - రాముఁడజ్ఞానసంపన్నుఁడు. అందువలన రాజ్యార్హుఁడు కాఁడు. నీకుఁదెలియదు. నీక్షేమము కొఱకే చెప్పుచున్నానువిను. తర్వాత జ్యేష్ఠుఁడవు నీవే

భర - అసదగ్ధప్రలాపినీ జాత్యంధతాదులం రాజ్యార్హతకుఁ బ్రతిబంధమని యపూర్వ ధర్మశాస్త్ర నిర్ణయోపన్యాసమును జేయుచుంటివా? ఇట్టి ద్రోహవాక్యములాడిన నీనాలుక యెందులకు ఖండఖండములై రాలిపోలేదోయని నేనేడ్చుచున్నాను.

కైక - తరువాత సావకాశముగ నేడువవచ్చును ఇప్పుడీమాటను విను. పితృకర్మము నీవిప్పుడు చేయనున్నావు? శ్రాద్ధక్రియ కే పుత్రుఁడొనర్చునో యాతడే తండ్రిసొత్తున కధికారి - తెలిసినదా?

భర - (చెవులుమూసికొని) నోరుఁ గట్టిపెట్టుకొనుము. నేను నీమాటలను వినను. (గుండెలుకొట్టుకొని) అయ్యో అయ్యో అట్టి మహాదారుణ వాంఛలను వెల్లడించి రఘువంశమునకు నాయకమణి యైనవానిని ద్రెంపి యడవిలోఁ బాఱవైచి పెనిమిటిని జంపి, లోకులచేతను గన్నకొడుకుచేత నవియివి యనరానితిట్లు తినుచు

నింకను సిగ్గులేక యిటులు ప్రేలుచు:—నీ వింక బ్రదికియుంటివిగాని...ఛీ! రఘు వంశ నాశని! ఛీ! నర రూప బ్రహ్మరాక్షసీ! ఛీ! మహాపాతకినీ! నీ మొగము చూడదగునా? (తల త్రిప్పుకొనుచు) తీక్ష్ణస్వభావుడైన సౌమిత్రికత్తి కెఱగాకుండ నీవింక నెటులు బ్రిదికితివో తెలియకున్నది.

కైక — ఆతఁడు నన్నుఁజంపువాఁడా? నే నే చచ్చుటకు సిద్ధముగ నున్నాను. ఇఁక నొక్కమాటచెప్పెదను వినుము. నీవు సింహాసనమెక్కి బోరగిలబడవలయునని నేనీపనిఁ జేయలేదు రామచంద్రునిపై ననురాగము లోపము చేతఁ జేయలేదు. కౌసల్యపై నాకుఁగల వైరమును దీర్చుకొనుటకే చేసితిని. అందులకే చేసితిని. ముమ్మాటికిఁ జెప్పుచున్నాను ఇందువలనఁ గావలసినంత నింద నాకుఁ గలిగినది. ఇట్టిస్థితిలో నీవు రాజ్యము నంగీకరింపనియెడల నాయపకీర్తికిఁ బదునాలుగు భువనములు చాలవు. కాన, గన్నకొడుకవైననందులకు రాజ్యము నంకీరించి, నాయప్రతిష్ఠఁ బాపి, నా మర్యాద కాపాడుము. లేదా చచ్చుటకు సర్వసిద్ధముగ నున్నాను.

భర — నాకు రాజ్యమక్కఱలేదు; అక్కఱలేదు అక్కఱలేదు. సరేకదా! జటావల్కములంధరించి మునివేషధారినై రామనామసంస్మరణముఁ జేయుచు నడవికిఁ బోయి యా శ్రీరామచంద్రుని పాదముల నెత్తిపైఁబెట్టుకొని, యిటకుఁ దీసికొనివచ్చి సింహాసనముపైఁ బెట్టుదును. ఇదియే నా సంకల్పము.

కైక — అటులయిన నేనగ్నిప్రవిష్టనై చావవలసినదేనా?

భర — అటులయినను సరే, గొంతుకకురిఁబోసికొని చచ్చినసరే! ధనపు సంచులు పైనఁ బడవేయించుకొని నలిగి చచ్చినసరే.

కైక — (ముందుకు నడచి) ఇంతవాఁడవైన పుత్త్రుఁడవు నీ వుండఁగ జంపు కొనుటలోఁగల శ్రమము నన్ను నీవు పొందనిచ్చుట న్యాయమా? నీవే చంపుము కానీ — చంపవేమి? చంపవేమి?

(నేపథ్యమున) అమ్మా నీయెడల నేను చేసిన మహోపకారమునకు "చంప వేమి: చంపవేమి" యని నన్ను వెంటాడించుచున్న యీతని కిట్లు ప్రోత్సాహ పఱతువా?

కైక — (అటు చూచి తనలో) అదేమి? అయ్యో! మంథర భయాక్రాంతమై పర్వెత్తుకొని వచ్చుచున్నది.

భర — "చంపవేమి? చంపవేమి" యని మీఁదిమీఁదికి వచ్చుచున్నావు నిన్ను జంపవలసినదే. లోకోత్పాతకారిణి వగునిను జంపిన పుణ్యమేగాని పాపము లేదు. కాని, యటులచేసినయెడల రామునకు నాపై నేమికోపము వచ్చునోయని యింతగా సందేహించుచుంటిని. నీవలన బాధపడుచున్న రాముఁడే నీ కిప్పుడు ప్రాణరక్షకుఁ డయ్యెను.

(నేపథ్యమున) ఛీ! తుమ్మురాలా! ఇంతచేసిన నిన్ను ననేక సహస్ర ఖండ ములుగ గోసెదను.

కైక – (తనలో) అమ్మయ్యో! "నిన్నును" అనుచున్నాడు. ఈకోపస్వభావుడు నన్నుగూడ ఖండించునేమో? భరతునికివలె శత్రుఘ్నునికిమాత్రము రామభీతి యుండకపోవునా? కాన, భయము లేదనుకొందును.

భర – అదుగో! తమ్ముడు శత్రుఘ్నుడు మంథరను వెంటాడించి వచ్చుచున్నాడు. ఇదియంతయు మందరాదుర్బోధనము వలనగలిగినదని తెలియుచున్నది.

(మంథర ముందు పర్వెత్తగ శత్రుఘుడు ప్రవేశము)

శత్రు—గీ. భైరవైతన్మహోపద్రవమున కాది
కారణంబైన యీవక్రగాత్రి నిదిగొ
కండకండలుగాఁ గోసి కావు కావు
మనెడు కాకులఁ కెఱబెట్టెదను మహాత్మ!

భర – ఆహా! తెల్లవారినదికాబోలు! లక్ష్మణానుజా! కావు కావు మని కాకులే యఱచుచుండ మనము కావకుండుట న్యాయమా?

మంథ—భరతరాజేంద్ర! శరణము జొచ్చితిని. నీతమ్ముని వారింపుము.

భర—పలుగాకీ! జగదేక వంద్యు డగురామభద్రుడుండ "రాజేంద్ర" యని నన్ను బిలంతువా?

శత్రు—తప్పుజేసిన దీని నుపేక్షించుట తగవుకాదు. కావున జంపుటకు సెలవిండు. (మంథరజుట్టు బట్టుకొనబోవును.)

మంథ—అమ్మయ్యో! తల్లీ! నీవైన రక్షించు, (కైకచాటునకు బోవును)

భర – అనుజా! సెలవిచ్చుటకు నీవెంతసమర్థుడవో నేనునంతే సమర్థుడను. మనయన్నగారినిగూర్చి ద్రోహ మొనర్చిన దీనిని శిక్షించువెడల నాకృపామయునికి మనపై గోపమువచ్చునేమో? మనకాతండ్రిలేడు. తండ్రితరువాత తండ్రియైన జ్యేష్ఠభ్రాత యిచ్చటలేడు. మనకు దండ్రిగారైనను, అన్నగారైనను, దల్లియైన, గౌసల్యాదేవియే! దీనినిగూర్చి యామె యనుజ్ఞ యెటులో యటు లాచరింపుము.

కై – (అపవారించి) కులటా! "భరతుడు రాజ్యమంగీకరింపడు సుమా" యని నే నెన్నివిధముల జెప్పిన వినక నన్నీతంత్రమున దింపి నాగొంతుగోసితివి. ఛీ పో.

మంథ – (అపవారించి పోవుచు) ఇంతవిశ్వాసఘాతివైన నీగొంతు గోసిన పాపమే మున్నది? (పోబోవును)

శత్రు – నేను రాకుండనీవెచ్చటకుబోయెదవు? కౌసల్యాదేవియొద్ద కీడ్చుకొని పోయెదను. రా. (ఇద్దఱును పోవుదురు.)

(నేపథ్యమున) శత్రుఘ్నుడా భరతు డెచ్చట నున్నాడు?

(తిరిగి నేపథ్యమున)

వసిష్ఠభగవానుడా! కనుటచేతనే తల్లి యని పిలువదగిన కైకేయియొద్ద నున్నాడు. మీరు దయచేయవచ్చును.

భర—మహానుభావా గురువర్యా

[వసిష్ఠుడు ప్రవేశించును.]

గీ. కనినతండ్రిని నామూలముననె జంపి
యడవి కగ్రజు ననుఁగూర్చి వెడలఁగొట్టి
బ్రదికియుండియుఁ జచ్చిన పడఁతియెదుటఁ
జచ్చియు బ్రదికియుంటిని సంయమీంద్ర!

వసి - కాలగతి కెవ రేమిచేయగలరు? విచారింపకుము.

భర - నాకుమఱియందులకుసంతాపములేదు కాని, యొకందులకుమాత్రమున్నది.

వసి - ఎందులకు?

భర—గీ. ఈకుటిల చేయుకుత్రలో నేనుఁగూడ
నుంటి వని రాముచిత్తమం దుండునేమొ!
యనుచు నేడ్చెద నదె సత్యమైన నిటనె
యిపుడె యీ జీవములు త్యజియించువాఁడ.

అపుడు మీరొక మహోపకారము సేయవలయును

గీ. నాదుతండ్రిశవముతోడ నాకళేబ
రముచుఁ దమ్మునిచేత భస్మము నొనర్ప
బంచి, భరతుఁడు శ్రీరామపాదదాసుఁ
డంచు వనికేగి వచియింపు మతనియెదుట.

(వెక్కుచుఁ గాళ్ళపైఁ బడును.)

వసి - వత్సా రామానుజా లెమ్ము. రామభద్రునకు నీపై నెంత మాత్రము కాలుష్యము లేదు. జడువకుము.

(నేపథ్యమున) జడువకు, మంథరా జడువకు. నేను వచ్చుచుంటిని. శత్రుఘ్నుఁడా ఆఁగు

భర - (తనలో)మాఅమ్మ కౌసల్య చిరంజీవితోడను మంథరతోడనిక్కడకే వచ్చుచున్నది. అయ్యయ్యో ఆమె మొగ మెట్టుల చూడగలను.

కైక - (తనలో) నేను దీనిని జూడకుండ లోనికిఁ బోయెదను?

(నిష్క్రమించును.)

(కౌసల్య, శత్రుఘ్నుఁడు, మంథర, ప్రవేశించుచున్నారు.)

కౌస - శత్రుఘ్నా మాప్రారబ్ధమంతయు నిటు లుండ మధ్యమున నిది యేమి చేసెను? దాని నేమియు బాధింపవలదు. విడిచిపెట్టుము.

శత్రు - అమ్మా సరే మంథరా అయినదేదోయైనది. నీకు శిక్షకూడఁ దప్పినది. నీవు రామభద్రునియెడల నంతద్రోహ మేమి కారణమునఁ జేసితివో చెప్పుము.

మంథ — శుభముచూచి సహించుట నా స్వభావము కాకపోవుటచేత నటులు చేసితిని. పట్టాభిషేకము ముందుగ భరతునికి స్థిరపరచిన నిటు లభ్యంతరపెట్టుదాననే.

భర — ఛీ. దుర్మార్గురాలా. నీ గొంతుక కోయదగినదే పో. పో.

(త్రోసివేయును.)

మంథ — (పోవుచు) నాది కాదు. నన్నింతవంకరజేసినండులకు దేవునిది.

(పోవును.)

భర — అమ్మా నమస్కారము.

కౌస — కైకేయిపుత్రా. నిన్నిప్పుడు నే నేమని దీవింపవలసియున్నది? ఐక్ష్వాక సింహాసనమునఁ బట్టాభిషిక్తుఁడవు గమ్మని మీ యమ్మయే దీవించెను. నీదారికడ్డు కలుగునేమోయని నా కొడుకును నట్టడవులకుఁ ద్రోసి నీ నిర్విఘ్న రాజ్యప్రాప్తికి మీయమ్మయే దీవించినది. నీవుగాని నీ తల్లిగాని మావంటివారియెడ నిరాదరణమును గనబఱిచినయెడల నిది మీకు నీతి కాదనిచెప్పి మందలించుటకుఁ బైన వృద్ధరాజేంద్రు డైనలేకుండ నాతనిని లఘుమార్గముగఁ బరలోకమునకనిపి నీయభీష్ట పరిపాలన నిరంకుశత్వమునకై మీయమ్మయే దీవించినది. నీవు

భర — (గుండెలుకొట్టుకొని) ఎంతెంతమాటలు వినుటకు బ్రతికియుంటిని. హా! హృదయమా! ఇంకను పగులకుంటివా? హా! రామా! రామా! రామా! రామా!

(మూర్ఛిల్లును.)

శత్రు — (విసరి) అగ్రజా! లెమ్ము.

భర — (లేచి కౌసల్యకాళ్ళపైబడి) అమ్మా! అమ్మా దోషగంధశూన్యుడ నైన నన్నేల దూషింతువు నేను చంటిపిల్లవాడనై యుండగ నీవు గరములలో బెట్టి నన్నాడించినపుడు నేనెంత పాపరహితుడనో యిప్పుడుకూడ నంతే యను కొనుము. రాఘవునియెడల నాకు గలభక్తికి నీ వెఱుఁగవా? తండ్రి గారెఱుఁగరా? ఈ మహానుభావు డెఱుఁగడా? జను లెఱుఁగరా? నామహాదోష మేదనగ — కైకేయి గర్భమున బుట్టుటయే—

గీ. రామువనవాసమునకు శిరకంపకంప
నమును జేసిన ఖలుఁడు చండాలుఁ డగుత!
గురుమహాద్రోహి యగు గాత! నరకలోక
శాశ్వతావాస శిక్షార్తి సహితుఁ డగుత!

గీ. అట్టిద్రోహి స్వపుత్త్రమాంసాశి యగుతఁ
బ్రబలతనుదీర్ఘరోగదుర్భర మహార్తి
భరితుఁ డగుగాత! నోటను పురుగులు పడి
సకలహైన్యంబు భరియించి చచ్చుఁ గాత!

ఇంకను —

వసి—హరిహరి! చాలుచాలు. వత్సా! నీనిర్లోభత యెవ రెఱుంగనిది? కోసలాత్మజా! నిష్కల్మషహృదయుఁడైన భరతు ననుగ్రహింపుము.

కౌస—పుత్త్రులారా! ఇటురండు. నాయనలారా! మనము శ్రీరామచంద్రుని జూచు టెన్నఁడు? (ఏడ్చును)

భర—అమ్మా! నా సంకల్పము నీవు వినలేదు కాబోలు! నేనిప్పుడు జడలు నారలు ధరించి తాపసవేషమూని, వనములకేగి శ్రీరామచంద్రుని పాదముల సేవించి, యిచ్చటకుఁ దీసికొనివచ్చి, సింహాసనముపై నధిష్ఠింపఁ జేయుదును.

కౌస—పుణ్యాత్ముఁడవైన నాతండ్రీ! మమ్ముఁగూడ నీతోడఁ దీసికొనిపోయి కృతార్థులను జేసెదవా?

భర—అమ్మా! చతురంగ సేనాసమేతులమై యందఱమును పోయి యామహాత్ముని సమస్తవైభవములతో నిటకుఁ దీసికొని వత్తము.

వసి—సరే కాని తెల్లవాఱినది. ఈరోజున దశరథునకు దహనాది పైతృక క్రియలు జరుగవలసియున్నవి. కాన నీవుపోయి స్నానాదికృత్యము లాచరింపవలయును.

భర—భగవానుఁడా! రామచంద్రుఁడు రాజైయున్నాఁడు కదా! ఇంతకాల మీవిధుల నాఁపినవారికి గొన్నిదినములుమాత్ర మాఁపఁగూడదా! జ్యేష్ఠపుత్త్రుఁడు పరమమిత్త్రుఁడైన యామహానుభావుఁడే యీకృత్యముల నాచరించుట కర్హుఁడు కదా! దయచేసి నామనవి నంగీకరింపుడు.

వసి—వత్సా! ఇఁక నాఁపుట కవకాశము లేదు.

కౌస—ఇన్నిదినము లాపుటచేతనే నిందకుఁ బాత్రులైయుంటిమి. ఇంకఁ నాపఁగూడదు తండ్రీ!

భర—మీయిష్టానుసారమే యాచరింతును. నల్వ్వగముచేయవగిన యీయుత్తర క్రియలు మా యిద్దఱిచేతులతోడనే కడతేరవలసినదా? హా! ఎంత ప్రారబ్ధము తటస్థించెను?

వసి—విచారింపకు లే. అందఱము లోనికిఁబోయి తగు ప్రయత్నములో నుందుము రండు.

భర—సరే, ఈకృత్యము ముగిసెదప మనమందఱము వనవాసియైన రాముని జూచుటకుఁ బోవుట నిశ్చయమే కదా!

వసి—అభ్యంతర మేమి?

భర—రామభద్రుఁడిప్పు డడవిలో నేయాశ్రమసమీపమునున్నట్లు వార్త వచ్చినది?

వసి—గుహనివాసమును, భరద్వాజాశ్రమమును దాఁటి, చిత్రకూటమునకు బయలు వెడలిరని సుమంత్రుఁడు చెప్పినాఁడు.

భర—మనము భరద్వాజులవారివలన నాజ్ఞలనుగ్రహించి చిత్రకూటమునకుఁ బోయి యచ్చట రామభద్రుని జూతము. సరే. ఇప్పటికి లోనికిరండు.

(నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము

శ్రీ

పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## సప్తమాంకము

ప్రవేశము:—చిత్రకూటపర్వతసమీపారణ్యభాగము.

(ప్రవేశము:— రాముడు - సీత)

రామ - ఇక్కడ! తమ్ముఁడా! ఇటురా

లక్ష్మ—(ప్రవేశించి) అగ్రజా! మహాప్రమాదము సంభవింపనై యున్నది, సీతాదేవి నెచటనైన భద్రపఱచవలయును. పర్ణశాలలోనియగ్ని జల్లార్పవలయును. మనమిద్దఱము కవచితాంగులమై ధనుష్పాణులమై, యామహాసైన్యమును పర్వతాగ్రి మెక్కి మార్కొనవలయును. తొందరపడుడు. ఇదిగో యీసాలవృక్షశాఖపై మీధను స్సున్నది. తీసికొనుఁడు. (రామునికిఁబోవును) సందేహించుచుంటిరేల? మన కన్నిటి కంటె జానకీరక్షణమే ప్రధానము గావున మీరు తత్సంరక్షణార్థ మామె యొద్దనే యుండుడు. నేనొక్కఁడనుబోయి—

రామ—(నవ్వుచు) పోయి యేమి చేసెదవు?

లక్ష్మ—గీ. అధికదుర్నిరీక్ష్యోగ్రహర్యక్ష మేణ
వితతపైఁబడి యేమి కావించు నీర
సేంధనాళిపైఁబడి యగ్ని యేమి సేయు
నదియె సేనపై కుఱికి యే నాచరింతు.

రామ—ఆసేన యెవ్వరిదో బాగుగఁ గనిపెట్టితివికద!

లక్ష్మ—గీ. గ్రుడ్లు మిఱుమిట్లు గొలుపఁగఁ గోవిదార
కేతు వీక్షించినాఁడను; కేకయాత్మ
జాత్మజుఁడు దుష్టబుద్ధి సౌహార్దహీనుఁ
డుద్ధతుఁడు క్రూరుఁడిట వచ్చుచున్నవాఁడు.

గీ. న్యాయహీనత మాతృచండాలురాలి
మూలమునఁ గన్న ప్రాభవమును మఱింత
బలపఱచు కొంటకై వనవాసయుతుల
మనల మ్రింగవచ్చెను దుష్టజనుఁడు నేఁడు.

సీత—వత్సా సౌమిత్రీ! శ్రీరామభక్తుఁడైన భరతు నటు లనెదవేల?

లక్ష్మ—(చేతులు జోడించుకొని) అమ్మా! క్షమింపుము. అగ్రజా సెలవిమ్ము.

రామ—తొందర యేమియులేదు. అనవసరమగు కోపముఁ జల్లార్చుకొనుము.

లక్ష్మ—అగ్రజా! రామభద్రా!

గీ. ఇంక సహింపను సహియింప విపుడె వానిఁ
జిత్రవధమును జేసి దుశ్చేష్టురాలి
కైకతలఁ ద్రెంపి యసిలతాగ్రమునఁ బెట్టి
మెఱపు మెఱచిన ట్లేను గ్రమ్మెతెద నయ్య.

గీ. పక్షిపతి శ్రీమహావిష్ణువు పరమదైవ
ముల వహించిన గతిని మిమ్ములను మూఁపు
పైఁ గదించి నీ వెక్కఁగవలసినట్టి
సింహపీఠంబు చేరువఁ జేర్తు వేగ.

రామ—లక్ష్మణా! భరతుఁ డిచ్చటకువచ్చుట నిశ్చయమేకద!

లక్ష్మ—వచ్చుటయే కాదు. చచ్చుటకూడను.

రామ—(ఉస్సురనుచు) కఠినోక్తులేల? భరతునిఁ గైకేయిని హింసించి నేఁ జేయవలసిన దేమి?

లక్ష్మ—మీరు జగదానందకరముగ రాజ్య మేలవలయును.

రామ - రాముఁడు ప్రతిజ్ఞాభంగపరాయణుఁడని నీయభిప్రాయమా! రాజ్యాకాంక్షాభూయిష్ఠుఁడని నీ వనుకొనుచుంటివా? మాతా భ్రాతృశిరస్సోపానములమీఁదుగ సింహాసన మెక్కునంతటి క్రూరాత్ముఁడని తలంచుచుంటివా; మదీయ సోదరానంద సౌఖ్యములకే నేను సింహాసన ముపేక్షించితినని నీ వెఱుఁగవా? లక్ష్మణా! ఇంత వెఱ్ఱిపడితి వేమి? చిరంజీవియైన భరతుఁడే వచ్చుచుండ గాఢాలింగనమును జేసికొనవలయును గాని కత్తు లేల? కటారు లేల? కవచము లేల? ఈ కాఱుమాట లేల? అది గాక యాతఁడు మనలఁ జంపుటకే వచ్చుచున్నట్లు నీ కెవరు చెప్పిరి?

లక్ష్మ—క్షమింపుడు. ఈ సేనల కలకలము లేల? ఆ యాశ్వికులధావనము లేల? గజపంక్తులచే నీమొట్టడులేల? ఇదిగాక...

రామ—నీవు భ్రమించునంతసంకులము నాకేమియుఁ గానఁబడుటలేదు. పరే భరతుఁడు రామశిరచ్ఛేదమునకే వచ్చియుండు ననుకొందము; అతని కేమి లాభము?

లక్ష్మ—(చెవులు మూసికొని) మహాత్మా! నేనిట్టి దారుణ వాక్యములు విన గలనా?

రామ—భరతుని జంపుదునన్న కఠినతరవాక్యములు నేను వినఁగలననియే నా చెవిని వైచితివా?

లక్ష్మ - రామచంద్రా! భరతుఁడు దురాత్ముఁడు; కావున నటులు పలికితిని

రామ - భరతుఁడు నన్నుఁ జంపుటకు వచ్చెనేమోయని నీవు సంశయపడుటచేత నతఁడు దుర్మార్గుఁడును భరతుని జిత్రవధము జేసెదననియును, కైకేయిశిరము ఖడ్గాగ్రమునఁ బెట్టెదననియు నీవు నా యెదుట నిస్సంశయముగ, గంతోక్తిగ బలుకుటచేత నీవు సన్మార్గుఁడవు నా ? కాని నన్నుఁ జంపుటచే నతని కేమిలాభమో నీవూహించి చెప్పుము.

లక్ష్మ - రాజ్యమందు మతెంత నిరంకుశము నిరభ్యంతరముగ స్థిరపడుటకై—

రామ - అనఁగ నేను వనమునుండి వచ్చి తన్ను రాజ్యహీనుని జేయుకొందునని యేనా ?

లక్ష్మ - (చేతులు జోడించుకొని) చి—త్తము.

రామ - నాయందు విశేషానురాగముగలవాఁడై నన్నే పితృతుల్యునిగ నన్నే గురుసమునిగ భావించి సేవించు నమృతమయాంతఃకరణుఁడైన భరతునిపై నీకటూహ మున్నట్లే భరతునికి నాపై దపోహమున్నదని యెంచుచుంటివా ? భరతుఁడు నన్ను సత్యహీనునిగ భావించుచున్నాఁడా ? నన్నేలుబ్ధాగ్రేసరునిగ నూహించుచున్నాఁడా ? మహనీయగుణోత్తరుఁడైన తనకంటె నాకీ మట్టియొక్కువయని నిశ్చయించుకొనినాఁడా! సౌమిత్రీ ! రాజ్యముపై స్థిరపడుటకంటివి ! కొంచెమైన స్థిరపడినట్లు నీ కెట్లు తెలిసినది ?

లక్ష్మ - పట్టాభిషిక్తుఁడు కాకుండనే యీ సైన్యముపై నింత యనర్గళాధికార మెటులు కలిగియుండును ?

రామ - తండ్రిగారి సైన్యముల నిచ్చుటచేతఁ దీసికొని రాఁగూడదా ?

లక్ష్మ - రాజ్యమునుగూడఁ దండ్రిగారటులే యొసంగకుందురా ?

రామ - ఇచ్చిన నాతఁడేల స్వీకరించును ?

లక్ష్మ - రాజ్యవాంఛచేత.

రామ - అట్టివాంఛ యాతని కుండెనని యేమాత్రమైన వెల్లడి చేసినట్లు నీవు వినియుంటివా ?

లక్ష్మ - అవసరము రానిదే యేల వెల్లడించును ?

రామ - అతని దుర్మార్గత నీ వింతకుముం దేవిషయమునైన వినియుంటివా ?

లక్ష్మ - స్వప్రయోజనావసరము రాకముందు జనులెల్ల సన్మార్గులే. అవసరించు నపుడు యోగ్యతాయోగ్యతలు తెలియఁగలసినది.

గీ. అర్థితయె లేక పైఁబడినట్టి రాజ్య
మేల భరతుండు త్యజియించు ? నిద్ధరిత్రి
వశమయిన సార్వభౌమత వదలుకొనఁగ
నందఱును రాము లనుకొంటివా మహాత్మ !

రామ - అందఱును రాములు కాకపోవచ్చునుగాని మీరందఱు రాములగుదురే కద ! నీకు నాయందింతభక్తియుండఁగ భరతునికిమాత్ర మన్యథాయుండునా ? అటు.

తిన్నఁదొండడు. తాత గారిగృహమునుండి యయోధ్యకువచ్చి యంతయును విని తల్లిని నిందించి పట్టాభిషేక మొల్లక మనలఁ జూచుటకొఱకు భరతుఁడు వచ్చుచున్నాఁడని నాయభిప్రాయము.

గీ. నీ వహంకారివి, యనహంభావు డతఁడు
మఱి స్వతంత్రుఁడ వౌ దీవు పరతంత్రుఁ
డతఁడు నాయెడ మీ కుండు గతు లిటులు ప్ర
బలుఁ, బరునియెడ భక్తి ప్రపత్తు లటులు.

గీ. అట్టి పరమసాధుని, దయాయత్తచిత్తు
సరససద్గుణజాలుఁ బ్రజ్ఞానశీలు
భరతు నేమైనఁ జేసినఁ బలికిన, నవి
యెల్ల నాకొనర్చితివని యెంతు నేను.

గీ. భరతు నిందించి నను రాజ్యపదవిఁ గొమ్మ
టంచు నింకొకసారి నీ వాడు నెడల
భరతుతోఁ జెప్పి యారాజ్యపదము నీకు
నతనిచే గట్ట బెట్టింతు నయ్య! నిజము.

లక్ష్మ - మహాత్మా మీదాస్యము కంటే నాకు రాజ్య మెక్కువదికాదు.

రామ - నీకేకాదు భరతునికిఁగూడ నటులే

లక్ష్మ - అగ్రజా! అజ్ఞానకృత మగు నాపరిసంగమును క్షమింపవలయును.

రామ — గీ. కోప మెంతవచ్చిన బంధుకోటిఁ జంప
సాహసించుట తగవె? నీసాటివారు
కొంద ఱున్నఁ ద్రేతాయుగంబందె ప్రళయ
లీలఁ జేయఁజాలుదురు కాఁబోలు నయ్య

సీత - (అపవారించి) నాథా, సౌమిత్రి లజ్జాసంతప్తచిత్తుఁడైవున్నాఁడు. వెంటనే బుజ్జగింపవలయును.

రామ - లక్ష్మణా, భరతునిపై నీకపోహము వదలెను. గాన నేనే భరతుఁడ నని యెంచి నమస్కారపూర్వకముగఁ గౌగలింపుము.

లక్ష్మ - క్షమింపుము. (నమస్కరించును.)

రామ - (లక్ష్మణుని కౌగలించి) భరతుఁ డే వేషముననున్నాఁడో నీవు చూచితివా?

లక్ష్మ - నేను భరతుని జూడలేదు.

రామ - (నవ్వుచు) అలాగా మనలఁ జూచుటకును, తిరిగిపోవునప్పుడు పరమ పుణ్యహారి యగు జానకిని దీసికొనిపోవుటకును మన తండ్రిగారే వచ్చుచున్నారేమో?

సీత - అబ్బ, నేను మిమ్ము విడిచి వెళ్ళను.

లక్ష్మ - తండ్రిగారు వచ్చుచున్నట్లు నాకు దోచలేదు.

రామ - ఏల ?

లక్ష్మ - ఆయన శ్వేతచ్ఛత్రాదిచిహ్నములు బొత్తిగాఁ గనబడుటలేదు.

రామ - ఆఁ, కనబడనేలేదా? తమ్ముఁడా, ఏమైనకీడు ?మూడియుండ దుకదా, సీతా ? మా నాయనగారి జీవములనుగూర్చి నేను సందేహపడుచున్నాను. అప్పటికి భరతశత్రుఘ్నులైన వచ్చిరో చిరకాలసేవకుండైన సుమంత్రుడే సుతుడయ్యెనో ?

సీత - అట్టియుపద్రవము జరిగియుండిన మనకు వార్తరాకుండునా ?

రామ - ఏమోకాని మనస్సు కలతనొందుచున్నది. మనముపోయి పర్ణశాల యొద్దనే భరతాదులను గలసికొందము రండు.

గీ. అమ్మలను దమ్ములను జూతునంచు ముదము
గలుగదేలొకో ? కడుపులోపలను బెద్ద
కాయిపడె; నెట్టివార్త కర్ణములఁ బడునో ?
హేతుశూన్యార్తి యూరకే యేగదెపుడు.

తమ్ముఁడా ఇటురా, ( సీతారామలక్ష్మణులు పోవుదురు )

భర - (వెంటనే ప్రవేశించి ) అగ్రజా. యెక్కడ నుంటివయ్యా.

గీ. రామ. రాఘవ రఘువీర ! రామచంద్ర !
రామభద్ర ! శ్రీజానకీ ప్రాణనాథ
పుండరీకాక్ష ! లక్ష్మణపూర్వజ, యెట
నుంటివోయయ్య ! దర్శన మొసఁగ రాదె ?

గురూత్తమా! భరద్వాజులవారు సెలవిచ్చిన ప్రదేశ మిదియైయుండునా?

[ వసిష్ఠుఁడు! సుమంత్రుఁడు జాబాలి ప్రవేశింతురు. ]

వసి - అటులే తోఁచుచున్నది.

జాబా - తోచుటమాత్రమేకాదు, నిశ్చయముగ నిజమే. అదె చిత్రకూట పర్వతము ! అదె భగవతియగు మందాకిని !

భర - సుమంత్రుఁడా ! బాగుగ పరిశీలింపుము. ఆకొండచరియయందలి సమ ప్రదేశమున నదియొక కుటీరముకాదా ?

సుమంత్రు - అది పర్ణశాలవలె కానిపించుచున్నది. సన్నసైన ధూమరేఖ దానిపై గనఁబడుచున్నది. నిత్యాగ్నిహోత్రులై పవిత్రులైన యేమునీశ్వరుల కుటీరమో ?

జాబా - ఏ మునీశ్వరులో యననేల ? మన మునిబాలకుల యాశ్రమమే యది. అటు పోవుదము రండు.

భర — సుమంత్రుఁడా ఎంచులకైనను మంచిది. రాముని వాసముచేఁ బవిత్రమైన యీ ప్రదేశమునకు మనగుర్రములుగాని గజములుగాని యితర సేనలుగాని సమ్మర్దము గలుగఁజేయకుండునట్లు నీవుపోయి సేనాధిపతి కాజ్ఞాపింపుము.

సుమ — సేనాపతీ వింటివా ? భరతుని యాజ్ఞ

[నేపథ్యమున] చిత్తము

భర — ఓ చిత్రకూటపర్వతమా !

గీ. భవ్య రేఖాకలిత రామభద్రుచరణ
పద్మసంస్పర్శనాఢ్యతఁ బడసి తీవు
జననమేదైన, నున్కి యెచ్చటను నైనఁ
బుణ్యమునఁగాని కలదె సత్పురుష సేవ?

ఓ వనమృగములారా!

గీ. అట నిటను రాముకై దేవులాడు చిటను
వచ్చినను, గానబడఁ డని వనరుచుంటి
వనికి రాముఁడే మిముఁ జూడ వచ్చినాఁడు
వసుధ మీభాగ్య మెన్న నెవ్వనికి వశము?

మునీంద్రులారా! రండు! శ్రీతాలక్ష్మణసమేత శ్రీరామచంద్రా! ఎక్కడనుంటివి? ఆ పర్ణశాలయొద్దకుఁ బోవుదమురండు, సుమంత్రుఁడా! ఆశ్రమమునకు సమ్మర్దము గలుగుట యనుచితము కావు నీ విచ్చటనే యుండుము.

[భరతుఁడు, జాబాలి, వసిష్ఠుడు నిష్క్రమింతురు]

సుమం — (అటునిటు పరిక్రమించి) భరతాదులు పర్ణశాలకు బోయిరి. (అటు నిటుమాచి) అహో ! కౌసల్యాదేవియొడిలో గూరుచుండి భరతశత్రుఘ్నులను కౌఁగిలించుకొని, శ్రీరామమూర్తి పితృమరణమునకై యెటులు విలపించుచున్నాడో ! ఎంత కరుణముగ నున్నది? విచారపడవలదని జాబాలి వారిని వారించుచున్నాఁడు. శ్రీరామమూర్తి కన్నీరునింపఁగ సహింపలేక యాశ్రమమృగము లెట్లు డిల్లపడిచూచి బాష్పములు నించుచున్నవో !

గీ. నల్వు రగుభ్రాత లడుగో! స్నానం బొనర్చి
గుసిశరముల నూతఁగాఁ గొంచు నదిని
వెలుపడిరి, మత్స్యమూర్తితో జలధినుండి
వెలికివచ్చు నాలుగు వేదములను బోలె.

అహా!

గీ. రామచంద్రుఁడు పితృదేవరాజి కంబ
శాంబుయుక్తముగాఁ దర్పణంబు లొసంగి,

పితృవరుబా కింగుదీపిష్టపిండ మెటుల
వదలుచున్నాడొ? బాష్పసంభరితుఁ డగుచు

గీ. సర్వసాగర మేఖలానిర్వహణప
టిష్టుఁ డింద్రవైభవనిబిడీ కృతుఁడగు
ప్రభునిక్రియలు నట్లడవిలోపలను జరుగ
వలసె; విధిబలిష్టత యెంతో తెలియు వశమె;

అరుగో! రామలక్ష్మణజాబాలివసిష్ఠభరతు లిటకే వచ్చుచున్నట్లున్నారు। సీతాది స్త్రీజనము శత్రుఘ్నపూర్వకముగఁ బర్ణశాలఁ బ్రవేశించినది.

(రాముఁడు, లక్ష్మణుఁడు, భరతుఁడు, వసిష్ఠుఁడు, జాబాలి ప్రవేశించుచున్నారు.)

వసి — వత్సా — రామచంద్రా। విచారింపకుము.

రామ — సుమంత్రుఁడా।

గీ. తండ్రిగారి ప్రాచీనహితపరుఁడైన
నిన్నుఁ జూచినతోనె నా నేత్రములకుఁ
దండ్రియే, కానఁబడినట్లు తలఁతు నేను
నిన్ను విడనాడిపోయెనే నీదుసఖుఁడు

సుమం — (తనలో) ఈమహామహుని పూర్వభాషిత్వగుణ మీసంతాపమునైనఁ బరిత్యజింపనట్టి గాఁ యున్నది. (ప్రకాశముగ) వత్సా! దాశరథీ! పుత్రవంతులలో, నగ్రగణ్యుఁడైన మీతండ్రిగారి ఋణముఁదీర్చి కృతార్థుఁడవైతివి। మీ తండ్రి వెడలి పోయినట్లే నేనుగూడ శీఘ్రముగ మిమ్ముస్మరించుచుఁ బోవలయుననికోరుచున్నాను।

రామ—గీ. పడ్రసానూనరుచ్యభక్ష్యములఁ దినిన
పితను నింగుదీవిరచితపిండ మందఁ
జేసినాఁడఁ గ్రూరుఁడ నేమి సేయువాఁడ
నంతకంటెను గతి గల్గదయ్యొ! నాను.

జాబా — వత్సా! అటులు విచారింపఁదగదు పితృదేవత లనువారనుభవించునది మన శ్రద్ధగాని యన్నముగాదు.

వసి — రామభద్రా! జాబాల్యాదిగ మీ కులగురువులు, మీ ముగ్గురు తల్లులు, ముగ్గురు సోదరులు, సుమంత్రుఁడు సమస్తసైన్యము వనవాసివైన నిన్ను సేవింపవచ్చిన యీ మహాజనులందరిని బట్టిచూడ నరణ్యమే యయోధ్యయయినది. మాకందఱకిటు మీతో నుండుభాగ్య మొసంగవలయును, లేదేని పురమునమీరు మాతో నుండుభాగ్య మైన నొసంగవలయును.

జాబా - ఆ సంగతిని బ్రార్థించుటకేకదా పవిత్రుడైనభరతు డిటకు విచ్చే, సెను. భరతుడా ! అన్నగారితో మనవి జేసికొనుము.

భర - (లేచి, చేతులు జోడించుకొని గద్గదస్వరమున) అగ్రజా, రామచంద్రా ! (పైమాట జెప్పలేక కన్నీరు గ్రుక్కుకొనును.)

రామ - వత్సా ! భరతా ! లేవనక్కరలేదు. తండ్రీ భయమేల ? కూరు చుండి చెప్పుము.

గీ. యుష్మదభిసంధి యిప్పటి కుంచు మటుల
వల్కలము లేల ? జట లేల ? వనము లేల ?
సుఖవిసర్జన మేల ? యీ శోక మేల ?
మునిగతు లివేల ? చెప్పుము, ముందు తండ్రి

జా - (తనలో) యుష్మదభిసంధి యిప్పటికుంచుమటు" లని రాముడని నాడు, భరతయాత్ర నిష్ఫలమగునని తోచుచున్నది.

భర - అగ్రజా ! దాశరథీ !

గీ. నీకు వనవాసఖేదంబు, లోకమందుఁ
బట్టఁజాలని యపకీర్తి, ప్రభునిచావు,
భరతరాజ్య ప్రశంస, నాపాలి మృత్యు
వైన తల్లిచేఁ గల్గెనయ్యా మహాత్మ !

గీ. ఆమె దుర్వాంఛ లేను నావంతయైన
నెఱిఁగియుండిన, నూహించి యుఱకయున్న
స్వప్నమందైన విని యుపేక్ష యొనరించిన
నిలువునను భస్మమై పోవలయు నేను.

గీ. తాము వదలుటచేఁ బవిత్రత్వ మేది
యున్న గతిలేని రాష్ట్రమం దుండలేక
త్వచ్చరణపద్మ కైంకర్యతత్పరతను
వచ్చినాఁడను ; కృపను బ్రోవంగదయ్యా !

గీ. ఈ జటలు చీర లేమని పృచ్ఛఁజేసి
నారు; మీకేది యుచితమో నాకు నదియె
తగును; గురువు లేదారి నరిగిరో పిల్ల
వార లా దారినే బోవవలయుఁ గాదె.

రామ — సెబాస్ ! తమ్ముడా ! నీమాటలు నీ గుణ సమీచీనతను సూచించు చున్నవి. పెద్దలేర్పరిచిన క్రమము బాలుర కవశ్యకర్తవ్యమని సర్వజన సమంజసమైన నీతి నుపన్యసించితివి.

గీ. నాఁడు సభలోన మనతండ్రి, నాకరణ్య
వాసమును, నీకు రాజ్యవైభవమటంచుఁ
బలుకు మాటలను దలఁ దాల్చి, వచ్చినాఁడఁ
గాదువ నీవంతు చెల్లించుకొనుము నీవు.

గీ. మనకు బ్రదు కిచ్చు మనతండ్రి మరణసమయ
వాంఛలను దీర్పలేకున్న వార మయిన
మన బ్రతుకు లేల ? భువి నింక గనఁ దలంచు
వారు బిడ్డలకై యాసపడుదురయ్య ?

భర - మహానుభావా ! మొదటఁ దమపట్టాభిషేకమని తండ్రిగారు స్థిరపరచి రట నావంటి మందభాగ్యుడు గలిగినందువలన మాతల్లికి బుట్టిన దురాశాచింత చేఁ బ్రోత్సాహ పెట్టబడి, సతీవశుడై కఠినకఠోరమైన యీ యాజ్ఞాద్వంద్వము నాతడు చేసెనట.

రామ - ఆతడేమిచేయగలడు ? మన మెటులు సత్యవాక్యమునకు బద్ధులమో యాతఁడుకూడ నటులే మీ తల్లి కసురయుద్ధకాలమున నిచ్చిన వరద్వయమును నెఱ వేర్చి, స్వవాక్యవిఘాతము రాకుండ సత్యరక్షణమును జేసికొనుభార మాతనియందుం డెను గదా ?

భర - అట్టిచో గురుసన్నిధానమున దండ్రిగారు చేసిన తమ పట్టాభిషేక నిర్ణయ మును మాత్రము తప్పిపోవుట సత్యహాని కాదా ?

రామ - అనుజా నీ కొక్క సంగతి జెప్పెదను విను. నీ తల్లిగారిని వివాహ మాడబోవునపుడు మనతండ్రిగారిచ్చిన కన్యాశుల్క మేదో నీవు వినియుంటివా ?

భర - ఆనతీయ వేడెదను.

రామ - ఆమె గర్భమునఁ బుట్టుపుత్రున కీ రాజ్యము నిచ్చెదనని మీ మాతా మహునితో మనతండ్రి వాగ్దానము చేసెను. అట్టిపూర్వ రచితసత్యవాక్యవిరోధముగఁ దండ్రిగారు నాపట్టాభిషేకమును స్థిరపఱచినను దానిని నెఱవేర్పక పోయినను సత్య హాని లేదు.

భర — (చేతులుజోడించుకొని) మనతండ్రి నామాతామహునకు జేసిన వాగ్దా నము నాటిదికాదు. ఇక్ష్వాకుచక్రవర్తినాటిదికాదు. మన వంశమూలపురుషుడైన సూర్యుని తరువాతనుండి వచ్చుచున్న యీయనూచానాచారమునకు విరుద్ధముగఁ జ్యేష్ఠపుత్రుడే పట్టాభిషేకార్హుఁడనని సృష్ట్యాది సమాగత పూర్వాచారమునకు విరుద్ధముగ మనతండ్రిగారు మాతాతగారి కన్యకొఱకు, జన్మింపని కుసుమని

రాజ్యమును గూర్చి చేసిన యీ విపరీత వాగ్దాన మేల చెల్లవయ్యెలనో నన్ను క్షమించి దేవరవారు సెలవిచ్చెదరుగాక ।

రామ – (చిరునగవుతో) వత్సా ! భరతా ! చెప్పెదను వినుము. ఆవాగ్దానము చెల్లుటయుఁ జెల్లకపోవుటయు మనమిప్పుడాలోచింపఁ బనిలేదు. నీపట్టాభిషేకమును నావనవాసమును దత్పూర్వసత్కృతముగ వచ్చినవికావు. వానికి మీ తల్లిగారి వరద్వయమే కారణము నా పట్టాభిషేకమును మానినందువలనఁ దండ్రిగారికి సత్యదోషము రాలేదని చెప్పుటకుఁ గాను, నీవును నేను బుట్టినపుడుకూడఁ జేయబడినతండ్రిగారి యీ ప్రాచీన వాగ్దానమునుగూర్చి ప్రశంసించితిని.

భర – జ్యేష్ఠానుక్రమాచారమునకు విరోధముగ మనతండ్రిగారు మాతల్లి కిట్టి యసందర్భవరముల నీయవచ్చునా ? ఇచ్చిన నవి నెఱవేర్ప దగునా ?

రామ – నాయనా ! మనకు శాసనమని యాచారమని రెండు. రెండును ముఖ్యములేగాని శాసనము ప్రసిద్ధము. ఆచారము ప్రపంచయాత్ర సదుపాయము కొఱకు మనచేనిర్మింపఁబడినది. సత్యమాడవలయుననునది శాసనము. జ్యేష్ఠపుత్రపట్టాభిషేక మాచారము. మనతండ్రిగారు తన సత్యమునే నిలుపుకొనఁదలచినచో బూర్వాచారవైరుధ్యము గలుగును. పూర్వాచారమునే యనుసరించినచో దైవరూపమగు సత్యమున కున్మూలనము గలుగును. అట్టిసంధియందు మహానిపుణుడైన మన తండ్రిగారు సత్యమునే పరిపాలించి పూర్వాచారమును పరిత్యజించి సత్యవంతులలో నగ్రగణ్యులనిపించుకొని కృతార్థులైరి.

గీ. చట్టమున కెప్పు డాచారసరణి భేద
మగునొ యాచారమును ద్రోయ దగును తండ్రి
శ్రుతికిని స్మృతి యెపుడు విరుద్ధమగునొ
యపుడె స్మృతి నిరాకరణీయ మగునుగాదె ?

కావున గీ. సర్వవిధముల దండ్రిరాజ్యంబు నీదె
కానలో నీదు మునివేషకలన నేను
గానఁగాలేను నాయనా ! దీని మాని
త్వరగఁ బట్టభద్రుడవు గావలయు నీవు.

భర — గీ. సర్వవిధములఁ దండ్రి రాజ్యంబు నాదె
యగుట దానిని రామచంద్రార్పణంబుఁ
జేసికొంటిని శ్రీరామ దాసుఁడ నగు
నితనితో బాటు జనులఁ బాలింపవయ్య !

(సాష్టాంగపడి యేడ్చును.)

వసి - శెబాస్ భరతుఁడా !

రామ - నాయనా ! లే, ఊరకుందుము, విచారింపకు.

(కన్నీళ్లు దుడిచి తన కన్నీరు దుడుచుకొనును.)

గీ. ఎఱిఁగియుండియు నిటు పల్కు టేల తండ్రి !
సత్యబద్ధుఁడవై కదా జనపదంబు
వదలి యడవిలో నుంటిఁ; గావలసినద్ది
సత్యపాలనమో ? జనశాసనంబొ ?

గీ. నేను నాతండ్రి యానతి నిందఁజేసి
యెటులు రాగల్గుదును రాజ్య మేలుటకును ?
విను, త్రిలోకరాజ్యము లభించినను గాని
తండ్రిమాటకు నే జవదాఁటఁ జాల.

భర - మహాత్మా ! రామచంద్రా ! మీరు పితృశాసనవిరుద్ధముగ నయోధ్యకు రానక్కఱలేదు. కాని,

గీ. వనొసఁగు రాజ్యమును స్వీకరింపవలయు
నేను రాజనుమాట సహింపలేను
రాముఁడే రాజనకయున్న బ్రిదుకలేను
వనిని మీరుండి పాలింపవచ్చునయ్య !

రామ - వత్సా !

గీ. రాజసదసున మనతండ్రి రామ భరత
గతవిభేదముఁ జేసె నీగాత్ర మటవిఁ
బెట్టి యధికారమును సింహాపీఠిఁ బెట్టి
వఱల, నాయాచరణము సంకరముగాదె ?

భర - అట్టి సందేహ మున్న నటుల వలదు.

గీ. బరువు మోయుంగవలసిన యిరువురు నరు
లెటులొ మోయుంగఁ దగుఁగాని యిర్వురందు
ముందువాఁడు వెనుక కేగి, ముందునకును
వెనుకవాఁ డేగి వహియింప భేద మేమి ?

అలాగే

గీ. కలిసి తండ్రియానతిఁ దీర్పవలయు మనము
వ్రతములను మార్చుకొనినను బాధ గలదె ?

ఏలుఁడీ మీర, లేఁ బదునాలుగేండ్లు
నడవి జరియించి పరమ ధన్యతను గాంతు.

వసి—సెబాస్ ! భరతుఁడా ! ఎంత గురుభక్తియుక్తుడవు! ఎంత వైరాగ్య సంపన్నుఁడవు ?

రామ—(ముక్కుపైఁ జేయివైచుకొని) వత్సా! భరతా! ఎంతవాఁడవు ? తండ్రీ! ఇటురా. ఇటురా. (కౌఁగలించుకొనును) (వవ్వుచు) బరువుమోయువారలలోఁ ముందువాఁడు పెద్దవాఁడు, వెనుకవాఁడు చిన్నవాఁడుగా నుండవలయునని యాబరువున కధికారి యాజ్ఞాపించుచో నట్టిమార్పు చేయదగినదేకద. ఆర్తిచేఁజెప్పినమాటయే. చెప్పుచున్నావు. నాయనా ! నాకు వనవాసము తప్పదు. నీకుఁ దండ్రిగారి యాజ్ఞా ప్రకారమే కాకుండ, నాయాజ్ఞ చేఁగూడ రాజ్యపాలనముతప్పదు. జ్యేష్ఠపుత్రుఁడనై రాజ్యార్హుఁడనైన నాకు రాజ్యము లేదని నీవు పరితపింప వలదు.

సీ. నిఖిలకోసలభూమి నీకు రాజ్యం బౌను
నాకు రాష్ట్రము కాననస్థలంబు
స్వచ్ఛాతపత్రిసచ్ఛాయ నేలుదు వీవు
మృదుతరుచ్ఛాయ నేలుదును నేను
వరసంఘు పరిపాలనయశంబు నీవంతు
నావంతు మృగపాలన ప్రతిష్ఠ
తమ్ముకుఱ్ఱఁడు నీకుఁ దగు సహాయుండగు
భ్రాతచేతను సుఖపడుదు నేను
గీ. దండ్రిమకుటంబు శిరమునఁ దాల్తు వీవు
తండ్రిమాటను నేను మూర్థమునఁ దాల్తు
నీ మునీంద్రులు నిన్ను దీవించుచుంద
రా ఋషీశులు దీవింతు రయ్య నన్ను.

వసి—(తనలో) ఆహా! దివ్యమహర్షులు రామ భరత సంభాషణ శ్రవణ కుతూహలులై యంతరిక్షమున నిలచియున్నారు. ఇది యెంతటి సుదినము !

భర—ఓజాబాలి వసిష్ఠ మునీంద్రులారా! నేనింక నేమి, చేయగలను? మీరైన మీశిష్యున కుపదేశింపరా ? దీనుడైన భరతుడు రామవిశ్లేషమును సహించి బ్రదుక లేదని యానతీయరాదా? ఓ దయామయులారా! ఊరకుందురా?

జాబా—(అపవారించి) వసిష్ఠా! నీవు ప్రసంగింపుము.

వసి—(అపవారించి) "జాబాలి వసిష్ఠులారా" యని భరతుడు మనల నుద్దేశించినాడు కావున ప్రథమమందు నీవే ప్రసంగింపక తప్పదు.

జాబా - (అపవారించి) ఏవో కొన్ని వెఱ్ఱిమొఱ్ఱి మాటలఁ జెప్పెదను. (ప్రకాశముగా) శ్రీరామభద్రా। మహాధీమంతుఁడవైన నీవప్రాజ్ఞపురుషునివలె నాచరించుచుంటివి।

గీ. తండ్రియానతిఁ బట్టి సత్య ప్రపాల
నంబుకై, పరలోక సౌఖ్యంబు కొఱకు
వనిని వసియింతు నంటి వెవ్వండు తండ్రి ?
సత్య మెక్కడ ? పరలోక సరణియేది ?

గీ. నరుఁ డొకఁడె పుట్టు; నొక్కఁడె యరుగు ; నతని
కెవఁడు లేఁ డెవ్వనికి నెవ్వ డేమి కాఁడు
తల్లిదండ్రి కొడు కను బంధతతి యెల్ల
వస్తుతత్త్వజ్ఞతాభావభవఫలంబు.

గీ. కాన బంక్తిరథుఁడు తండ్రి కాఁడు నీకు
నతని సుతుఁడవు కావు నీ వతనిమాటఁ
బాటిసేయంగఁ దగ దయ; ప్రజ్ఞ లేని
వారు పలికెదు సత్యంబు వదలుమయ్య !

గీ. ఆత్మ యనునది మిథ్య ; దేహంబె యాత్మ
భూతపరమాణు సంవాసమునను నొక్క-
వింత చైతన్యశక్తి యావిర్భవించె
కిణ్వవస్త్వాదుల మదశక్తివలె రామ !

గీ. ప్రబల భూతచతుష్టయ బంధురాపు
బంధమే బంధమౌఁజుమ్ము ; ప్రాణమోక్ష
మే యగును మోక్ష సామ్రాజ్య; మింతకంటెఁ
బలుకులోఁ దక్క బర మనుపదము లేదు.

గీ. తనసుఖంబునె తాఁ జూచుకొనఁగవలయుఁ
బరులతో నంతకంటెను పనియె లేదు;
చందనాది సుఖంబులే స్వర్గ మగును;
జ్వరకృపాణాది బాధలే నరక మగును.

గీ. అందఱి యనుభూతిని నున్నయంశ మిదియె;
చెప్ప నొక్కఁడువలెనె ? యోజింపవలెనె ?

మనకుఁ బ్రత్యక్షమే నిదర్శనము, కాన
సర్వలోక సమ్మత మతసరణి యిదియె.

గీ. దేహసౌఖ్యమె సౌఖ్యము; దేహపీడ
పీడ; కావునఁ గానను వీడి నాదు
పలుకు మన్నించి, భరతు నాపదను బాపి
ప్రజలఁ బాలించి, సుఖియించి పరిబలు మయ్య !

రామ — మునికులతిలకా ! గురుశిష్యులిద్దఱకు నసదృశమైన విచిత్రోపదేశమొనర్చిరి.

గీ. నేను దశరథసుతుఁడను గానో ! యతని
పలుకు వినరాదో ? యెవని కేన్వండు కాఁడో ?
అట్టిచో మీ రెవ రని మీరానతిచ్చు
ననవసరవాక్య మిపుడు నే వినఁగవలయు ?

గీ. భరతుమాట నే మన్నింప భరతుఁ డెవ్వ
డే నెవండను ? జను లెవ్వ రేల వారి
నేలవలెఁ దండ్రిమాట మన్నింప దగదు
నాదుపలుకును విను మన న్యాయమగునె ?

గీ. మును లెఱుంగని వచనము ల్భువిని గలవె
కాని మీ రన్నమాటల కేను మాఱు
పలుక కుంటను మనసుండఁబట్టకుండెఁ
గాన దయతోడ క్షమియింపు మానివర్య !

గీ. మనల మనతల్లి గనుచుండ మనము చూడ
లేదు; చూడలే దని తల్లి గా దటంచు
ననుటలే ; దెందుచేత ? బ్రత్యక్ష మొకడెఁ
గాదు ; శబ్దానుమానము ల్గలవు మనకు,

గీ. నాస్తికుండు ప్రత్యక్షమే యనుసరించి
వంధ్య తనతల్లియం చనవలసివచ్చు
నేమొ ? ప్రత్యక్ష మొక్కఁడే యెపుడు పనికి
రాదు చార్వాకునంతటి ప్రాజ్ఞునకును.

గీ. భూత సన్నిపాతంబునఁ జేతనాఖ్య
శక్తి యుదయించె నంటి, రాశక్తిగలుగు

చుండఁ జూచినవాఁడేడి ? యుండుటకును
సాధనం బేడనయ్య వాచంయమీంద్ర !

గీ. కాన నేతద్వచన మనుమానమున నె
కలిగె ; వృద్ధిక్షయాది సంకలిత దేహ
మాత్రమైనఁ బూర్వపుస్మృతు లలవడుటకు
నేమి యవకాశ మున్నదో యెంచరాదె ?

గీ. ఇంత యున్నను, మఱియుఁ దానింత యున్న,
నవయవము లన్ని యూడిన, నల్ల "నేను"
మాఱ ; దది స్థిరము తనువు మరణ మొందు ;
నేను లే ననుమాట యెట్లేని గలదె ?

గీ. కానఁబ్రత్యక్షమున కనుమాన శబ్ద
ములనుగూడఁ జేర్పకపోవఁ దలముగాదు
ప్రాణమోక్షమే మోక్ష సామ్రాజ్య పదవి
యనెడు వాక్యంబు పరిహాస్యాస్పదంబు.

గీ. శిశుహసన కుచపానాదిచేష్ట లెటులు
కలిగెఁ? బూర్వానుభూతి లేక యెటు కలుగు
రాగమును ద్వేషమును ? తనుప్రాప్తి లేక
యనుభవం బెట్లు ? కానఁ బ్రాక్తనువు నిజము.

గీ. కారణము లేని విముఖత, కారణంబు
లేనిదయ, యొకని కొకని పైనఁ గలుగఁ
దఱచు చూచెద ; మది యిహ తనువిరచిత
కృత్యఫలము గాదు, పురాతకృత్యఫలము.

గీ. పూర్వజన్మంబు నిజ మాట, ముందుజన్మ
మటులె జీవాత్మ కుండుట యద్భుతంబె
నిన్న యను పూర్వసంజ్ఞతో నున్న కాల
మునకు జే పెట్టు లుండక పోవునయ్య ?

గీ. జన్మవైషమ్యకరణదక్షం బగునది
కర్మ ; ముత్తమాధమకర్మకలన, వరుసఁ,

పుణ్యపాప జన్మములగు; మోక్ష మనఁగ
నీపునర్జన్మ రాహిత్యమే మునీంద్ర !

గీ. కృత్య జన్మాంతరంబు లంగీకరింప
బరము వానితోడిదె; సత్యపాలనంబు
కర్మములలోన నుత్తమకర్మమగుట
నేను శ్రద్ధతోడుత నాచరింతు దాని

గీ. నిజసుఖాప్తియే యుత్తమనీతి యన్న
బలులచే మర్త్యులు బాధపడరె ? జగము
కలహసంక్షోభ మొందదె ? కర్మధర్మ
తతి నశింపదె ప్రళయంబు త్వరగరాదె ?

గీ. ఆత్మయున్నది పరమున్న; దదియుఁగాక
యున్న దదుకొని నడువ, లేకుంటకీడు
లేకయున్నను, లేదని వీఁకె నడువ
నమితహానియగా నున్కి-యథార్థమైన.

గీ. దురుపదేశంబు చేసినందులకు నేను
జింత నొందను, నాతండ్రి చెలిమికాఁడ
నైన నీతోడఁ జర్చింప నయ్యెనింత
యనుచుఁ జింతిఁతు; క్షమియింపుమయ్య నన్ను.

జా-గీ. లేదు లేదని నేఁ బల్క లేనిదగునె ?
లేదనెడు వృత్తితోఁ బల్కలేదు; మఱియు
లేకపోవుట యెన్నఁడు లేదు; కాని
లేదన గతంబు లేకపోలేదు; రామ !

రామ - వినఁదలచితిని?

జా-గీ. శిష్టరక్షణ దుష్టసంశిక్షణార్థ
మవతరించిన లోకోత్తరావతార
మవనియుప్పొంగి, మనీషి మహితపాల
నము నపేక్షించియుంటి మిన్నాళ్ళవఱకు

గీ. అట్టిచో మాపలె జటాలిఁ జుట్టి, ముక్కు-
మూసికొని, జాడ్యమున వనమునను గూరు
చుంట, ధర్మసంకటముగా నుండెఁ గాదె ?
జగతి నీ వుద్ధరింపక జరుగుటెటులు ;

గీ. ఇట్టి యఖిలలోకాపద యెనసియుండఁ
దండ్రిపలుకంచు, వనమందుఁ దఱలిరా న
టంచుఁ బలుక న్యాయంబె ; లోకాళిఁ బ్రోవ
వలసినప్పుడు తండ్రిమాటలు ఘనంబె ?

గీ. భువనవిపులార్తిముందట పుత్రుఁ డెవఁడు
దండ్రియెవఁ డంచుఁ బలికెదెఁ; తత్త్వదృష్టిఁ
దలఁప, బరమాత్మవౌ నీకు దండ్రి యెవ్వఁ ?
డేది నీ కాత్మ ? పరము నీ కెక్కడయ్య ?

వసి—(తనలో) జాబాలి యెటులో దాఁటుకొనిపోయినాఁడు (ప్రకాశముగ) వత్సా! రామభద్రా! భరతుఁడు, జాబాలి చెప్పినదానికంటె నే నెక్కువ చెప్పఁజాలను నీ యభిప్రాయమునుజూడఁ జెప్పనక్కఱయు లేదు. కాని చెప్పకపోవుటకు మనసంగీకరింపకున్నది, దేహప్రదానమున మాతాపితలెల్లరు పూజ్యులో యనిరాకరణీయులలోఁ బ్రజ్ఞాప్రదానమున గురుఁడుఁగూడ నటులే కాన, నామాటఁ ద్రోసివేయక భరతుని ముద్దుఁ జెల్లింపుము.

రామ—మహాత్మా! మీరు నాకుఁ బితృసములు. ఏమాత్రమును సందేహము లేదు. మీరు నాకుమేదైన నాజ్ఞాపింపుఁడు ప్రాణములు విడుచుచును సైనఁ జేయుదును. అంతేకాని మా తండ్రియాజ్ఞను నిరోధింపుమని మీ రాజ్ఞ యిడుట న్యాయమా? మీయాజ్ఞ నుల్లంఘింపుమని మాతల్లి యాజ్ఞయైనచో నా మాట నేనువిందునా? వినకపోయినను దల్లి క్షమింపదా ? అటులే మీరును.

భర—ఓ యార్యులారా! ఓ మహామునులారా! నాదు మందభాగ్యముచేత, నా మహాపాపముచేత శ్రీరామచంద్రుఁడు నా ప్రార్థనలను మీ యాజ్ఞలను గైకొనఁడయ్యెను. మీ రేమి చేయఁగలరు? ఓ జనులారా! ఓ కోసలదేశ వాస్తవ్యులారా! రామ వనవాస దర్శన వాంఛగతులారా! మీ కొక్క మనవిఁ జేసికొందును వినుఁడు.

సీ. రామాభిషేకమో, రామాభిషేకమో
యన పలవించినయట్టి మీదు

కుత్తుక లొత్తదలంటఁ గోసెను మాతల్లి;
రామచంద్రుని బాసి బ్రతుకఁగలరె
"మమ్మేలు మమ్మేలుమా" యంచుఁ బలుకుఁడీ,
బతిమాలుఁడీ; దైన్యభాషణముల
మోడ్పుచేతుల నెత్తి మ్రొక్కుఁడీ; పదముల
భక్తితోఁ జాగిలఁబడుఁడీ; కడుపు

గీ. మంటదీఱ నందఱు నొక్కమాఱు గొంతు
లెత్తి పెల్లున నేడ్వుఁడీ; యొకపుడు
సరసవాక్తతికంబె నిష్కపటసాంఘి
కార్తిఁ గురుదయాపాత్రమై యాలకుఁజూండి

[నేపథ్యమున] రామభద్రా! రామచంద్రా! మమ్ముఁ బాలించువారెవరు? మిమ్ము విడిచి బ్రదుకఁగలమా? మమ్మెవ్వరి కప్పగింతువు? రక్షించు రక్షించు.

రామ — జనులారా!

గీ. ఎవఁడు తన రాజ్యమును నాకు నీయఁ దలఁచి
వచ్చెనో? యెవఁడు వైరాగ్యవైభవుండో?
ఎవఁడు జనరంజనచణసమిద్ధగుణుఁడో?
యట్టి నా తమ్మునికి మిమ్ము నప్పగింతు.

భర — హా! హా! హరిహరీ ఎంత ప్రారబ్ధము తటస్థించెను! ఇంతేనా! జనులారా ఊరకుంటిరా? ఇట్లు జెప్పువారెవ్వరు లేరా? అందఱును రామసన్నిధిని మూగలే యయిరా? నా పాపమింతేనా జగదవనకళాసాంద్రుఁడయిన శ్రీరామచంద్రుఁ డుండ, నిర్భాగ్యుఁడనైన భరతుఁడు సింహాసనమునఁ గూర్చుండవలసినదేనా? (ఏడ్చుచు) ఓ సుమంత్రుఁడా నీవేనైన మాయన్నగారికిఁ జెప్పరాదా?

సుమం — వత్సా! ఊరడిల్లుము.

భర — ఊరడిల్లుదును. సంపూర్ణముగ శాంతినొందుదును. ఆ కుశాస్తరణమును దెచ్చి యిక్కడ దయయుంచి పఱుపుము.

సుమం — అదేల?

భర — నేనే తెచ్చుకొందును, నీకు శ్రమ యేల?

(తాను తెచ్చుకొని పఱచుకొనును)

గీ. అశనమును మాని యంబుపానాశ వదలి
పంచపవమానచలనంబు బందుచేసి

విమలకుశశయ్యఁ బ్రాయోపవేశ మినేఁడు
వ్రతము నేనాచరింతు శ్రీరామచంద్ర !

(నమస్కరించి కుశశయ్యపైఁ గూరుచుండును.)

రామ—(కన్నులనీరుగ్రుక్కుకొని) నాతండ్రీ! నేను నీకేమి యపకార మొనర్చితినని నీవస్తువేది హరించితినని, నీవిట్టి భయంకర వ్రతమును నాయెదుటఁ బూనఁ దలఁచితివి ? తమ కిచ్చిన ఋణమును హరించిన పాపాత్ముల గృహములయెదుట బ్రాహ్మణులు చేయఁదగిన యీ ఘోరవ్రతము క్షత్రియులమైన మనకుఁ దగునా ? తగదు. తప్పుపనిఁ జేసితివి కానఁ బ్రాయశ్చిత్తార్థమై నన్ను స్పృశించి పిదప జలమును స్పృశియింపుము.

భర—హా! ఈప్రయత్నముకూడ విఫలమా! (అటులు చేయును)

[నేపథ్యమున] భరతుఁడా! నీవు నీతండ్రి యుత్తమలోకసుఖమునకై చూచువాఁడవైనయెడల రామభద్రునిమాట వినక తప్పదు రాముఁ డెల్లప్పుడిట్లే తండ్రియెడల సత్యవాక్య పరిపాలన దీక్షాదక్షుఁడై యుండవలయునని మాయభిప్రాయము. కైకేయి గుఱించి చేసిన సత్యవాక్యము నిర్వహించుకొనుటచే దశరథుఁడు స్వర్గసుఖ మందుచున్నాఁడు.

రామ – (చేతులు జోడించుకొని) దివ్యర్షులారా! నమస్కారము. మీ వాక్యములు శిరమున ధరింపఁబడినది తమ్ముఁడా! పరమర్షులయాజ్ఞ యెటులున్నదో వింటివి కాదా ? ఇఁక నిర్విచారముగఁ బరిపాలింపుము.

భర – (ఏడ్చుచు) ఇంతే! ఇంతే! మీరు రారా? నేనొక్కఁడనే పోవలసినదా? మహాప్రభూ! నాకు రాజ్యమక్కఱలేదు, జ్యేష్ఠులరైన మీ రెప్పుడు రాజ్యమును నిరాకరించితిరో యప్పుడు దానికిఁ గనిష్ఠుఁ డర్హుఁడు [illegible] మర్హుఁడను గాను, నా రాజ్యమును శత్రుఘ్నున కిచ్చి మీతో [illegible] గడుపుకొందును. ఆ మాత్రమైనఁ గటాక్షింపుఁడు. (పాదస్పర్శ [illegible])

రామ – (భరతుని లేవనెత్తి తొడపైఁ గూరుచుండఁబెట్టుకొని) అట్లు కాదు తండ్రీ! చెప్పినమాట విను. తండ్రిగారి యానతి కొక నిస్వరి ముల్లంతయైన మనము భేద మొనర్చిన, నాయన యుత్తమలోక సౌఖ్యమునకు భంగము కలుగును. అది యటుండనిమ్ము.

సీ. స్థిరమైననడవడి దరుల కందఱకును
వలయును, రాజ్యచాపల్యమునను
నేఁ దండ్రిమాటను నిరసింప లోకులు
పరిహసింపరు ? రామువంటి కొడుకు,
భరతసౌమిత్రులవంటితమ్ములు, సీత
వంటిభార్యయు, లేరు వసుధ నంచు

ముందుయుగంబులఁ బురుషులు తలలూప
వలదె? యీరీతిని వారునడచు
గీ. కొనవలదె? కష్టసుఖములు మనకు శాశ్వ
తములే! పదునాలుగేడులు దాటఁ దిరిగి
రానే? ధరను బాలింపనే? దాని నంత
వఱకు దయ నీవు బాలింప వలదె? తండ్రి!

భర—మహానుభావా! మీ రట్లు బోధించుచున్నారు. గావునః మీ చిహ్న మేదైన నాకు దయచేసినయెడల దానిని బురస్కృతముగ జేసికొని నేను బాలింతును.

రాము—అలాగే! తండ్రీ! నీ యిష్టమైన దానిని వాంఛింపుము.

భర—మీచరణములతో మీపాదుకలను స్పృశించుఁడు దానిని నేను గ్రహింతును.

రామ—(అటులు చేయును.)

భర—(పాదుకలను దీసికొని కనుల నద్దుకొని) మహాప్రసాదము మహానుభావా, ఈవిధముగానైన దాసుని ధన్యాత్ముని జేసిరి.

రామ—ఇఁక నొక్కమాట.

గీ. నీవు పల్లెత్తుమాటైన నీదుతల్లి
ననిన నాతోడు భారుణీతనయతోడు
సత్యావాగ్దీక్ష ననిశంబు సలుపవలయుఁ
బ్రిజలు నీ పుత్త్రులని యెంచవలయు నయ్య!

నీవు పురమునకుఁ బొమ్ము; ఇఁక నేను బోయెదను.

భర—రామా, రామా, రామా, (ఏడ్చుచు) ఈ పదునాలుగేండ్లెంత దీర్ఘమో యంత దీర్ఘమైన గాఢాశ్లేషము నా కొసఁగవలయును.

రాము—(కౌగిలించుకొని) ఈ కౌగిలి యెంతదీర్ఘమో యీ చతుర్దశవత్సరపరిమితికూడ నంతదీర్ఘముగనే యుండునని కొనుము. మునీంద్రులారా, నమస్కారము, నాకు సెలవిండు. లక్ష్మణా, నేను బర్ణశాలకుఁ బోయి మనతల్లుల నాశ్వాసించి, వారిని భరతశిబిరమునకు శత్రుఘ్నునిచేఁ బంపెదను, నీవు మునీంద్రులయొద్దను భరతునొద్దను సెలవుఁదీసికొని, వచ్చి మనకుటీరమునఁ గలిసికొనుము. ఇప్పుడె మందరి యాశ్రమమునకుఁ బోవలయును.

భర—అగ్రజా, ఈ పదునాలుగేండ్లు గడచిన యుత్తరక్షణమున మీరు రాకుండిన నే నగ్నిప్రవేశ మొనర్తును. నిశ్చయము నిశ్చయము.

రామ—రాకపోవుట కూడనా?

(రాముఁడు నిష్క్రమించును.)

లక్ష్మ — (బట్ట మెడఁజుట్టుకొని భరతునికి సాష్టాంగపడి) అగ్రజా, రాజ్యలోభమున్న రామచంద్రునికి ద్రోహ మొనర్చుటకు నీవు వచ్చుచుంటివని నీయెడల బహు ఘోరమైన యపోహ మొందితిని. క్షమింపుము.

భర — తమ్ముఁడా, లెమ్ము. అది నీదోషము గాదు. మా తల్లిదోషము. నీవొక్కఁడవె నన్నన్యథా యెంచితి ననుకొంటివా? గుహుఁడో! భరద్వాజుడో! వీరు ప్రత్యక్షముగ నడిగినారు, యేడ్చి, యేడ్చి నా నిర్దోషతను వారియొద్ద వెల్లడించుకొంటిని.

లక్ష్మ - అగ్రజా; గుహుఁడు పరమభక్తుఁడు సీతారాము లిద్దఱు గుహానివాసప్రాంతమున నిద్రించుచుండ నేను వారిరక్షణమునకై మేలుకొని వారిచుట్టు ఖడ్గపాణినై తిరుగుచుంటిని. నేను జానకీరాములకేమి యుపకార మొనరింతునోయని గుహుఁడు నాపైఁ గాపుఁ గాయుచుండెడినఁట.

వసి - లక్ష్మణా, నీవంతయే వింటివి; గుహునిపై సందేహముతో నాతనిభటులాతనిపై గాపుండిరఁట,

భర - లోకోత్తరుఁడైన శ్రీరామచంద్రమూర్తియందలి భక్తియందఱి నటులుం చేయించినది. అందఱు నేను ద్రోహినని సంశయించినవారే! నాదినముల మహిమట్టిది.

వసి - నీ చిత్రకూట యాత్రచేతను, నీశరణాగతి చేతను, శ్రీపాదుకాగ్రహణముచేతను నీవు శ్రీరామతుల్యుఁడవని లోకమునకు వెల్లడియైనది కాదా?

లక్ష్మ - అన్నగారు నాకొఱకు వేచియుందురేమో! నాకు సెలవిండు. మునీంద్రులారా! నమస్కారము. అగ్రజా, నమస్కారము (పోవును.)

వసి - భరతా! మనమిఁక నయోధ్యకుఁ బోవుదము రమ్ము.

భర - రాముఁడులేని నయోధ్య నేఁ బ్రవేశింతునా ?

వసి - ఈ పాదుకల నెక్కడ నభిషేకింతువు?

భర- నందిగ్రామములో

వసి - సరి అక్కడకైనఁ బోవుదము రా,

భర - మునీంద్రా, నాకొక్క యాలోచనము తోఁచుచున్నది. రామునికి మాతండ్రి పట్టాభిషేకము సేయఁదలఁచి సర్వప్రయత్నములఁజేసి తుదకుఁ జేయలేక పోయెను. చిత్రకూట మెక్కడ? నందిగ్రామ మెక్కడ? ఎన్ని యరణ్యములో దాటి పోవలయునుగదా ఈలోపున నేను దేహవ్యాధిచే మరణింపఁగూడదా? సర్పదష్టుఁడనై మృతినొందఁగూడదా? దేహము లశాశ్వతములుగదా, ఈ పాదుకాభిషేక వైభవమైన నాకన్నులఁ బడదేమో; కావున, నీస్థలమునసే యిప్పుడే వీని నభిషేకింపవలయును,

వసి – అనేకవస్తు సంఘములు కావలయునే! ఇచ్చట నెట్లగును?

భర – అక్కఱలేదు లఘుమార్గముగ నభిషేకింపుము. తరువాత నందిగ్రామమున విద్యుక్తముగ సమస్తవైభవసమన్వితముగఁ జేసికొనవచ్చును.

వసి – ఎందులకీ తొందర? ఇక్కడ సింహాసనమైన లేదే.

భర – అటులన నేల (మోఁకరించి) నేనే సింహాసనమును నా శిరముపై శ్రీపాదుకల నుంచుకొంటిని అభిషేకింపుఁడు.

వసి – (కమండలూదకమున నభిషేకించి) ఓ సాకేతపురవాసులారా! మీ పుణ్యవశమున భరతుఁడు శ్రీపాదుకాద్వయమును సంగ్రహించుకొనివచ్చినాఁడు. మీకీ పాదుకాద్వయమే ప్రభువు. రాజ్యవ్యవహారములన్నియు నీపాదుకలకు నివేదించిభరతుఁడు తత్పురస్కారముగఁ బరిపాలించును.

[నేపథ్యమున] జయము – జయము – శ్రీపాదుకలకు జయము.

వసి – భరతుఁడా! లెమ్ము శ్రీపాదుకాపట్టాభిషేకమైనది నీవు ధన్యాత్ముఁడ వైతివి. ఇఁక నీవు కోరదగిన దేది?

భర – మీదయచే నింతవఱకుఁ గృతార్థుఁడనైతిని. ఇఁక నందిగ్రామమునకు బోవుట తప్ప చేయుకోరిక లేదు. ఐన నిటుల గోరెదను.

గీ. ధరణి యీతిబాధలు లేక తనరుఁగాక!
పరిజల యన్యోన్యవైరము ల్బాయుఁగాక!
కవిత రాజపోషణమునఁ గ్రాలుఁగాక!
నీతిపాలనమున రాజు నెగడుఁగాక!



వసి – తథాస్తు. తథాస్తు.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది సప్తమాంకముతో సర్వమును సంపూర్ణము.

---

# రాధాకృష్ణ నాటకము

గ్రంథకర్త : పానుగంటి లక్ష్మీనరశింహారావు పంతులుగారు

వెల 0—12—0

# భీష్మ బ్రహ్మచారి

(గ్రంథకర్త:—కీ॥ శే॥ సోమరాజు రామానుజరావుగారు)

బెజవాడ మైలవరం బాలభారతీసమాజమువారిచే పలుసారులు ప్రదర్శింపఁబడి పండిత పామరజనులచే నేకగ్రీవముగ స్తుతింపఁబడిన, భీష్మబ్రహ్మచారి నిత్యబ్రహ్మచారియగు భీష్ముని చరిత్రము జన్మము మొదలు మరణమువఱకు నిందు వ్రాయఁబడినది. శంతనునకు తన పెంపుడు బిడ్డయగు సత్యవతి నిచ్చి వివాహముచేసి రాజబంధువుఁ డనిపించుకొనిన దాశవంశీయ ప్రభువును, అనాగరక శిఖామణియు నగు దాశరాజు "నాకు చాణాకోప మొచ్చింది మంతిరీ!" అని పలుకుచు రంగస్థలమునఁ బ్రవేశించిన హాస్యఘట్టము మొదలు ముఖ్య కథకు మధ్య మధ్యను వచ్చు దాశరాజాంతఃపుర రహస్యములును—రాజు—రాణి నడుమఁ బ్రవర్తిల్లిన అనాగరక ప్రణయకలహములును—మహాద్భుత హాస్యరసపరిపూరితములై కడుపుబ్బ నవ్వించుచుండును. గంగా శంతనుల సంవాదమునందు యుక్తివాదమును, భీష్మప్రతిన యందు గంభీరమైన పితృభక్తియు—స్వయంవరరంగమున శృంగార హాస్య వీర రసములును, పరశురామప్రవేశమున భయానకమును, అంబప్రతిజ్ఞ - అగ్నిప్రవేశములయందు భీభత్సమును, విచిత్రవీర్య మరణ ఘట్టమున శోకరసమును ఉద్భవిల్లి చదువరులను వివిధభావము లందు ముంచి యెత్తుచుండును. సాళ్వుని మధుపానరంగము నవ్వుల్లోన పారవశ్యముం గలిగించును. భీష్మార్జునుల సంగ్రామము భయదాయకము—భీష్మపతనముతో భరతవాక్యము! చక్కని పాటలు - రసవంతములగు పద్యములు గలిగి, పత్రికాధిపతుల చక్కని యభిప్రాయములఁ బడసి; ముద్దులొలుకు చిత్రపటములతో - సర్వాంగసుందరముగా—పాలమీగడవంటి ఆర్టుపేపరులో ప్రప్రథమమున ముద్రింపఁబడిన ప్రసిద్ధనాటకము.

వెల రు 1—9—0.

---

పలయువారు:- సరస్వతీ బుక్ డిపో. విజయవాడ—1.

# ★ లోభి ★

గ్రంథకర్త:

కీర్తిశేషులైన మహాకవి

## శ్రీ పానుగంటి విజయ రాఘవరావుగారు

సకల గుణాభిరాముడు లోభి – వడ్డీలకోసం వేదవాక్యాలు సంపదకోసం సంఘ సంస్కారాలు–అసలే ఫాయిదాల వసూలు కోసం ఆప్తవాక్యాలు– కనకంకోసం శునకచేష్టలు, వృద్ధవివాహాలంటే ఉబలాటం స్త్రీవిద్యంటే చీదరింపూ, పేదవాళ్ళంటే బెదరింపూ, కన్నకొడుకంటే కొఱలుకొఱలు, కన్నబిడ్డలంటే కంటగింపు, ఆశ్రితులంటే ఏవగింపూ నౌకర్లని బెదరింపూ, అందరిమీదా అనుమానాస్త్రాలు, అతి తెలివి తేటలు, అభియోగాలు, అన్నీ మూర్తీభవించివున్న నాటకం లోభి. పోకేళాలంటే అతని కంటికి చవటపీనుగులు, సనాతన ధర్మాభివృద్ధికి చవిటినేల, కరుణారసం అతనికి కంటికలికం, వితరణ గుణం అతనికి ప్రబల విరోధి, అనుమానం అతనిసొమ్ము. అబద్ధాలు అతని ఆత్మ, అసత్య ప్రమాణాలు అతని పంచప్రాణాలు ఖర్చు అతనికి కంఠపాశం, విద్య అతనికి ఉరిత్రాడు. లోకం తనకుపకారం చెయ్యాలి, తను లోకానికి అపకారం చెయ్యాలి. అందుకే అతడు అవతరించాడు.

అద్భుత సంఘటనలతో. ఆదర్శ సన్నివేశాలతో ఆనంద రసాన్ని ఒలికించే సంభాషణలతో, చక్కని వ్యావహారిక భాషలో వ్రాయబడిన సాంఘిక నాటకం, నాటకప్రదర్శనాలకీ సినిమా చిత్రనిర్మాణానికీ అనుగుణ్యమైన నాటకరాజం లోభి ప్రయత్నాలు ఫలప్రదమౌతాయో, తారుమారవుతాయో, ఒకప్రతికొని వెంటనే చదవండి. పానుగంటివారి రచనా సమర్థత ఈనాటకంలోకూడా ప్రతిభగాంచింది. కొలది ప్రతులు మాత్రమే ముద్రించినాము. త్వరపడుడు: వెల **1-8-0**